# రాజమన్నారు

## - - - నాటికలు - - -



పాకాల వెంకట రాజమన్నారు





దేశి కవితా మండలి
విజయవాడ-2

# ఉపోద్ఘాతం

రాజమన్నారుగారి నాటికలను ఇదివరకు నమ్మాళ్వారుగారూ, అభ్యుదయ రచయితల సంఘం వారూ ప్రచురించి యున్నారు. ఇది — దేశి కవితా మండలి వారి ప్రచురణ—ఇప్పటికి నిండైన ప్రచురణ. రాజమన్నారుగారి లేఖినినుండి ఏకాంకికలూ, నాటికలూ, నాటకాలూ ఇంకా రావాలి. వస్తాయనే నా ఆశ.

లోక వృత్తానుకరణమే నాటకానికి ఇతివృత్త మైనప్పటికీ నాటకం మానవ జీవితానికి ఛాయాచిత్రంలాంటి అనుకరణ కాదు. ఆశయాల విగోధము వల్లా, యత్నాల సంఘర్షణలవల్లా చిత్ర విచిత్రంగా మళ్ళీ జీవితానికి రసమయ చిత్రణ నాటకము. ఒక కథయొక్క పరిణామ వైచిత్రిని గుర్తించి నాటకకారుడు చకితుడై, తన్మయుడై, సృష్టి వైచిత్రిని ఆనందిస్తాడు. తరువాత ఈ ఆనందాన్ని ఇతరులకు కూడా కలిగించాలని నాటకము రచిస్తాడు. కనుక నాటక పఠనానికీ నాటకప్రదర్శనానికీ పరిణామము మానవస్వభావ వైచిత్రి సందర్శన ఫలితముగా కలిగే ఆనందము.

రాజమన్నారుగారి నాటికల సందేశాలకు వైచిత్రీ వైలక్షిణ్యమూ ఉంటాయి. 'వేశ్యలకు ప్రేమాభిమానాలు లేవని నిరసిస్తాము, కాని పాపము వారికా రెండూ నిష్ఫలాలు, ధనవంతులైతేనేమి, సంకల్పము ఒకటైతే పర్యవసానం మరొకలాగ వుంటుంది; మాతృప్రేమకి లోతెవరు కొలవగలరు? లోకం కత్తులబోను; నిర్దాక్షిణ్యపు నియమాలతో సంఘం దెయ్యాలలంక అయిపోతోంది; ధనవంతునికి ఆధ్యాత్మిక రాజ్యం దుర్గమం; తథాగతుని దిగ్విజయంలో లోకాన్ని సౌందర్యవంతం చేసే ప్రేమజ్యోతులెన్నో ఆరిపోయాయి. సంస్కారమన్నది ప్రజలనుదాటి పెద్ద అంగలు వెయ్యలేదు.

ఆదర్శాలు అనుభవాన్ని దాటిపోతే బాధయే పర్యవసానము; లోకాన్ని ప్రేమ జయించగల కాలం ఇంకా రాలేదు' అన్న సందేశాలు సహజమైనవి, సమాజానికి పైపైన తేలే బెండ్లు కావు.

ఈ సందేశాలు అనుభవానికి రావాలంటే నాటికల కథలు రసవంతాలై ప్రేక్షకుల హృదయాన్ని ఆర్ద్రము చేయాలి. కథల నడుమను జీవితానుభవాల్ని పేనిన జడలాగా సాగిపోవాలి. మానవసత్వము మాత్రము చాలదు; మానవత్వముండాలి, నాటికలలో. ఈ సంపుటంలోని నాటికలు ఇంచుమించు అన్నీ, మానవజీవితానికి నెరచాపా మకుటాయమాని అయిన ప్రేమానుభూతి మానసముల అందపు టనతారాన్ని చూపేటివే. రాజమన్నారువంటి మేధావి సృష్టికి అంతరాత్మ ఆసేదికూడా సంఘనియమాలకు లోబడివున్నదే అని తెలుస్తుంది. దాన్ని తెలుసుకోడానికి సామాన్యులకు ఇంకా కొంతకాలము పట్టవచ్చును. అలాగని 'బంధాలు' అన్నవారి నాటిక మనకి నేరుమాత్రం కావడములేదు. అద్భుత రసమాధుర్యము దానిని 'నిజంగా గొప్ప' నాటికగా చేసింది. ప్రేమా, సంఘపరిస్థితులూ, గొప్ప మనస్సులూ రంగరించుకుపోయాయి దానిలో.

నాటిక దృశ్యకావ్యము కూడాను కదూ? దాని శరీరము చాలా అల్పము. అది అంతమాత్రంతోనే మనలను ఆకర్షించాలంటే ప్రతి అడుగూ మన అపేక్షని లాగుకుంటూ పోవాలి, అలాగు చేస్తూనే కథను పూర్తిగా చెప్పాలి, పాత్రలు రచయిత నడిపినట్టుగా కనబడి పోకుండా సహజంగా వర్తించినట్లే గోచరించాలి. మనము అనుకోని పాత్రలప్రవేశములు కల్పించి, పాత్రల అంతర్గత స్వభావాన్ని సందులలోకి సాగదీసి, స్వభావభేదమున్న వ్యక్తులను సన్నివేశపరిచే, రాజమన్నారుగారు ఈ మూడుగుణాల్ని సాధించారు.

నాటిక అంటే పూర్వముండిన అర్థము ఇప్పుడు లేదు. చిన్ననాటకాన్నే నాటిక అంటున్నారిప్పుడు. నాటకంలో రెండుపక్షాలూ, జగడమూ వుంటాయి సామాన్యంగా. ఈ రెండుపక్షాలూ లాగే మార్గంలోకి మళ్ళి

పోకుండా కథ మధ్యేమార్గంగా, పరిష్కారమైపోతుంది. ఎవరికీకాని ఈ సమాప్తము ప్రేక్షకుల్ని చకితుల్ని చేస్తుంది. ఇక నాటిక అనగా చిన్న నాటకమాయె, నాటకంలో తీరుబాటుగా పెంచడానికి వీలయిన సన్నివేశాలు నాటికలలో అతిత్వరగా జరగాలి. అలాగని కథ స్వాభావసిద్ధంగా సాగిపోవాలి కాని కుదించి అణిచినట్లు కనబడకూడదు. పర్యవసానం-బండరాళ్ళసందుల్లోంచి త్వరత్వరగా ప్రవాహం నదిలో సంగమించే సెలయేరులాగ – క్లుప్తములో తేలిపోవాలి. రాజమన్నారుగారి నాటికలలో ఈ లక్షణం బాగా గోచరిస్తుంది. జమీందారుగారిని వదిలేయమని తన్ను అడగడానికి జమీందారిణి వస్తోందనుకున్న చిత్రరేఖని జమీందారే విడిచి వెళ్ళిపోతాడు. లేచిన తర్వాత భర్తను పీకి పిండి పెట్టాలనుకునే గయ్యాళిని విడిచి భర్తేవచ్చిపోతాడు. అయితే ఒక్కొక్కప్పుడు ఒక పర్యవసానం జరిగి అంతమాత్రంతో మన మనస్సులకు సమాధానం కానప్పుడు ఈ పర్యవసానానికి వ్యతిరేకపు పర్యవసానం తీరి, కథని పూర్తిచేయడంకూడా కనబడుతుంది. చిన్నకథల్లోనే కాకుండా నాటికలలో కూడా ఈ పతాక, ప్రతిపతాక దశలు సాధ్యమే సాధించినవారు మాత్రము కొద్ది. వారిలో రాజమన్నారుగారు ఒకరు అని ఊరుకోలేను; ముఖ్యులంటాను. కాలుజారిన బాలవితంతువును రక్షించడానికి సత్యనారాయణ తల్లినీ తండ్రినీ విడిచైనా వెళ్ళిపోతాడు. తరువాత వారు అతనికి కబురంపి, తిరిగి వచ్చేయమంటారు. ఈ కాస్త విరామంలో సత్యనారాయణ తనకోసం పడే బాధ చూడలేక ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటుంది. వైకుంఠంనుంచి తాళపత్రలేఖలు తెప్పించుతున్నానని వెర్రిప్రజను దోచుకుంటున్న వైకుంఠాచార్యుల్ని ఇద్దరు యువకులు ఆ వుపాయం వారి ఇరుకునబెట్టి నొక్కబోతే అతడు ఆ వుపాయంచేతనే తప్పించుకుని వారి నిద్దరినీ గ్రామస్థులచేత తరిమిస్తాడు. మొదటిపతాకలో 'మంచిపని అయింది' అని చంకలు గుద్దుకొంటూనే ప్రతి పతాక తాకిడికి మనం విస్తుపోతాము.

పాత్రపోషణలో రాజమన్నారుగారిది అందెవేసిన చేయి. ఛెకోవ్ కోరస్ గరల్ కంటె చిత్రరేఖ తెలివైనది; టాగూరు మాలినికంటె రామలక్ష్మమ్మ

గారిబుద్ధి సూక్ష్మమైనదీ మనస్సు పెద్దదీనూ; కనకమూ సునందా ఉజ్జ్వలము లైన పాత్రలు; జయశ్రీ బుచ్చిబాబు తిష్యరక్షితను పంపిస్తుంది. ఆమె చంచల అయితే ఈమె ఉల్క. తన ప్రేమావేగములో జ్వలించి నశించి పోయింది.

నాటిక ఆవరణలాగే ఉపోద్ఘాతం ఆవరణకూడా చిన్నదే. స్త్రీ మూర్తి సహస్రాధిక శీతలకిరణాలు వెదజల్లుతూ రాజమన్నారు లేఖినినుంచి ధారాళం సృష్టి కావాలి. అస్తు.

అనంతపురం,
9_8_'58

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.



## నాటికలు





# పాత్రలు :

| | | |
|---|---|---|
| వేణుగోపాల్ | ... | |
| సోమసుందరం | ... | వేణు పెద్దతండ్రి |
| సుందరమ్మ | ... | సోము॥ రెండవ భార్య |
| కృష్ణమూర్తి | ... | సోము॥ కుమారుడు |
| శంకరశాస్త్రి | ... | సోము॥ స్నేహితుడు |
| కనకాంగి | ... | వేశ్య, వేణు భార్య |
| నిర్మల | ... | సోము॥ మొదటి భార్య కూతురు |

కాలం — ప్రస్తుతం

---

# 'ఏమి మగవాళ్లు!'

రంగము : సోమసుందరంగారి ఇంట్లో

భోజనంచేసి తాంబూలం వేసుకుంటున్నారు సోమసుందరంగారు. వయసు సుమారు 50. ప్రాతకాలంవాడే. బుర్రముక్కు, స్థూలకాయం, అయితే ఒడ్డూ పొడుగూ ఉండడంచేత అసహ్యాంగా లేదు.

సుందరమ్మగారు సోమసుందరంగారి రెండవభార్య. మొదటిభార్య ఒక్క కూతుర్ని వదిలిపెట్టి గతించింది. సుందరమ్మకు 25 కన్న ఏండ్లు ఎక్కువ ఉండవు. సన్నగా ఉండటం చాలించిందిగాని ఇంకా లావు కాలేదు. అందంగానే ఉంటుంది. ముస్తాబు క్రొత్తరకమే. గ్రామఫోను తిప్పుతూ నిలబడివుంది.

ప్రక్కనే కృష్ణమూర్తి రికార్డులను అందిస్తూ నిలబడ్డాడు, సోమసుందరంగారి తమ్ముడు. బక్కపలచగా ఉంటాడు. వయసు 25. ఖద్దరుపంచా, చొక్కా, క్రాపు, కంటి కద్దాలు.

సుందరమ్మ సావకాశంగా ఉన్నప్పుడల్లా కృష్ణమూర్తివంకనే చూస్తూఉంటుంది. కృష్ణమూర్తిమాత్రం ఎప్పుడో తప్ప, గోడమీది బొమ్మలు, పైకప్పు చూస్తుంటాడు......

నిర్మల (10 సం॥) సోమసుందరంగారి మొదటిభార్య కూతురు. గుమ్మందగ్గరకు వచ్చి పాట వింటూ నిలబడ్డది.

సుందరమ్మ: (నిర్మలతో) వెళ్ళు. వెళ్ళి చదువుకో, పాటలేమిటి చిన్నపిల్లలికి ?

నిర్మల: పాఠాలన్నీ చదివేశాను పిన్నీ.

సుం : అబద్ధం.

నిర్మ : లేదు. నిజంగా.

సుం : చూడండి!

సోమసుందరం: చిన్నమాటలకు అలా ఎదురు మాట్లాడ్డం తప్పుకదూ... ఈపాట విని వెళ్ళిపో.

సుం : గారాబం కూడదు!

నిర్మ : (పాట ముగించకముందే వెళ్ళిపోతుంది.)

సోమ : (పాటముగిసింది) అబ్బ! ఎంతసేపూ ఈ హిందీ నాటకం పాటలేనా, చెవులు చిల్లులు పడిపోతూ వున్నవి.

సుం : అయ్యో! పంకజదాసులవి పాటలండి. సైగాల్ వాళ్ళగా పాడినవి.

సోమ : ఏడిచినట్లున్నాయి. రాగమూ, తాళమూ — ఏదో గోల. ఒక్క త్యాగరాజు కీర్తనలో వుండే సంగీతం వుందీ వీటన్నికలిపినా?

సుంద : అవి వేరు, ఇవి వేరు. ఫిల్ముల్లో త్యాగరాజు కీర్తనలు పాడితే ఏమీ రక్తికట్టవు. అందుచేతే మన తెలుగు ఫిల్ముల్లోకూడా బంగాళీ మరాఠీ మెట్లే ... ఏదీ కృష్ణా! మొన్న మనం వెళ్ళిన 'చంద్రహాస'లో కనకాంగి పాడింది.

సోమ : చాలు చాలు. ఇప్పటిక చాలు.

కృష్ణమూర్తి: ఈ కనకాంగినే మనవేణు పెళ్ళాడుతుంది.

సోమ : ఎవతో ఒక భోగంముండ, కనకాంగో—రత్నాంగో—చిత్రాంగో, ఎవరైతేనేమి?

సుం : ఇక మనతో కలిసివుండడుకదా, తన భాగం తన కిమ్మని అడిగాడండీ వేణు?

సోము : లేమలే. కాని అడక్కుండా ఊరుకుంటాడా? చేతుల్లో నవ్వాలు తగ్గగానే పాట్రియటిజం బయలు దేరుతుంది.

కృష్ణ : అతడూ వస్తే సేగా?

సోము : అయితే మాత్రం భయపడతానా?

సుం : ఏమండి? ఈ వివాహం చెల్లుతుందండీ మన ధర్మ శాస్త్రాల ప్రకారం?...

సోము : మన ధర్మశాస్త్రాలు మట్టిలో కలిసిపోయినవి. ఇప్పుడు మనకు చాకళ్ళూ మంగళ్ళూ కూడా శాస్త్రాలు నిర్మిస్తూ వున్నారు... శాసనసభల్లో.

కృష్ణ : చట్టప్రకారం ఈ వివాహం చెల్లుతుంది, వదినెగారు!

సోము : ఏమి చట్టాలున్నా సరే. అగ్నిసాక్షిగా, ధర్మసమ్మతంగా శాస్త్రానుసారంగా చేసుకున్నదాన్ని తప్ప ఇంకోదాన్ని భార్య అనడానికి నేను ఒప్పుకోను. కాని దానికి బొట్టుకడితే సతి అవుతుందా? కుక్కకూ కడతారు బొట్టు మ్యునిసిపాలిటీవారు.

సుం : మంచి సామ్యంచెప్పారు. మీ వేణుకు చెప్పండి వస్తే. (వీధి తలుపు తట్టిన చప్పుడు) కృష్ణా! చూడు ఎవరో?

కృష్ణ : (నవ్వుచు) వేణు! (అని వెళ్లును.)

కృష్ణ : (మళ్ళీ ప్రవేశిస్తాడు చేతిలో కాగితంతో.) వినండి. వినండి.

కనకాంగి పుట్టింది వేశ్యకులంలో. అవలంబించిన మొదటి వృత్తి కులవృత్తియే, గత్యంతరంలేక. సంగీతజ్ఞానం, సౌందర్యం, చాకచక్యం ఉండడంచేత కీర్తి గడించింది. ఆ కీర్తి ఫిలిం కంపెనీ వాళ్ళని ఆకర్షించింది. నటి అయింది. ఆ క్షణంలోనే మొదటివృత్తి వదలివేసింది. కొత్తచొక్కా రాగానే పాతచొక్కా వలె...ధనం, కీర్తి, కావలసినంత లభించినా గౌరవం, సంప్రదాయం అంటే అభిమానం. వివాహం అంటే గొప్ప మర్యాద...వయస్సు దాదాపు 30 ఉన్నా 25 లాగా ఉంటుంది.

వేణుగోపాల్ : బాబయ్యగారు ! నమస్కారం. పిన్నీ, ఆనవాలుపట్టినావా ... మీ కోడల్ని అందరికీ పరిచయం చెయ్యవలెనని పిల్చుకొని వచ్చాను.

కనకాంగి : నమస్కారం !

సుం : కూర్చోండి !

కృష్ణ : బాగావుంది వదినెగారు ! కోడలికి మర్యాద.

వేణు : ఏమి బాబయ్యా ! నిరుడు చూచినప్పటికీ ఇప్పటికీ చాలా వయసు మీరినట్లు కనబడుతున్నారు... ఒంట్లో కులాసాగా ఉన్నదా ?

సోమ : ఆహా ! నాకేమీ లేదు – రొంపైనా పట్టలేదు. నీవింకా అలిసిపోయి నట్లున్నావు.

వేణు : అది ప్రయాణంచేత... పిన్నీ ! కోడల్ని లోపలికి పిల్చుకవెళ్ళి నీళ్ళు గీళ్ళు ఇయ్యరాదూ ?

సుం : ఇలా రా! (దారితీస్తుంది.)

కనక : (చెంగున లేచి) అలాగేనండి... (సుందరమ్మతో

లోపలికి వెళ్లును. కృష్ణమూర్తి చెప్పవాళ్ళను చూచి ఆనందిస్తున్నాడు—ఆ చురుకు, ఆ ఉత్సాహం.)

సోము : అబ్బాయి! ఏమిటీ ఆకస్మిక ఆగమనం?

వేణు : (నవ్వుచూ) ఆశ్చర్యంగానూ. అన్నను. నేను నిన్నటి వరకూ అనుకోనేలేదు. ఆదివారం శెలవన్నారు గనక, మిమ్మల్నందర్నీ ఒకసారి కలుసుకొని రావచ్చునని కనకాంగి చెప్పితే సరే నన్నాను. (మెల్లిగా) కనకాంగికి మీరందరంటే చాలా గౌరవం, భక్తి. దానికి కొంచెమయినా అహంభావం, బడాయి లేదు.

సోము : అయితే మళ్ళీ ... ...

వేణు : వెళ్ళడమా? రాత్రికో, రేపో.

సోమ : అలాగా... కృష్ణమూర్తితో కబుర్లు చెప్పుకొంటూ ఉండు. నేను అలా బజారుకు వెళ్ళివస్తాను. (వెళ్లును)

వేణు : ఏమి, కృష్ణా! ఏమిటి విశేషాలు?

కృష్ణ : సరే. కూపస్థ మండూకంలాగ వున్న నేనా నీకు విశేషాలు చెప్పేవాణ్ని.

వేణు : ఒప్పుకోను. పట్టణవిశేషాలు నేను, పల్లెటూరు విశేషాలు నీవు... పోనీ, వివాహం ఎప్పుడు?

కృష్ణ : విఘ్నేశ్వరునికి జరిగిన మర్నాడు.

వేణు : నేనూ అలాగే అనేవాణ్ని.

కృష్ణ : అందరికీ దారిలో బంగారం దొరుకుతుందా.

వేణు : అంటే?

ప్రవేశం సుందరమ్మ, కనకాంగి.

కనక : (కృష్ణమూర్తి మాటలు విన్నది.) నన్ను దెప్పి పొడుస్తున్నారండీ... నాలో లేకపోయినా నా పేరులో బంగారం వున్నదని.

వేణు : (నవ్వుచు) అదా! కనకాంగి వనా?

కృష్ణ : (కనకాంగితో) ఏమండోయి! నా మీద అన్యాయంగా అపనింద మోపుతున్నారు. తమరు సార్థక నామధేయులు. యథార్థం చెప్పుతున్నాను.

సుం : వేణూ! నీవు కాఫీ గన పుచ్చుకోవూ?

వేణు : ఎస్! కాఫీ అంటే జ్ఞాపకము వచ్చింది. నా గ్రల్సు ఫ్రెండ్ రామారావును కలుసుకొని వాడితో రనుణమ్మగారి కాఫీ హోటలు దర్శించి రావాలి. తప్పదు కనకం! వెళ్ళనా?

కనక : అయ్యో! నా ఆజ్ఞ మీావనే నడుచుకొంటున్నారు గాబోలు — మీావారి దగ్గర అగుడు చెయ్యడానికి నన్ను - అంతే...

వేణు : ఆల్ రైట్; పార్డన్ మి... గుడ్ బై (వెళ్ళును)

కొంతవరకు ఎవ్వరూ మాట్లాడరు. కృష్ణమూర్తి కనకాంగిని కండ్లతో తినేస్తున్నాడు. సుందరమ్మ కృష్ణమూర్తివంక కోపంగా చూస్తున్నది.

కనక : ఓహో! గ్రామఫోను! సంగీతమంటే అందరికీ ఇష్టమేనా?

కృష్ణ : నాకు మరీన్నీ... మీా పాటంటే చాలా ఇష్టం...

కనక : నాపాటా ! టాకీల్లోనేనా ? అన్నీ సెకండుహ్యాండు హిందీ తర్జుమాలేగా ?

కృష్ణ : అయితేమాత్రం ఏం- కంఠం ! అది సెకండుహ్యాండు కాదుగా ?

కనక : నా కంఠం ఏలాగే మెచ్చుకోవాలి.

కృష్ణ : నే నొక్కడినేనా... ఎందరో - వేలకు - పదివేలకు మించి...

సుం : మీది ఏవూరండీ ?

కనక : ఒకటిగాదు. పుట్టింది ఏలూరు - పెరిగింది కాకినాడ- నాటకాలు ఫిల్ముకోసరం ఏవూరుపడితే ఆవూరు- బొంబాయి, కలకత్తాలో సహా.

కృష్ణ : మాకు పుట్టడం, పెరగడం, చావడం—అన్నీ ఒక్క వూరిలోనే లెండి.

కనక : శాంతిజీవులు.

కృష్ణ : ఆc- జీవచ్ఛవాలం...

సుం : ఒంటిరిగానే వెళ్ళేవారా అన్ని చోట్లకీ ?

కనక : అంటే ?

సుం : మా వేణుని పెళ్ళాడకపూర్వం ?

కృష్ణ : ఏమిప్రశ్న అది వదినెగారు ?

కనక : జవాబు చెప్తాతున్నా...పదిమందిలో ఒంటరిగానే...

సుం : సమస్య.

కనక : పరమసత్యం...

కృష్ణ : బలే ! ఎంతభావం చల్లేశారు....

సుం : (కోపంగా) ఏమిటో! నాకేమీ అర్థంకాలేదు. మొద్దు ముండను... మీరు మాట్లాడుకోండి. నే నింట్లో పనులు చూచుకుంటాను (రయ్యిమని వెళ్ళిపోతుంది. కృష్ణమూర్తి కనకాంగివంక చూస్తాడు. కనకాంగి ఫక్కుమని నవ్వుతుంది. కృష్ణమూర్తికూడా నవ్వుతాడు—పకపకా...)

కనక : కోపం వచ్చింది మీ వదినెగారికి.

కృష్ణ : ఎందుకు ?

కనక : మీకే తెలియాలి.

కృష్ణ : పోనివ్వండి—ఒకపాట పాడరూ ?

కనక : అమ్మయ్యో ! ఇక్కడ పాడడమే ?

కృష్ణ : ఏమీ? అరణ్యమా ?

కనక : అరణ్యంలో చక్కగా పాడుకోవచ్చును. దుష్ట మృగాలుకూడా పాడుతూవుంటే ఏమీ చెయ్యవట.

కృష్ణ : అయితే యీ యిల్లు అరణ్యంకంటే చెడ్డదనీ, సింహ శార్దూలాలకన్న నేను దుష్టుణ్ణి అనీన్నీ మీ అభిప్రాయం !

కనక : అంతంత ఊహాలుచేస్తే నేను బ్రతకలేనండోయి... పోనీ...మెల్లగా పాడతాను. (హిందీపాట పాడుతుంది)

కృష్ణ : (పరవశుడై పోతున్నాడు. ఆ సన్నని స్వరం మరింత తల త్రిప్పేస్తూ వుంది. పాట పాడేటప్పుడు కొంచె ఎత్తిన మెడ, విప్పినకండ్లు, అదురుతూ ఉన్న నాసికాపుటాలు మోహ సముద్రములో ముంచేస్తు

న్నాయి.) హాయి! హాయి! ఏమి ఆనందం! (అకస్మాత్తుగా తెలిసియో తెలియకనో కనకాంగి చెయ్యిపట్టుకుంటాడు )

కనక : (పాట ఆపి) ఆగండి! ఏమిటిది ?... మరిచిపోను న్నారు. (చెయ్యి లాగుకో పోతుంది)

కృష్ణ : (పిచ్చిగా) వదలను. నేను వదలను...... బంగారం చేతికి దొరికితే వదుల్తానా ?

ప్రవేశం వేణు.

వేణు : హాలో ! (చూచి ఆగిపోతాడు)

కృష్ణ : (కనకాంగి చెయ్యి వదిలివేసి లేచి. వేణువంక చూడ కుండా చాలా థ్యాంక్సు! పాట అద్భుతంగా వుంది. అని నిష్క్రమిస్తాడు.

కనక : (కృష్ణమూర్తి వెళ్ళగానే గొల్లుమని నవ్వి) రండి. రండి. చాలా సంగతులు చెప్పాలి. రండి.

వేణు : (నవ్వడు, ఉత్సాహం చూపించడు.)

కనక : మీ యింట్లో ముచ్చట్లుచెప్తా. రండి. కూర్చోండి.

వేణు : కూర్చుని ఇంతలోనే విశేషాలా ?

కనక : కావలసినన్ని ...... అయితే తర్కించకుండా వినాలి ... మొదటి విశేషం మీ పిన్నిగారికి మరిది మీాదే మనస్సంతా ?

వేణు : (ఉలికి పడతాడు)

కనక : సందేహం లేదు. ఆవిడ అతన్ని కళ్ళతో చూడ్డం లేదు. తినేస్తూ వుంది. పాపం ఆ అబ్బాయి గ్రహించినట్లు

లేదు. లేదా గ్రహించి, మ్రింగా లేక కక్కా లేక సందిగ్ధావస్థలో బాధపడుతూ వున్నాడు! రెండో విశేషము, నేను వచ్చినప్పటినుంచీ మీ కృష్ణమూర్తికి నా మీదే కళ్ళు. మంచి యవ్వనం. బ్రహ్మచారి. సంగీత సాహిత్యాలంటే అభిరుచి. ఈసంగతి అప్పుడే కనిపెట్టింది మీ పిన్ని ... అల్లాంటి సంగతులు మా ఆడవాళ్ళకు సులభంగా తెలుస్తవిలెండి...

వేణు : తరువాత ?

కనక : ముగ్గురమూ కూర్చొని రెండు నిమిషాలు మాట్లాడే సరికి ... మీపిన్ని కోపంచేసుకొని రివ్వుమని తారాజువ్వ లాగా లేచి, వెళ్ళిపోయింది. ఇద్దరమే వుండిపోయాము. పాడమని బ్రతిమాలాడు. పాడుతూఉంటే హఠాత్తుగా చెయ్యి పట్టుకున్నాడు. పిచ్చివాడు ... నిజంగా అంత మతి పోయి ప్రవర్తిస్తా డనుకోలేదు. .. ఇంతలో మీరు వచ్చారు, ద్రౌపదీ మానసంరక్షణకోసం వేణుగోపాలమూర్తి వలె.

వేణు : తల తిరిగిపోతూ వుంది. ... రాత్రికే తప్పక వెళ్ళిపోవాలి ...

లోపలికి వెళతాడు

కనక : (ఒంటరిగావుంది. కూనిరాగం తీస్తూ, ప్రవేశం మెల్ల మెల్లగా నిర్మల.)

కనక : రామ్మా ! రా. ఎవరమ్మాయివి ?

నిర్మ : పంతులుగారి అమ్మాయిని.

కనక : అమ్మగారు ఏమి చేస్తున్నారు?

నిర్మ : (పలకదు.)

కనక : నాతో మాట్లాడవద్దన్నారా?

నిర్మ : (ఏడుస్తూ) మా అమ్మ లేదు. చచ్చిపోయింది.

కనక : (కరిగిపోయి) నా తల్లివి కదూ. ఏడవనద్దు. రా.(అని చేరదీసి ప్రక్కన కూర్చోపెట్టుకుంది.)

నిర్మ : పిన్ని చూస్తే తిడుతుంది.

కనక : నే నున్నానుగా. భయంలేదు. చదువుకుంటున్నావా?

నిర్మ : ఓ...మా బళ్ళో పాటకూడా నేర్పుతారు. నాకు పాటంటే ఇష్టం...

కనక : నే పాడనా?

నిర్మ : (సంతోషంతో తల ఊపుతుంది.)

కనక : ('చక్కని రాజమార్గము' అనే కీర్తన పాడుతూ వుంటుంది. ప్రవేశం వెనకనుంచి సోమసుందరంగారు పాట స్వారస్యం అనుభవిస్తూ)

సోమ : (పాట ఆగగానే) చాలా బాగా పాడతావు. అందులో కీర్తన, బంగారంలాంటి కీర్తన (నిర్మల జారిపోతుంది)

కనక : (లేచి సగౌరవంగా) కూర్చోండి. మామగారికి వెధవ హిందూస్తానీ మట్లకన్నా మన పూర్వపు కీర్తనల పైనే అభిమానంలా వుంది.

సోమ : ఆఁ బాగా చెప్పావు. వెధవ హిందుస్తానీమట్లు...

కనక : నా కసలు మన సంగీతం అంటేనే ఇష్టం. చిన్నప్పుడు కొంచెం నేర్చుకున్నాను కృతులు, పదాలు, జావళీలు.

సోమ : జావళీలుకూడా వచ్చునా ?

కనక : ఏవో కొన్ని – పాడనా ?

సోమ : మెల్లగా పాడు. మెల్లగా, మృదువుగా పాడితే జావళీలు సుఖంగా ఉంటవి.

కనక : అబ్బో ! మామగారు రసికులు. (జావళీ పాడుతుంది)

సోమ : వహావా! చిన్నప్పుడు చదువుకున్న మనుచరిత్ర జ్ఞాపకం వచ్చింది నీకంఠం వింటే. (కొంచెం రాగయుక్తంగా) 'రహిపుట్ట జంత్రగాత్రముల రాల్ కరగించు, విమల గాంధర్వంబు విద్యమాకు...'

కనక : (చప్పట్లు తట్టుతూ) సంగీతం మాహాత్మ్యం అన్నిట్లో ప్రవేశంవుంది మామగారికి!

సోమ : (ఒళ్ళు తెలియడం లేదు, కుర్చీ కనకాంగి దగ్గరకు లాక్కుంటాడు.) ఏదీ! ఇంకోపదం ఒకటి !

కనక : (పాడుతూంటుంది.)

సోమ : (కనకాంగి పాడుతూవుంటే తాళం వేస్తుంటాడు. తప్పిపోయో; ఉద్దేశించో ఒక దరువు కనకాంగి తొడ మీద వేస్తాడు.)

కనక : (చప్పుమని పాట ఆపి లేచి నిలబడుతుంది.) శ్రుతి మీరిపోతూంది.

సోమ : (కంగారుతో లేచి, తడబడుతూవుంటే పిడతలుపుతట్టిన చప్పుడు వినబడుతుంది) వస్తున్నా; వస్తున్నా. (అని

త్వరగా వెళ్ళి శంకరశాస్త్రితో ప్రవేశిస్తాడు. శంకర శాస్త్రి సోమసుందరం గారి ఆప్త వర్గంలోని వాడు. రిమారని ఏకవయస్కులే ఇద్దరూ. రసికుడు.)

శంకరశాస్త్రి : ఎవరది ? కనకమా ?... కనకమే !

కనక : శాస్త్రిగారు !

సోమ : (ఇక నిక్కడ వుండకూడ దనుకొని)... కూర్చో. కూర్చో. ఇప్పుడే వస్తా. (వెళ్తాడు)

శంక : నిజంగా ఇవి నా కళ్ళేనా?... నేను మేలుకున్నానా? ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు.

కనక : అంత ఆపేక్ష మరి.

శంక : (కూర్చుని) నే నేమి చెయ్యను ? అందరాని పండువై పోయావు... అన్నట్లు ఇక్కడి కెలా వచ్చావు, ఆశ్చర్యంగా వుంది.

కనక : ఇంకా ఆశ్చర్యం... నే నెవ్వరి ననుకున్నారు?... సోమసుందరంగారి కోడల్ని.

శంక : (పకపక నవ్వుచు) తరవాత ?

కనక : మీరు నమ్మటం లేదు, ఒట్టు.

శంక : అంటే, వేణు పెళ్ళాడాడా నిన్ను ?

కనక : ఊఁ.

శంక : ఎలాగ ? చెల్లుతుందా ?

కనక : ఓ; చట్టం వుందట.

శంక : ఓసి, ఎంతపని చేశావు ! సోమసుందరంగారి వంశం అంటే అంత ఛాందసులని ప్రతీతి... దిగ్విజయమే

నీది ... ముసలివాడు ఒప్పుకున్నాడా ?

కనక : వివాహం అయ్యాక తెలిసిందివారికి. నన్ను చూచింది నేడు.

శంక : మండి పడ్డాడా ?

కనక : లేదు. వచ్చినప్పుడు చల్లగా పైకి వెళ్ళిపోయారు. మళ్ళీ వచ్చాక ఎవ్వరూ లేకపోతే నా సరసన వచ్చి కూర్చున్నారు, పాడమన్నారు. పాట మెచ్చుకొన్నారు.

శంక : ఆఁ ఆఁ ...

కనక : (నవ్వుతూ) పాట పారవశ్యంలో కాబోలు పొరపాటున తాళం నా తొడపైన వెయ్యడం మొదలు పెట్టారు.

శంక : (విరగపడి నవ్వుతూ) ఓరి ముసిలి నక్కా.

కనక : (నవ్వుతు) పాపం! ఖంగారు పడిపోయారు - నేను అదిలించే టప్పటికి.

శంక : ఎంత అవస్థ!

ఇద్దరు కలసి నవ్వుతుంటే, ప్రవేశం వేణుగోపాల్.

వేణు : (కఠినంగా) కనకం! ఏమి టది? ... శాస్త్రిలుగారు! నమస్కారం!

శంక : చాలా కాల మైందికదూ, వేణు! విన్నాను. కనకం చెప్పింది. అదృష్టవంతుడవు. కనకం మంచిపిల్ల.

వేణు : (ఈ ప్రసంగం నచ్చడం లేదు.)

కనక : శాస్త్రిలుగారు నన్ను చిన్నప్పటినుంచీ ఎరుగుదురండీ.

వేణు : ఓహో !

సోమ : (ప్రవేశించి) శంకరం ! రావోయి !... (అని వీధికి దారితీస్తాడు.)

శంక : కనకం ! సెలవు. కొన్నిరోజు లుంటారా ?

వేణు : లేదు. రాత్రికే ప్రయాణం.

శంక : అయితే సెలవు. (సోమ, శంకర. నిష్క్రమణ.)

కనక : ఎందుకండీ అంత కోపంగా వున్నారు ?

వేణు : వైఖరి బాగావుంది. వచ్చి రోజన్నా కాలేదు, కృష్ణ మూర్తితో సరసం, ఎవడో కోన్ కిస్కా శాస్త్రిలతో నవ్వులాటాలు. పిన్నితో దెబ్బలాట ...

కనక : అవును. అన్నీ నాతప్పేగదూ ? ముసలివాణ్ణి కట్టుకొని మరిదిమీద మీపిన్ని మరులు కోవడం నాతప్పే. పిచ్చి బ్రహ్మచారి అందమైన పిల్ల కనబడ గానే అవకతవకగా ప్రవర్తించడం నా తప్పే. మరిది నామీద కన్నువేశాడని ఆవిడ ఉలికిపడితే నాదే తప్పు ...50 ఏండ్ల ముసలివాడు ధర్మశాస్త్రాలు తల క్రిందుగా చదివే మీ బాబయ్య ఒంటరిగా చూచి వద్దచేరి, వావీ వరసా లేకుండా, నా తొడమీద చెయ్యివేస్తే నాదేతప్పు. ఎప్పుడో కాకినాడలో మా

యింటి ప్రక్కనున్న శాస్త్రిలతో ఆ గొడవ చెప్పు కొని నవ్వితే అదీ నా తప్పే...

వేణు : ఆఁ ఆఁ... అంతపని చేశాడా బాబయ్య ... తనంత... నీవు ప్రోత్సాహం చెయ్యకుండా ...కృష్ణమూర్తి మాత్రం...నీవే వాళ్ళని బుట్టలో వెయ్యడానికి ప్రయత్నించి ఉంటావు.

కనక : రామ రామ!

వేణు : చాల్చాలు. అసహ్యం. వెనుకటిబుద్ధి ఎక్కడపోతుంది.

కనక : (లేచి దీనంగా) అలా అనకండి. నన్ను చంపే స్తున్నారు...

వేణు : నిన్ను పదినిమిషాలు వదిలి వెళ్ళడానికి జంకుగావుంది. ఏమైనా చేస్తావు...అవును. నీలాంటిదాన్ని పెళ్ళి చేసుకోవడమే పొరపాటు.

కనక : ఆఁ

వేణు : అప్పుడే ఇద్దర్ని చెడగొట్టినావు.

కనక : నేనా? వెర్రికుక్కల్లాగ వాళ్ళు మైనబడితే...

వేణు : ఛస్, నోరుముయ్యి.

కనక : (దుఃఖం కోపం ఆపుకుంటూ) ఎందుకంత మాట!

వేణు : వెళ్ళిపోవాలి ఈ రాత్రికే.

కనక : సరే.

వేణు : (లోపలికి వెళ్ళిపోవును)

కనక : (కండ్లనీళ్ళు తుడుచుకొని, నిరసనభావంతో పెదవి విరిచి, మంగళసూత్రం చేతిలో తెంపి పారవేసి) ఛీఛీ! ఏమి మగవాళ్ళు!

వీధి గుమ్మంవైపు వెళ్ళుతుంది.

—— ... ——

•

## పాత్రలు :

| | | |
|---|---|---|
| చిత్రరేఖ | ... | వేశ్య |
| రత్నం | ... | చెలికత్తె |
| రంగారావు | ... | జమీందారు |
| సీతయ్యమ్మ | ... | రంగారావు భార్య |
| నరిసి | ... | దాసి |

# నిష్ఫలం

## రంగము :

చిత్రరేఖ ఇంట్లో, మేడమీద పడక గది, ఒకమూల మంచం, ఇంకొక వైపు నిలువుటద్దం, అద్దంముందు బల్ల, కుర్చీ; అనేకరకాల బీరువా.

చిత్రరేఖ వేశ్య. ఎంత వయస్సో యథార్థంగా చెప్పటానికి ఎవరి తరం? పదహారేండ్ల బాలిక కాదు, వయసు చెల్లిందీ కాదు. ప్రౌఢః సౌందర్యవతి; సులువుకన్న, కళ ఎరిగిన; కళ్ళల్లో నవ్వూ ఏడుపు మిళితమైనట్లుంటుంది.

చిత్రరేఖ కుర్చీమీద కూర్చుని శృంగారించుకుంటున్నది. ప్రక్కన రత్నం నిలుచుని సహాయం చేస్తూవుంటుంది. రత్నం నౌకరు కాదు, చెలికత్తె కాదు, నేస్తము కాదు. — అన్నీని ఒక విధంగా.

చిత్రరేఖ: ఒసే! ఏవీ లోలకులు!

రత్నం: అవిగో. ఎదురుగానే ఉన్నవమ్మా, పరధ్యానంగా ఉన్నారుగాని. ...

చిత్ర : అవునే... ఎందుకో తెలియదు.

రత్నం: కారణాలకేమమ్మా ఎన్ని కావలిస్తే అన్ని.

చిత్ర : అంటే ?

రత్నం: జమీందారుగారు ఇంకా రాలేదు, ఒకటి. వారి జనానావారు వస్తున్నామని కబురు, రెండు...... చాలవూ ?

చిత్ర : (లోలకులు వేసుకుంటూ) భయంవేస్తూవుందే... రత్నం! చూడు గుండె యెలా కొట్టుకొంటూవుందో!

రత్నం: ఎందుకూ... మీదంతా విపరీతం ... మర్యాదస్థులు మనయింటికివస్తే వారి గుండెలు కొట్టుకోవాలిగాని, మన కెందుకూ భయం, అదుర్దా?

చిత్ర : ఛీ. వేళాకోళం గాదే.

రత్నం: ఎందుకు వస్తారో చెవిగాను?

చిత్ర : అర్థోక్తిగా వ్రాశాను. అంతే. 'మీకూ మాకూ ఆప్తులైనవారి క్షేమంకోసరంగా మీతో జరురుగా మాట్లాడవలెను' అని ... (కనుబొమ్మలు చేర్చి) ఇంకెందుకూ వదిలిపెట్టమని చెప్పటానికి గాబోలు. (కింద తలుపు తట్టిన చప్పుడు) వెళ్ళవే... వచ్చాను త్వరగా.

(రత్నం వెళ్ళును. చిత్రరేఖ ముస్తాబు త్వరగా ముగించి బల్ల శుభ్రం చేస్తుంది. ప్రవేశం రంగారావు. జమీందారు. వయస్సు రమారమి 30. ముఖంలో తెలివి తేటలు, విషయాసక్తికి లోబడినట్లు స్ఫురిస్తుంది. ఇప్పుడు దేహం ఆత్మ రెండూ అలసిపోయినవి. నిరాశాభావం వదనంమీద తాండవిస్తూవుంది.]

చిత్ర : (ఎదురోగ్రని చేతులు పట్టుకొని) ఏమిటీ వేషం? ఎందుకింత ఆలస్యం చేశారు.

రంగా: ఈ వేషమా! ఇన్‌సాల్వెంటు వేషం. బిక్షగాడి వేషం. ఆలస్యం షాహుకారు పన్నిన పద్మవ్యూహంలోంచి బైటికిపడి రావడంచేత.

చిత్ర : ఏమి చేశారు?

రంగా: (వికటంగా నవ్వుచు) మూడు శ్రీక్రీల క్రింద మూడు వారంట్లు.

చిత్ర : అబ్బా! ఏమి గాథ మీకు. దీనికి అంతం ఉండదా స్వామీ!

రంగా: చిత్రా! నన్నడగకు (మంచంమీద కూర్చుంటాడు).. పోనీ ఎందుకా గొడవ, నీదగ్గర ఉన్నంత... సేపు అయినా సంతోషంగా ఉండక... స్వర్గంలో కూడ సంసారతాపత్రయమేనా... ఏదీ—రా.

చిత్ర : (ఉత్సాహం లేకుండా) ఎంతండీ బాకీ?

రంగా: అబ్బబ్బ! ఇంకా బాకీల్లోనే ఉన్నావూ? ఎంతో కొండంత.

చిత్ర : చెపుదురూ... మీ క్షేమం మీ పట్టపురాణికేగాదు; మాకూ కొంచెం అవస్యమే.

రంగా : ఆ! ఆ! ఏమి టీ మాటలు... పట్టపురాణి ఎందుకు వచ్చింది ఇప్పుడు.

చిత్ర : ఇంకా రాలేదు. కాని త్వరలోనే ఆ భాగ్యం కలుగుతుంది లెండి.

రంగా: గందరగోళం... నీ మాటలు నీకర్థం అవుతున్నాయేమో... నాకు మాత్రం ఊహుఁ...

చిత్ర : నాపాపం! మళ్ళీ చెప్తాను వినండి బాగా. మీ రాణీగారు, మీ జనానావారు, మీ పట్టపుదేవిగారు ఇక్కడికి, ఈ యింటికి, నా యింటికి, ఈరోజు

విజయం చేస్తామని ఉత్తరపూర్వకంగా వర్తమానం చేశారు... ఇప్పుడైనా అర్థమైనదా?

రంగా: (తటాలున మంచం దిగి) ఏమి, ఏమి ... ఆవిడ ఇక్కడికా వస్తానన్నది? నిజంగా?

చిత్ర : అహ్హాహ్హా? ఏమో అంతవింత, అంత విడ్డూరం... ఇది ఇల్లుగాని దుకాణం కాదుగదా! మీరు రావడానికి తగినప్పుడు మీ అర్ధాంగి రావడానికి అర్హత లేదేమీ?

రంగా: ఏమి సామ్యం చెప్పావు! నేను భ్రష్టు అయితే...

చిత్ర : అందులో లేదా సహధర్మాచరణం?

రంగా: ఆ వాదన వద్దు. కాని, ఆశ్చర్యంగా వుంది. ఎందుకు వస్తానన్నది?

చిత్ర : ఇదుగో నమ్మకం లేకుంటే ఉత్తరం. (మేజా సొరుగు లోనుంచితీసి ఇస్తుంది) మీరే చదువుకొని ఊహించుకోండి...

రంగా: (ఉత్తరం చదువుకొని) నా క్షేమం కోసరమా? నీతో ఏమిపని?

చిత్ర : భలే! మీ క్షేమం కోరేవారికి నాతోపని ఉండదనా అభిప్రాయం; శెహభాష్.

రంగా: కాదు. చిత్రంకాదు. పాపం, నీవేమి చెయ్యగలవు... అమాయికురాలు అలా వ్రాసింది గాని.

చిత్ర : ఆవిడ అమాయకురాలున్నూ నేను మాయలాడినా?

రంగా: (వినిపించుకోకుండా) బహుశా, ఈ విధంగా ఉండ వచ్చు; నా కష్టదశంతా తెలిసేవుంటుంది. తనకు సహాయం చెయ్యడానికి శక్తిలేదు. తనతండ్రి నడి గితే నాకు పరువుతక్కువ...ఇక నిన్ను అయినా అడగటానికి నిశ్చయించుకొన్నది...

చిత్ర : దేనికి?

రంగా: ఇక దేనికి? నా బాధకు పోషధానికి—ధనానికి.

చిత్ర : నేను బ్యాంకి అధికారినా, షావుకార్నా?

రంగా: అబ్బ! ...ఏదో విధంగా, నగలూ, నాణ్యాలూ, అమ్మో గిమ్మో.

చిత్ర : (చిరునవ్వుతో) ఓహో!

రంగా: కానీ ఎంతటి కార్యానికి పూనుకున్నదో... దేవా లయానికి తప్ప ఇంకొక చోటికి వెళ్ళదు...ఎంత త్యాగం... ఎంత ఉదారం.

చిత్ర : (కండ్లలో నవ్వులేదు ఇప్పుడు; అంతా ఏడుపే)

రంగా: (పచారు చేస్తూ) అయ్యో? దౌర్భాగ్యుడిని. నా కోసరం...ఎటువంటి వంశంలో పుట్టింది...ఎంత బ్రతుకు బ్రతికింది...ఎంత కష్టపడ్డదో కదా! ఇలా సంకల్పించుకోవడానికి... అయ్యయ్యో? ఎవ్వరైనా చూస్తే ఏమనుకుంటారు? ...('తలుపు' 'తలుపు' అని శబ్దం) ఎవరది?

చిత్ర : వారే అనుకొంటాను.

రంగా: నేనో మరి.

చిత్ర: (నవ్వుచు) మంచంక్రింద.

రంగా: (కోపంతో) ఛీ.

చిత్ర: ఆ చిన్నగదిలోకి వెళ్ళండి.

రంగా: రత్నం గదితలుపు తీస్తుందేమో?

చిత్ర: తియ్యనివ్వను. (గదిలోకి ప్రవేశపెట్టి తలుపు మూస్తుంది)

ప్రవేశం రత్నం.

రత్నం: అమ్మా! అమ్మా! వారు వచ్చారు.

చిత్ర: పైకి తీసుకురా.

రత్నం: ఇక్కడికేనా? (అని చుట్టూ చూస్తుంది రంగారావు కోసరం.)

చిత్ర: (తల పంకించి ఆ గదిలో ఉన్నారని సూచిస్తుంది.)

రత్నం: (నవ్వి వెళ్ళిపోతుంది)

చిత్రరేఖ అద్దంవద్ద నిల్చుని సర్దుకొంటుంది.

ప్రవేశం సీతయ్యమ్మ, దాని వరిసి. సీతయ్యమ్మ ముసుగువేసుకుంది. సన్నగా నాజూకుగా ఉంది. 20, 22 సంవత్సరాల కన్నా ఉండవు. ముసుగు తీయగానే ముఖంలో అహం భావం, గర్వం కనబడతవి.

చిత్ర: రాణీగారూ – చాలా ప్రయాసపడ్డారు. కాకితో కబురుపంపితే నేనే వచ్చేదాన్నే.

సీతయ్యమ్మ: యాచనకోసం బిచ్చగాండ్రు భాగ్యవంతుల యిండ్లకు వెళ్తారుగాని; తమ యిండ్లకు భాగ్యవం తుల్ని రమ్మనరు.

చిత్ర : రామరామ. ఏమి ఉపమానం చెప్పినారు.

సీత : పరిస్థితులకు సరిపైనదే.

చిత్ర : కూర్చోండి (కుర్చీ చూపును)

సీత : (కూర్చుని) మీారు!

చిత్ర : మాయింట్లో నేను నిలబడవచ్చును లెండి.

సీత : నరిసీ, క్రిందికివెళ్ళి కాచుకో... (నరిసి వెళ్ళును) ఎక్కువకాలం వుండ వీలులేదు... నేను వచ్చినపని మీారు ఊహించే ఉందురు.

చిత్ర : లేదు.

సీత : వారి ప్రస్తుతస్థితి మీాకు తెలిసే వుంటుంది.

చిత్ర : అంటే ఋణాలబాధా ?

సీత : అవును.

చిత్ర : ఆc. ఎరుగుదును. జూదం నలధర్మరాజుల్నే ముంచి వేసింది. వారెక్కడ ఆగగలరు.

సీత : (కోపంతో) ఇప్పుడు వారి చర్యలను విమర్శించ డానికి రాలేదు మేము.

చిత్ర : ఎందుకు వచ్చారో చెప్పరైతిరి. నా చర్యలు విమర్శించడానికా ?

సీత : కాదు. విమర్శించి ప్రయోజనము లేదు. మా తండ్రి గారు నన్ను ఏరి, కూర్చి, వారికి ధారవోసినారు.

అగ్నిసాక్షిగా నన్ను వివాహం చేసుకున్నారు. రూప లావణ్యాలులేని కోతినిగాను. చదువు సంధ్యలు లేని మూఢురాలినిగాను—అయినా నిన్నుచూచి, నీ సహవాసం ప్రాప్తించిన క్షణంనుంచి నా మాటే మరిచి పోయారు... నీవు ఏమి మచ్చుమందు చల్లినావో- నీ తళుకుబెళుకులకే మోసపోయారో నీలో ఏమి కన పడ్డదో కానీ, నీయిల్లే వారి అంతఃపురం అయి పోయింది.

చిత్ర : ఏ భార్యకుగాని మగడుంచుకొన్న వేశ్యలో గుణాలు ఎప్పుడూ కనబడవు.

సీత : ఎందు కీ దెప్పిపొడుపు? ... నాదే తప్పు... నేను వచ్చిన దిందుకుకాదు... వారుకష్టదశలో ఉన్నారు. పరువు ప్రతిష్టలకే భంగం కలిగే స్థితి వచ్చింది... మంచిరోజుల్లో వారు ఎంతో మీకు ఉపకారం చేశారు. రెండుచేతుల్తో ధనం ఇచ్చారు. నగలు చేయించారు. నీకు ఇష్టమైనదల్లా... అణుమాత్రం కృతజ్ఞత ఉంటే చాలు. ఈ విపత్తునుంచి వారిని దాటించగలవు. నాదగ్గర ధనంలేదు; మా తండ్రి గారిని అడగడానికి వారు సమ్మతించరు... నీ దగ్గ రున్న పెద్దనగల్లో ఒక్కటి అమ్మితే సరిపోతుంది, ఈ వారంట్లమొత్తానికి. ఇదే నా ప్రార్థన. స్వయంగా నేనే వచ్చి వేడుకొంటే మీరు ఒప్పుకుంటారన్న నమ్మకంతో వచ్చాను.

చిత్ర : పాపం. వృధా ప్రయాస... నావద్ద ఫలంలేదు. పట్టు మని పదివందల ఖరీదుచేసే వస్తువేలేదు. ఏమి చెయ్యను ?

సీత : మరి మీరు వేసుకున్న యీ నగలన్నీ... వారు నీకు ఇచ్చినవి కావా...

చిత్ర : కావు...

సీత : ఇంకెవ్వరో...

చిత్ర : పొరబాటు. నేను కొనుక్కున్నవే (నవ్వుతు) కావలిస్తే యీ క్షణంలో వీటిని అన్నీ ఇచ్చేస్తాను. ప్రయోజనం మాత్రం వుండదు.

సీత : ఎందుచేత ?

చిత్ర : (నవ్వుచు) ఇవి రత్నాలనుకుంటున్నారా ? కావు... రంగూను రాళ్లు... యీ గాజులు బంగారపవి కావు. ఇమిటేషన్. అన్నీకలిపితే వందైనా రావు.

సీత : (ఆశ్చర్యంతో) నిజంగా. నిజంగా.

చిత్ర : ఇంతవరకు వచ్చాక కథ సాంతం విని వెళ్ళండి. అసలు వారు నాకు అమూల్యమైన ఆభరణాలు కొనిపెట్టింది సత్యమే... ఆ రోజులు మారిపోయినవి. వారి వద్దనుంచి దమ్మిడీగాని దమ్మిడీ ఖరీదు వస్తువు గాని నాకు ముట్టి ఎన్నో వర్షాలు వెళ్ళినవి.

సీత : ఆఁ. ఆఁ.

చిత్ర : సానిదాని కింత నీతి వుండటం వింతగావుందికదూ... పోనీ వినండి... వారికి తెలియకుండా వారంట్లు ఎన్నో

వచ్చేవి. డిక్రీదార్లు ఎందరో నన్ను చుట్టుకొనేవారు. వేరేమార్గం నాకు కనబడేది కాదు. నా వస్తువులు ఒక్కొక్కటీ అమ్మడానికి ప్రారంభించాను. అమ్మిన సొమ్ముతో తీర్చిన డిక్రీబాకీల లెక్క పూర్తిగా తయారు చెయ్యడానికి కొంతకాలం పడుతుంది. ఇంకా మీకు నమ్మకంలేదు. (బీరువాలోనుంచి కాగితాల కట్టతీసి) ఇవిగో, చూడండి. ... డిక్రీలు. వారంట్లు—సొమ్ము చెల్లించినందుకు రసీదులు. ... ఇంకా సందేహం — ఎక్కడిదో డబ్బు అని. (ఇంకోక కట్ట తెచ్చి) ఇవి నా నగలు అమ్మినందుకు సాక్ష్యం—1930 ఆగష్టు 16. సేట్ చమనలాల్‌కు చెల్లించినది నాలుగువేలు దాదాపు... ఆగష్టు 15— నా రవ్వల కమ్మలు, పలకసరులు అమ్మితే వచ్చినవి దాదాపు నాలుగువేలు ... ఇలాగే మిగతావి.

సీత : (పరాభవాగ్ని దహించేస్తూవుంది. మాట్లాడడానికి పదాలురావు. ఆలోచిస్తూ వుంది- తీవ్రంగా ఏవిధానైనా బాధించాలని.)

చిత్ర : అదీకథ. సర్వం అదృశ్యమైంది ఆవిధంగా. నేనున్నాను మిగత.

సీత : (ఏదో స్ఫురించింది. పెదవి విరిచింది.) పాపం! ఎందుకు చేశారు ఈలాగు!

చిత్ర : ఎందుకా! అవును. అర్థంకాదు మీకు — వేశ్యకు హృదయం ఉండదు. ప్రేమఉండదు. విశ్వాసము, కృతజ్ఞత ఏవీ ఉండవు.

సీత : (మెల్లగా) ఆహా! ఎంత కష్టం తో మీరు. అంత అభిమానం అంత స్వార్థత్యాగం ఉంది గనుక నే నాకు ఇంకా ఆశ కలుగుతూ వుంది...

చిత్ర : ఏ విధంగా?

సీత : కోప్పడకుండా వినండి. మీ ఆభరణాలు, ధనం, ఐశ్వర్యం అన్నీ అదృశ్యమైపోయినవి, నిజమే. కాని మీ సౌందర్యం మిమ్మల్ని వదలి పోలేదు.

చిత్ర : ఏదో గూఢంగా ఆలోచించి మాట్లాడుతున్నారు.

సీత : గ్రహించే వుంటారు ... మీ సౌందర్యానికి వెల లేదా? అమ్మితే కొనుక్కోడానికి సిద్ధంగావున్న వారు లేరా? ఆ షాహుకారే ఒప్పుకోడా? ఇక మీరు ప్రేమకోసరం, వారి మంచి కోసరం చెయ్య లేని పని వుంటుందా?

చిత్ర : (కోపం పొంగి పొరలిపోతుంది) ఎంత గొప్ప ఊహ, ఎట్టి ఉదారస్వభావం ... పెండ్లాడిన భార్యవని మిడిసిపడుతున్నావు కాబోలు. పాతివ్రత్యం ఇంకా మీ వంటివారి కాణాచి అనుకొన్నావు. ఆగర్వంతో కదూ, ఈ విధంగా మాట్లాడుతున్నావు?... ఏమిటి మీ గొప్పతనం? మీ పాతివ్రత్యం! వేరే గతిలేక స్వాతంత్ర్యం లేక, ధర్మమని, విధియని మీరు భర్తలమీద భక్తి విశ్వాసం కనబరుస్తున్నారు. మాబోటి వాళ్ళకు ఆ సంకెళ్లు లేవు. స్వచ్ఛందవృత్తి, ఈ కృత్రిమ బంధాలు లేవు. బలవంతపు పాతివ్రత్యం

మీది. నాది స్వతంత్రమైనది. నాకు నిజంగా వారి మీద ప్రేమ, విశ్వాసం, విధియని గాదు, ధర్మమని గాదు, వేరేగతిలేక గాదు.

సీత : ఏమిటి ఉపన్యాసం. సానిముండకు పాతివ్రత్యం!– నేతి బీరకాయ....

చిత్ర : జాగ్రత్త—ఇల్లెక్కి వచ్చావని ఊరుకున్నాను.

సీత : ఏం చెయ్యగలవు?

తటాలున ప్రక్కగది తలుపు తెరుచుకొని ప్రవేశం రంగారావు.

రంగా: ఆంగడి. ఆంగడి... నా మూలాన ఎందుకీ దెబ్బలాట. దౌర్భాగ్యుణ్ని.

సీత : (ఆశ్చర్యంతో) ఇంతసేపు ఇక్కడే వున్నారా?

రంగా: అవును. దొంగలాగు—సీతా! చిత్రను అన్ని మాటలాడడం తప్పుగాదా? ఎంతత్యాగం చేసింది నాకోసం... నాకు తెలియకుండానే. దానిఋణం తీర్చుకోగలమా?

సీత : సాష్టాంగంగా పడమంటే పడతాను. అరుంధతీ, దాక్షాయణి అని పూజచేయమంటారా... ఏంచేసింది మీరిచ్చిన డబ్బు. ఓర్చుకోలేక మీకోసరం, ఉపయోగించింది.

రంగా: సీతా! అదికాదు. ఆఖరున నీవు చెప్పింది తప్పే... నీకు చిత్ర గుణం తెలియదు.

సీత : అవును కలికాలం. భోగందాని పాతివ్రత్యం ఇల్లాలి దగ్గర ఘోషించేవరకు వచ్చింది...... క్షమించండి. ఎంత అమాయకులండి.

చిత్ర : ఈ సంభాషణ ఆపేస్తే బాగుంటుందేమో! (క్రింద మాటలు వినబడుతవి... రత్నం హఠాత్తుగా ప్రవేశించును)

రత్నం: అమ్మగారూ; షావుకారు అసురాం సేట్ వచ్చి, వెళ్ళనంటున్నాడు. మిమ్మల్ని చూచితీరాలట.

చిత్ర : దొంగ. మీరెక్కడున్నది సందేహించే వచ్చాడు... మీరు మాట్లాడకుండా ఇక్కడే ఉండండి... వాడిని ఏవిధంగానో బుట్టలో వేసి పంపించేస్తాను. తరవాత మీరు వెళ్ళవచ్చును...

రంగా: వాడెందుకు వచ్చాడిక్కడికి? అప్పుడప్పుడు వస్తూ వుంటాడా?

చిత్ర : ఏమి టామాటలు ... మీరెక్కడుంటారని ఎవరికీ తెలియదంటారా? అదీగాక, ఆ చిమొరిగిన కుక్క— క్రిందటి దఫా నేను సొమ్ము చెల్లించానని మళ్ళీ ఆశతో వచ్చాడు... ఇక్కడే ఉండండి... వచ్చేస్తాను. (నిష్క్రమణ)

రంగా: (అనుమానం కమ్మేస్తూవుంది మనస్సుని. పచారు చేస్తుంటాడు)

సీత : (మెల్లగా నవ్వుతు) ఎంత వెర్రిబాగులువారండీ మీరు పాపం. షావుకారు హఠాత్తుగా వచ్చాడు కదూ... జమీందారుగారు పకీరయ్యారు మరి.

రంగా: ఛీ, ఛీ, ఎంత త్యాగం చేసింది.

సీత : ఏమి నమ్మకమండి. కాగితాలుచూసి ఖంగారై పోతున్నారు... నగలు దాచేసి ఇలాటి దొంగ రశీదులు పుట్టించడం బ్రహ్మకార్య మటండీ.

రంగా: మరి వారంట్లకు చెల్లించిన సొమ్ము ?

సీత : (నవ్వుతు) షావుకార్లకు మాత్రం సానులంటే అభి మానం ఉండదనా మీం అభిప్రాయం.

రంగా: ఆఁ ఆఁ– అంత మోసమే.

సీత : మీకు నేను చెప్పవలసినదాన్ని కానుగాని మన పెద్దలు ఊరికే చెప్పారండి, వారకాంతల తత్వం గురించి... చక్కనివాడైన రాజు చంద్రుండైన అని–

రంగా: అలాగైతే నన్ను ఎప్పుడో వదలి ఉండాలిగదా... చిల్లిగవ్వ ఇవ్వలేదే సంవత్సరాలనుంచి.

సీత : దానికి కారణం వేరు. జమీందారుగారు ఉంచుకున్న దంటే హోదా... విలువ ఎక్కువ — ఆడ్వర్టైజు మెంటు... ...

రంగా: నిజంగా ?

సీత : కైపు తీరితేగాని నిజం తెలియదు. ఇకనైనా నా ప్రార్థన వినరూ ? ఈ వూరూ, ఈ స్నేహం అన్నీ వదలేసి మా నాన్నగారి దగ్గరకు వెళ్ళిపోదాము. ఎంతో సంతోషిస్తారు. వెధవ షావుకార్లు పది మందికి జవాబు చెప్తారు... అన్నికష్టాలు పోతవి...

రంగా: (ఎట్టాగొప్పుతో) సరే.

సీత : అమ్మయ్య, ఎంత మంచిరోజు? ఎన్నాళ్ళకి?

( ప్రవేశం : చిత్రరేఖ )

చిత్ర : అబ్బ! వెళ్ళిపోతున్నావు.

రంగా: నీ ఋణం తీర్చుకోలేను ఈ జన్మలో...

సీత : సీతమ్మ త్వరలోనే పిలుచేసుకొని పంపిస్తారు.

చిత్ర : (పిచ్చిగా చూస్తుంది రంగారావువంక)

రంగా: చిత్రా, నేను మా మామగారింటికి వెళ్ళిపోతున్నాను సీతతో.

సీత : (విజయం తనదని సూచిస్తూ చిరునవ్వుతో) ఈ రోజే.

చిత్ర : నిజంగా? నిజంగా? మళ్ళీ ఎప్పుడు?

సీత : ఎప్పుడో రాకుండానే ఉంటారా?

రంగా: లేదు. నేను ఈ వూరికి మళ్ళీరాను.

చిత్ర : (తబ్బిబ్బై) ఆఁ ఆఁ...

సీత : సెలవు... (రంగారావు కీలుబొమ్మలాగు తలవూపు తాడు. సీతయ్యమ్మ దారితీస్తుంది.. చిత్రరేఖ బల్ల పట్టుకుంటుంది ఆవేదనతో. రంగారావు, సీత య్యమ్మ నిష్క్రమిస్తారు.)

చిత్ర : ( కుర్చీలో కూలబడి, చేతుల్తో ముఖం కప్పివేసుకొని ఏడుస్తూ వుంటుంది)

ప్రవేశం: రత్నం

రత్నం: అమ్మా.

చిత్ర : (లేచి కండ్లు తుడుచుకుంటూ) రత్నం, అగ్గిపుల్ల.

రత్నం: అగ్గిపెట్టె అందిస్తుంది.

చిత్ర: (వారంట్లు, డిక్రీలు, రసీదులు, అన్నింటినిపోగుచేసి వెలిగిస్తుంది. ఆ వెలుగులో చూస్తే చిత్రరేఖ కండ్లల్లో నవ్వే కనబడదు.)

— ••• —

## పాత్రలు :

| | | |
|---|---|---|
| పార్వతి | ... | వీరభద్రరావు భార్య |
| నరిసి | ... | నౌకరు |
| ఇందిర | ... | వీరభద్రరావు ప్రియురాలు, విద్యార్థిని. |

వంకాయలవాడు

# వృథా యాసం

కళాశాల ఉపాధ్యాయుల కోసరం ప్రత్యేకంగా కట్టించిన ఇండ్ల వరసలో ఒకయిల్లు. ఇంటి వెనకభాగంలో ముందు ఆ ప్రక్కని వసారాలో మడిగట్టుకొని పార్వతమ్మ అరటికాయలు తరుగుతూ కూర్చుంది. పొట్టిగా, స్థూలంగా వుంటుంది. వయస్సు 32, 33. ముక్కు కొంచెం పలచ, కళ్ళు పెద్దవేగాని కనుబొమలు పలచనవటం చేత బోడిగా కనబడతవి. మెడ నడుము పరిమితి అమితం. మాటలో ఎప్పుడూ గొణుగు. ప్రపంచమంతా తనను అన్యాయంచేస్తూ వున్న దన్న భావం సూచిస్తూ వుంటుంది.

ఒంటరిగా కూర్చున్నప్పటికీ గట్టిగా చెప్పేమాటలు ప్రక్క గదిలో నిద్రపోతూవున్న భర్తనుద్దేశించి. భర్త కళాశాలలో ఉపాధ్యాయుడు. ఆ రోజు ఆదివారం.

పార్వతి: ఏడు వేశారండీ ఎప్పుడో! ఇంకా లేవరూ ?... కాఫీ చల్లారిపోతుంది. తరువాత విసుక్కొని కాఫీ హోటలుకు వెళ్ళి డబ్బు తగలేస్తారు. అడ్డమైన అరవచాకిరీ నేను చెయ్యడమే గాని ఏమి ప్రయోజనం ? పేరా, ప్రతిష్టా... వెధవముండ, పనిచేసే దానికూడా పొద్దు తెలియలేదు కాబోలు, గట్టిగా అడిగితే అలిగి ఆరురోజులు రాదు. చేవుడా అంటూ నేనే తోముకోవాలి. కొత్తదాన్ని పెట్టుకోడానికి లేదట. వాళ్ళసంఘం ఏర్పాట్లట... చాకిరీ ముండ లకి సంఘాలైతే – ఇక కుక్కలికి నక్కలికికూడ

సంఘాలు ఏర్పడుతవి......ఏమండోయ్; ఏమి నిద్రదండి...

అవును మరి, ఎక్కడెక్కడో తిరిగి తిరిగి రాత్రి 12 గంటలకు వచ్చారు... భయంవేసింది సుమండీ! రాత్రి ఒంటరిగా కూర్చున్నా... శ్యామలా దండకం చెప్పు కుంటూ—నాకేం! ఎప్పుడైనా లేవండి, నాకు తెలుసు ఏమన్రుతుందో - అదుగో ఆ కవీశ్వరుడు గుర్రపు జూలులాగ జుట్టుపెంచుకొని ధూమశకటం లాగా సిగరెట్టుపొగ వదులుతూ ఆ వెంకటేశ్వర రావు వచ్చి తలుపు తట్టేవరకు లేవరు... అప్పుడు లేచి పరిగెడతారు కాఫీహోటల్‌కు! ఎప్పుడూ అధరా మృతంలో మునిగి తేలే ఈ కవీశ్వర్లకి ఉపాహారాలు, కాఫీలు ఎందుకో? ...ఏమండోయ్ వింటున్నారు గదూ, దొంగలు, వినకేం? మీ కావ్యాలేమీ పత్రి కల్లో రావెందుకో? దొరికిన తెల్ల కాగితాలన్నీ పాడుచేస్తారు, ఏమి కవిత్వమో ఎప్పుడూ ప్రేమా, ప్రియులు, ప్రణయం, వియోగం - పెళ్ళిగాని కుర్ర వాళ్ళనీ ఎదిగిన పిల్లల్నీ పాడుచేయడానికి తప్ప ఎందుకూ పనికిరాదు.

ప్రవేశం పనిమనిషి నరిసి.

వచ్చావూ? ఇంత త్వరగా వచ్చావెందుకే, భోజనా లయ్యాక రారాదూ?

నరిసి : అలా అంటే ఎలాగండీ, ఎంతదూరం నడిచి రావా లండీ, ఇప్పుడే గదండీ పదేశారు.

పార్వ: బాగుంది. అసలాయనలేచి రెండు చీవాట్లు పెడితే భయం వుంటుంది. నే నరిస్తే నా నోసు నెప్పెడు తుంది గాని ఏమిలాభం.

నరిసి : ఏంటండీ అలాగంటారు. తమరు సెప్పితే మాత్రం విన్నారండీ ?

పార్వతి: చాల్చాలు. నీతో బాతాఖానీ కొట్టడానికి ఓపిక లేదు. త్వరగా కానీ... ...ఏమంటావోయి. నరిసికూడ వచ్చేసిందండీ, లేవరూ... అప్పుడుగాని మొన్న పాట కచ్చేరీకి అందరు మాస్టర్లు భార్యాల్ని తీసు వెళ్ళారట. మీరుమాత్రం నన్ను పారేసి వెళ్ళి పోయారుగదూ... (మరీ గొణుగుతూ) నా బతుకంతా చాకిరీతోనే సరిపోతూ వుంది. మీకు నన్ను చూస్తేనే అసహ్యం. నలుగుర్లో నేను మీ భార్యనని తెలియ డమే మీకు సిగ్గు... ఒసేనరిసీ... వంకాయలమ్ముతూ పోతున్నాడు పిలు. (నరిసి వెళ్ళి వంకాయలవాణ్ణి పిలుచుకొని వస్తుంది.)

పార్వ: ఏవీ...గంప పెద్దదేగాని కాయలు లేవే.

వంకాయలవాడు: ఎన్ని కావాలమ్మా ?

పార్వ: ఎన్ని అయితేనే. మంచివి ఏరుకోవద్దూ. ఎలా ఇస్తావు!

వంకా: కానీకి ఆరు.

పార్వ: వెళ్ళిపో. అమ్మడానికి వచ్చినట్టులేవు.

వంకా: పోనీలెండి. మీకు ఇంకొకటి వేస్తాలెండి. అంత కన్నా గిట్టదండీ.

పార్వ: కానీకి పది. లేదా వెళ్ళిపో (వంకాయలవాడు వెళ్ళి పోబోతున్నాడు) సరే ఎనిమిది వెయ్యి సీగ్గోపోగ...

వంకా: (గంప దింపుతాడు గొణుగుకుంటూ)

పార్వ: ఏమిటా గొణుగుడు. అలా గొణిగితే నాకు చీదర. ఇష్టముంటే ఇచ్చిపో.

వంకా: బతకాలగదండీ... ఊ. సరే కానివ్వండి.

పార్వ: చూడు! నాకు ముదురుకాయలు ఇష్టం. అవన్నీ ఏరిపెట్టు.

వంకా: (అలాగే ఏరుతాను. నరిసి నవ్వుకొంటూ వుంది)

పార్వ: అమ్మనాంగా! ఎన్నికాయలు ముదురో అవి అలా వుండనీ, వీట్లో నేను ఏరుకుంటాను. (మెల్లగా ఎనిమిది కాయలు ఏరుకుంటుంది. (అవి తీసుకొని లోపలఉంచి) ఉండు కాణీ ఇస్తాను. (భర్త పడుకొన్న గదిగాక ఇంకొక గదిలోకి వెళ్ళి పరుసు పట్టుకొని వచ్చి, తెరిచి కాణీ పారేస్తుంది. నరిసి, వంకాయ లమ్మేవాడు ఒకరినొకరు చూసుకొని నవ్వుకుంటారు. వంకాయలవాడు వెళ్తాడు) ఇదేమిటి? (పర్సులో కాగితం కనపడ్డది. బయటికి తీసి) వీరభద్రరావుగారికి. వీరికే... (ఉత్తరం చదువుకుంది) ఆఁ ఆఁ ... ఎంత ద్రోహం! ఎంత మోసం. ఓసి ముండా! ఈ చదువులే ఇంత కొంపలు ముంచేస్తూ వున్నవి. కానీ!

చికాకు నాదగ్గర... (తలఊపి ఉత్తరం రవికెలో దాచివేస్తుంది. పర్సు మళ్ళీ గదిలో ఉంచేసి కూర్చుంటుంది. ఇంతలో వీధిగుమ్మందగ్గిర 'ఏమండోయ్' అని పిలుపు.)

పార్వ: ఒసే నరిసి! చూడు ఎవరో.

నరిసి : (చూచివచ్చి) ఎవరో బడిలో చదువుకునే పిల్లండీ. వారితో మాట్లాడాలట.

పార్వ: అదే అయివుంటుంది. రమ్మను. (నరిసి వెళ్ళి తలుపు తీస్తుంది ప్రవేశం ఇందిర. కాలేజీలో ఇంటర్ చదువు కొంటున్నది. అట్టే అవయవసౌందర్యం లేకపోయినా నాజూకుగా ఉంటుంది. 18 ఏండ్లుంటవేమో, కొత్త రకం చీర కొత్త బాడీ జాకెట్టు. ముఖంలో భయం ఆవేదన కనబడుతున్నది)

ఇందిర: మాష్టారుగారు లేరండీ.

పార్వ: ఎవరమ్మాయి నీవు.

ఇంది : ఈ కాలేజీలోనే చదువుకుంటున్నాను.

పార్వ: పేరు లేదూ ?

ఇంది : ఇందిర.

పార్వ: ఓ౯ ఎందుకు వచ్చావు. రమ్మన్నారా? నరిసీ బావిలో నీరు చేదేసెయ్!

ఇంది : లేదు. వారితో ముఖ్యంగా మాట్లాడటానికి వచ్చాను.

పార్వ: పాఠాల్లో ఏవైనా సందేహాలు వచ్చాయా?

ఇంది : (ఊరుకుంటుంది.)

పార్వ: నేను వారి భార్యనే. చెప్పవలసింది నాతో చెప్ప వచ్చు.

ఇంది : క్షమించండి వారితోనే మాట్లాడాలి.

పార్వ: నీకు వివాహమైందీ ?

ఇంది : లేదు. త్వరలో అవుతుంది.

పార్వ: ఎవరితో, మాష్టరుగారితోనా.

ఇంది : (కంగారుగా) ఏమి మాటలండీ ఇవి.

పార్వ: ఎందుకీ దాపరికం ? దొంగ కళ్ళునూసుకుంటే ఎవ రికీ కనబడనూ ?...సిగ్గూ మానంలేని దానివి నాతో మాత్రం చెప్పకూడనూ ఎందుకొచ్చావో ?

ఇంది : (ఏడుస్తూ) మీకాళ్ళు పట్టుకుంటాను. నన్ను రక్షిం చండి. చేసింది తప్పే. నేనేమిచెయ్యను. చిన్నతనం. ఆయన మాట నేనెలా తోసివెయ్యడం. తరువాత నా స్థితి నాకే బోధపడింది. మావాళ్ళు మంచి సంబంధం కుదిర్చారు కూడాను. మొన్ననే ఇక్కడ ఎమ్. ఏ. ప్యాసయ్యారు, శంకరశాస్త్రి...

పార్వ: అయితే ఎందుకు వచ్చావు ?

ఇంది : నిన్న ఈవిషయం వారికి తెలియపరుస్తూ వుత్తరం వ్రాశాను, తరువాత భయం వేసింది. బ్రతిమాలు కొని ఆ వుత్తరం వాపసు తీసుకొని వెళ్ళిపోవడానికి వచ్చాను. అలాంటి వుత్తరం వారిదగ్గర వుంటే ఎప్పటికైనా ప్రమాదం అని

పార్వ: చూచావా ఎన్నికష్టాలో తప్పుదారి తొక్కితే. అయితే నీవు చెప్పినవన్నీ నిజమేనా ?

ఇందిర : వట్టు.

పార్వ: నాదగ్గిరేఉంది ఆ వుత్తరం. ఒకమారుచదివి ఇచ్చేస్తాను. (ఉత్తరం తీసిచదువుతుంది గట్టిగానే – ప్రక్కగదిలోవున్న భర్తకు వినబడేటట్లు)

"ప్రియా !

ఈ మన ప్రణయగాథకు ఏమి సమాప్తి! ఎన్నటికైనా మీరు నన్ను వివాహ మాడగలరా ? నాకు నమ్మకం లేదు. అలా జరగదు. అప్పుడు నా గతేమిటి ? తల ముక్కలై బోయేటట్లు ఆలోచించాను. వేరేమార్గం కనబడదు. మా వారు కుదిర్చిన వరుని వివాహమాడడానికి నిశ్చయించుకున్నాను. ప్రేమ కాకపోయినా నా జీవనంలో మర్యాద, శాంతి, అయినా ఉంటవి. క్షమిస్తారు గదూ. మిమ్మల్ని ఎప్పుడూ మరచి పోలేను. నా యవ్వన భాగ్యమంతా మీకే అర్పించేశాను.

—మీ ఇందిర"

ఓసి ! ఎంత సిగ్గులేకుండా వ్రాశావే ఈ ఉత్తరం. పెండ్లిఅయి నాకు 20 సంవత్సరాలైనా వారికి ఒక్క ముక్క వ్రాయాలంటే కలం జరగదు ?
తీసుకో ! (ఉత్తరం యిచ్చింది) వెళ్ళిపో.
ఇకనైనా మర్యాదగా బ్రతుకు. ప్రేమ లేమిటి

ప్రేమలు? నలదమయంతుల్లాంటి వారికిగాని మన లాంటి వారికేమిటి ప్రేమ?...

ఇంది : (కండ్లనీళ్ళు తుడుచుకొని నమస్కారంచేసి వెళ్ళి పోతుంది)

పార్వ: (లేచి రౌద్రరసం వెదజల్లుతూ బిగ్గరగా) ఏమండోయి రండి. పైకిరండి... పరువుగా... వెళ్ళిపోయింది, మీ ప్రియురాలు... ఎంత చేశారండీ నాకు తెలియకుండా. రారూ (గదితలుపు తెరవపోతే రాదు) లోపల గొళ్ళెం పెట్టుకున్నారూ, నేనుగనక వస్తానేమోనని. (గట్టిగా తట్టుతూ) రండీ! ఎంతసేపుంటారు గదిలోనే (జవాబు లేదు) ఏమిచేస్తున్నారో చూస్తాను కిటికీలో నుంచి (అని ఆవైపు వెళ్ళివచ్చి) ఇదేమిటి కిటికీ లన్నీ మూసుకున్నారేం... ...(మరీ బిగ్గరగా) ఏమి టండీ ఈ అన్యాయం. లేచిరారూ... నేనేమీ అనను లెండి. (జవాబులేదు)ఒసే నరిసీ, రావే భయంవేస్తూ వుందే.(నరిసి వస్తుంది) పలకడంలేదే వారు. (ఇద్దరూ శక్తికొద్దీ బాదుతున్నా గదిలోనుంచి ధ్వనిలేదు.) ఇంకేముందే, ఇంకేముందే ... దానికోసరం... ... ఏమండోయి! ఏమండోయి! (క్రిందకూలి మూర్ఛ పోతుంది. నరిసి ఇరుగు పొరుగువారి సహాయం కోసరం పరుగెత్తుతుంది.)

——...——

## పాత్రలు:

| | | |
|---|---|---|
| సోమసుందరం | ... | న్యాయవాది |
| విశ్వనాథం | ... | అతని తమ్ముడు |
| గిరిజ | ... | కామరాజు కుమార్తె బి. ఏ. |
| సుబ్బన్న | ... | సోమసుందరం నౌకరు |

# సంకల్పం - పర్యవసానం

## రంగము :

చింతలూరి సోమసుందరంగారి ఇంట్లో ఒకగది. గోడలమీద చిత్రపటాలు. మధ్యన పెద్దబల్ల. చుట్టూకుర్చీలు, ఒకమూల బీరువానిండాపుస్తకాలు. దానిప్రక్కనచిన్నబల్ల, ముందు కుర్చీ.

సోమసుందరంగారు చిన్న బల్లదగ్గర కూర్చుని ఉత్తరాలు వ్రాసుకొంటున్నారు. ఆయన మద్రాసులో ప్రఖ్యాత న్యాయవాది. అమలాపురం జన్మస్థానంగాని, బి. ఏ. చదువుకోవడానికి వచ్చినప్పటి నుంచి మద్రాసులోనే నివాసం. సుమారు 4౩, 44 సంవత్సరములు. భార్య సంతానమైనా వదలక రెండేండ్లక్రిందట స్వర్గస్థయైనది. మొట్టమొదట మళ్ళీపెళ్ళి చేసుకోకూడదని నిశ్చయించుకున్నాడు. కాని తానుగడించేసొమ్ము అనుభవించేవారు లేకున్నకొరవ ఏర్పడ్డానికిన్నీ, ఏకాకిగా జీవితం గడపడము కష్టసాధ్యంగా ఉండుటచేతనున్నూ, వివాహచింత బయలుదేరింది. కాకతాళీయంగా ఆసమయంలోనే కీ.శే. కబ్బాప్రగడ రామరాజుగారి ఏకపుత్రి గిరిజాదేవి స్నేహం లభించింది. గిరిజ బి. ఏ. వరకు చదివింది. సౌందర్యవతియే. అంతకన్న నవనాగరికతలో మునిగితేలుచుండుటచేత అత్యంతాకర్షణీయ. తండ్రి ధనమంతా సర్వస్వతంత్రాధికారంతో ఆవిడకే చెందింది. వయస్సు 23. అన్నివిధాల తనకుతగిన సంబంధమని సోమసుందరంగారు నిశ్చయించుకొన్నారు. అయితే ఆవిడ అభిప్రాయం ఇంకా కనుక్కోలేదు. సాహసించి అడగడానికి ధైర్యంచాలలేదు. ఈరోజు అడిగివేయవలయునని అనుకున్నాడు.

సోమసుందర: (వ్రాయడం ఆపి) సుబ్బన్నా!

సుబ్బన్న: (ప్రవేశించి) చిత్తం!

సోమ : చూడు, నాలుగుష్పుంటలకంతా టీ తయారుగావుంచు. (చేతి గడియారం చూచుకొని) ఇక పావుగంటవుంది వెళ్ళు ... (సుబ్బన్న వెళ్ళుతుంటే) ఓయి ! ఇంతలో ఎవరువచ్చినా చూడడానికి వీలులేదనిచెప్పి పంపి వేయి ... ... ఏం ... ...

సుబ్బ : చిత్తం.

సోమ : పేరుమాత్రం కనుక్కో ... రేపు రమ్మను.

సుబ్బన్న నిష్క్రమించును.

సోమసుందరం బీరువాప్రక్కన తగిలించివున్న అద్దంలో చూచుకొని తలకట్టు, బట్టలు సర్దుకుంటాడు. అప్పుడు ప్రవేశం: అతని తమ్ముడు విశ్వనాథం, తొందరగా. ౪౯, ౫౦ ఏండ్లుంటవి. ముఖంలో జీవకళ ఉట్టిపడుతూవుంది. విశాల ఫాలభాగం. కండ్లలో నవ్వు...సమ్మోహనశక్తి...విశ్వనాథం తెలివిగలవాడే. యం. ఏ. ప్యాసైనాడు. కాని ఉద్యోగమంటే యిష్టంలేదు. భోగాసక్తి ఎక్కువ. ఆదాయం లేదు. ఖర్చు యెక్కువ గనక సర్వదా ఋణబాధా పీడితుడు. అనేక పర్యాయములు అన్నగారే ఋణాలనుతీర్చడం సంభవించింది. హృదయం చాలా మంచిది. కుషానులాగ ప్రవేశిస్తాడు.

సోమ : (ఉలికిపడి) నీ వటరా ! ఏమిటీ దుడుకు ?

విశ్వనాథం : క్షమించు అన్నయ్యా ?

సోమ : చేసేదేమో చేసి 'క్షమించు' అని ఒక్కముక్క పారేస్తావు.

విశ్వ : (విచారంగా) ఎందుకన్నయ్యా నామీద నీ కంత కోపం ?

సోమ : మరి కోపంగానపోతే సంతోషం రావాలంటావా... నీ చర్యలకు నీ చేష్టలకు నీకే సిగ్గుగా ఉండాలి. నేను చెప్పితే ఏమిలాభం ?... నీతో పోకుండా నాకు కూడా అప్రతిష్ఠ తెస్తున్నావు. సోమసుందరంగారి తమ్ముడు అని వేలుపెట్టి చూపిస్తే ఆ అగౌరవం నాకు కాదూ ?

విశ్వ : లేదు. అన్నయ్యా, లేదు. చాల పొరబడ్డావు నా విషయంలో. లోకంలో నేనంటే ఇష్టంలేని వాళ్ళు లేరు. అందరికీ నామీద అభిమానం, ఆదరం. అదిగాక నేనే పాపం చేస్తాను ? అబద్ధమాడతానా ? ఇతర్ల కొంపలు గూలుస్తానా ? నమ్మకద్రోహం చేస్తానా ? దోవలు కొడతానా ? ...యదార్థం చెప్తున్నాను. నా గౌరవం నేనెప్పుడూ కాపాడుకొంటూ వుంటాను. అంటే తమ గౌరవంకూడా కాపాడుతూనే వుంటాను.

సోమ : చాలుచాలు (గడియారం చూచుకొని) పోనీ ఎందుకు వచ్చావో చెప్పు త్వరగా. ఏదో కారణం లేకుండా వస్తావా ?

విశ్వ : మీకేదో తొందరపని ఉన్నట్లున్నది. ముక్తసరిగ మూడుమాటల్లో చెప్పివేస్తాను. నాకు తక్షణం వంద రూపాయలు కావాలి.

సోమ : ఓహో ! అప్పుడే అనుకున్నాను ఈ మోస్తరేదో ఉపద్రవం ఉంటుందని. ఎందుకంటీ ఆ రూపాయలు ?

విశ్వ : అబద్ధమాడను. నిన్నసాయంత్రం క్లబ్బులో పేకాటలో ఓడాను. ఈరోజు తప్పకుండా ఇవ్వాలి.

సోమ : నీవు జూదంలో పడే ఋణాలు సహా నేను తీర్చినవ సరం నాకు కనపడ్డంలేదు. నే నివ్వను.

విశ్వ : పోనీండి నాకేమి!-దగాకోరు అని అంటారు నన్ను. నన్నంటే అంటారులెండి, నాకేమీ మొర్రేపోదు. నా గౌరవం పోతేపోతుంది. కానీ, మీ గౌరవం సహా పోతుంది... విన్నారా, ఆవిడ అందరికీ చెప్పేస్తుంది సోమసుందరంగారి తమ్ముడు మానం లేనవాడని.

సోమ : ఆవిడ ఎవరు ?

విశ్వ : నా బాకీదారు.

సోమ : కావచ్చునోయి... ఆ పెద్దమ్మ పేరేమిటి ?

విశ్వ : రెబ్బాప్రగడవారి అమ్మాయి—గిరిజ.

సోమ : ఆఁ ఆఁ.

విశ్వ : ఊఁ ఊఁ.

సోమ : (త్వరగా) ఇదో తీసుకో (పర్సుతీసి 100 రూ॥లు యిచ్చి) వెళ్ళిపో. ఆ అమ్మాయి ఈ క్షణంలో వస్తోంది ఇక్కడికి. వెళ్ళిపో.

విశ్వ : నిజంగా ? ...అయితే సెలవు (వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చి) నన్ను గురించి గనక అడిగితే మంచి సర్టిఫికెట్ ఇస్తారుగదూ ?

నిష్క్రమణ.

సోమ : ఈ వెధవమూలాన్ని ఆవిడకు నామీద అభిమానం తగ్గదు గద ! ఏదో ఈవేళ పరిష్కారంగా అడిగి

వేస్తాను...అంగీకరించింది కదా... ధన్యుణ్ణి... (చప్పుడు) వస్తోంది.

ప్రవేశం : గిరిజాదేవి.

సోమ : (ఆహ్వానిస్తూ) రండి.

గిరిజ : నమస్కారం.

సోమ : నమస్కారం. కూర్చోండి. (ఇద్దరూ కుర్చీలపై కూర్చుంటారు)

సోమ : మీ ఇతరపను లేమీ చెడలేదు గదా!

గిరిజ : మాకేమి పనులుంటాయి, కాలక్షేపమేగా మా పరమా వధి. మీలాంటి వారి కార్యాలకు ఇంకా అంతరాయంగా వుంటాము మావంటి వాళ్ళము.

సోమ : అబ్బ! మా ఉద్యోగంలో ప్రాణం విసిగిపోతుంది. అటువంటి సమయాల్లో మీవంటివారితో కాలం గడపడం ఆనందంగా వుంటుంది.

గిరిజ : (నవ్వుతూ) అంటే మేము సినిమాలతోను షికార్లతోను సమానమన్నమాట.

సోమ : అబ్బబ్బ! అదికాదు నా అభిప్రాయం!

గిరిజ : న్యాయవాదుల అభిప్రాయాలు కనుక్కోవడం... దుస్సాధ్యం కదండి!

సోమ : అంత చెడ్డవాళ్ళం గాములెండి...ఒరే, సుబ్బన్నా!టీ!

గిరిజ : ఈ యింట్లో మీరొక్కరేనా ఉంట!

సోమ : అవును. మీకు తెలిసేవుంటుంది. రెండేండ్ల...

గిరిజ : పాపం సంతానంకూడా ... ...

సోమ : లేదు. ఏకాకిని. నాకన్లతప్ప ఎవరూ లేరు. (సుబ్బన్న టీ తెస్తాడు. సోమసుందరం టీ కలిపి ఇస్తాడు. టీ త్రాగుతూ మాట్లాడుతుంటారు.)

సోమ : ఒంటరిగా బ్రతకడం కష్ట మనిపిస్తోంది.

గిరిజ : ఒంటరిగా అంటే ... మీ తమ్ముడు !

సోమ : (ఉలికిపడి) వాడా! వాడిక్కడే ఉంటాడు. ఇద్దరమూ సన్యాసుల్లాగ ... ...

గిరిజ : మీ తమ్ముడు చాలా సరదామనిషండి. అతనితో ఉంటే ఘంటలు నిముషాల్లాగ పరుగెత్తుతవి.

సోమ : అవును. అతడు చాలా మంచివాడు సుమండీ. ఏదో చిన్నతనంచేత కొంటెచేష్టలు చేసినా ఒక్కదుర్గుణం అయినా లేదు. మంచి తెలివిగలవాడు, ఎం. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసైనాడు.

గిరిజ : అలాగా ? న్యాయవాది పరీక్షకు చదివించక పోయారా ?

సోమ : చదవమన్నాను. వాడికి ఉద్యోగం నచ్చదట.

గిరిజ : మాకొక పెద్దతర్కం జరిగింది యీమధ్య. బహుశా ఇప్పు డడిగితే ఒప్పుకొంటాడేమో !

సోమ : మీకు అంతబాగా పరిచయమా ? .

గిరిజ : (కొంత సిగ్గుతో) ఏదో ఒకమాత్రం ...

తటాలున ప్రవేశం: విశ్వనాథం 'రావచ్చునా?' అంటూ.

విశ్వ : క్షమించండి. గిరిజాదేవికోసం వచ్చాను. (గిరిజవైపు చూస్తూ) ఇవిగో రూపాయలు (ఇచ్చి) నాకాకీ చెల్లు.

గిరిజ : థాంక్సు, కూర్చోరాదూ ?

విశ్వ : (అన్నవంక చూస్తూ నిలబడతాడు)

సోమ : (విధిలేక) కూర్చో, విశ్వం! టీ పుచ్చుకుంటావా ?

విశ్వ : (కూర్చుని) నో; థాంక్సు (గిరిజతో) సాయంత్రం క్లబ్బుకు రావూ? ఆ రూపాయలు నేను మళ్ళీ గెలుచుకోవద్దా ?

గిరిజ : వద్దు. వద్దు. ఆ విధంగానే జూదం అబ్బుతుంది. ఇవిగో యీ రూపాయలుకూడా నాకు వద్దు. తీసుకోండి.

ఇంతలో ప్రక్కరూములో టెలిఫోనుశబ్దం. సోమసుందరం వెళ్తాడు.

విశ్వ : లక్షాధికార్లు. భిక్షాదానం చేయగలవారు.

గిరిజ : రామ రామ. ఆ ఉద్దేశంతో నేను అనలేదు-ఒట్టు.

సోమ : (ప్రవేశించి) చాలా అవసరంగా రమ్మని రావూరు జమీందారుగారు ఫోనుచేశారు. ఇప్పుడే వెళ్ళి వస్తాను. క్షమించండి. వెరి సారి.

గిరిజ : నో, నో. మీరేమీ ఖంగారు పడవద్దు. మీ తమ్ముడు గారితో మాట్లాడుతూ ఉంటాను.

సోమసుందరం వెళ్ళును. గిరిజ, విశ్వం మాట్లాడక ఊరుకుంటారు. కారు వెళ్ళుతున్న చప్పుడు.

విశ్వ : ఇక్కడికి ఎందుకు వచ్చావు ?

గిరిజ : మీ అన్నగారివంటి న్యాయవాదుల దగ్గరికి ఎందుకు వస్తారు ?

విశ్వ : అయితే నీ కటువంటి కష్టా లెందుకుంటవి ?

గిరిజ : లేకేమి. బోలెడు... ఇకమీాద ఈ తళుకుజీవనం కట్టి పెట్టవలసిన స్థితి వచ్చింది—విశ్వం ! నేనొక బీద రాల్ని యిప్పుడు.

విశ్వ : (నిగ్గరగా) నిజంగా ? నిజంగా ! అయితే నీవు లక్షాధి కారిని గావూ...

గిరిజ : (సంకోచంతో) కాను. భిక్షాధికారిని. నాడబ్బు నిలవవుంచిన బ్యాంకి దివాలా తీసింది.

విశ్వ : (సంతోషంతో) నిజం ! నిజమేనా ?

గిరిజ : ఎందుకు ? ఎందుకిలా సంతోషంగా గంతులు వేస్తున్నావు ?

విశ్వ : అవును, గిరిజా, అవును. నాకు సంతోషం పొంగి పోతూవుంది.

గిరిజ : నేను అభాగినిని అయినందు కనా ?

విశ్వ : నిస్సందేహంగా, అవును.

గిరిజ : కారణం ?

విశ్వ : పిచ్చిదానా, అర్థంకాలేదూ... ఈరహస్యం ... విను ... ఇప్పుడు నన్ను పెళ్ళిచేసుకోమని అడగడానికి సాహసించగలిగాను...ఇంతవరకూ నీవు లక్షల కధికారిణివని సంకోచంతో అనుమానిస్తూ వున్నవాడికి యిప్పుడు ధైర్యం వచ్చింది. ఇప్పుడు నీవు ఒక సాధారణ

వనితవని తెలిసింది. అందుకే ఈ సంతోషం. మరి ఆలస్యం ఎందుకు... చెప్పు–ఇష్టమేనా ?

గిరిజ : (సిగ్గుచేత తలవంచుకుని ఊరకుంటుంది.)

విశ్వ : ఏమి ఈ మౌనం ? అన్నగారు నామీద చాడీలు చెప్పినారా ?

గిరిజ : లేదు. లేదు. మీకు లేని సుగుణాల్ని కూడా వర్ణించారు.

విశ్వ . అయితే మరి ?

గిరిజ : (సిగ్గుతో మాట్లాడదు )

హారన్ చప్పుడు.

విశ్వ : అన్నగారు వస్తున్నారు. వారితో చెప్పేస్తాను– నీవు ఒప్పుకున్నావని. ఏం !

గిరిజ : (అంగీకారం సూచిస్తుంది– శిరఃకంపనంతో)

ప్రవేశం సోమసుందరం.

సోమ : సారి, క్షమించండి.

గిరిజ : అవసరంలేదు.

విశ్వ : (ఆగలేక) అన్నయ్యా ! ఒక గొప్పవిషయం చెప్పాలి నీకు... గిరిజా, నేను... ...వివాహమాడటానికి నిశ్చయించుకున్నాము .. ... మీ దగ్గరనుంచి రెండు వరాలు అపేక్షిస్తున్నాను... ఒకటి... నీఆశీర్వాదము. రెండు కొంత డబ్బు. గిరిజ బీదరాలు. నేను బీదవాణ్ని. మా జీవయాత్ర ప్రారంభించడానికి పెట్టుబడి మీరే పెట్టాలి. ...మళ్ళీ యిచ్చేస్తాము, ఏళ్ళాగో...

సోమ : (విశ్వం మాటలు వింటున్నప్పుడు భావతరంగాలు ముఖంలో ప్రదర్శనమవుతవి. మొదట నిర్విణ్ణత, తరువాత ఆశ్చర్యము, బాధ...)

ఇవేమి మాటలోయి, పిచ్చివాడా! గిరిజాదేవికి కనీసం రెండులక్షల భూస్థితి ఉంటుంది.

విశ్వ : ఆఁ... మరి నాతో అబద్ధమాడిందా.

గిరిజ : (నవ్వుతూ వుంది)

సోమ : (చిరునవ్వు తెచ్చుకొని) విశ్వం! అదృష్టవంతుడివి... సుఖంగా వుండండి ... దీర్ఘాయుష్మాన్ భవ ! ... ఉండు... (చెక్కు పుస్తకంతీసి 10, 000 రూపాయలకు చెక్కువ్రాసి విశ్వానికి ఇచ్చి) నా ఆశీర్వాదంతో యిస్తున్నాను... సోమసుందరం తమ్ముడివి నీవు బీదవాడి వెందుకవుతావు ?

విశ్వ : అన్నయ్యా! (చేతులు పట్టుకుంటాడు)

సోమ : ఇక వెళ్ళండి... అమ్మా, మావాడిని నీ చేతుల్లో ఒప్ప చెప్పుతున్నాను.

గిరిజ : తమ అనుగ్రహం (విశ్వం, గిరిజ వెళ్ళిపోతారు.)

సోమ : (పెద్ద నిట్టూర్పుతో) ఎంత పొరపాటు చేయబోయాను. ... జరిగిందే యుక్తం ... ... అయినా... (లోపల జేబులోనుంచి గిరిజ బొమ్మ తీసి, చూచి

నిట్టూర్చి, ముక్కలు ముక్కలుగా చింపుతూ)
సుబ్బన్నా !

సుబ్బన్న ప్రవేశం

ఎవరువచ్చినా నాతో చెప్పు. వీలులేదని పంపి
వేయకు.

సుబ్బ: చిత్తం.

—•••—

## పాత్రలు :

| | | |
|---|---|---|
| వేణుగోపాలరావు | ... | |
| రామలక్ష్మమ్మ | ... | వేణు తల్లి |
| శారద | ... | వేణు భార్య |
| సత్యనారాయణ | ... | వేణు తమ్ముడు |
| డాక్టరు గుప్తా | ... | వేణు డాక్టరు |

---

# మాతృప్రేమ

మేడమీద గది. విశాలంగానే ఉంది. ఒకమూల మంచం. మంచానికెదురుగోడంతా అద్దాలకిటికీలు, కొన్ని తెరువబడి కొన్ని మూసిఉంటవి. మంచానికి ప్రక్క బల్ల, బల్లపైన మందుసీసాలు, గ్లాసులు వగైరా.

కాలం: సాయంత్రం.

రంగము నడిచేకొద్దీ చీకటిపడుతుంది.

మంచంమీద వేణుగోపాలరావు పడుకున్నాడు. వయస్సు 30 కి మించిలేదు. దీర్ఘరోగపీడితుడని అతని దౌర్బల్యమే చెప్పుతూవుంది. అయినా ముఖములో తేజస్సుంది. కళ్లల్లో కాంతి అప్పుడప్పుడు ప్రకటన అవుతుంది. బాధచేత బొమలు పైకెత్తినప్పుడు విశాలమైన నుదుట ముడతలు కనపడతవి... వేణు ఒంటరిగా చూస్తున్నాడు కిటికీగుండా అస్తమయ సౌభాగ్యం. ప్రవేశం రామలక్ష్మమ్మ, అతని తల్లి. విధవరాలు, అయినా జుట్టుంది. నున్నని నల్లని, వెంట్రుకలలో అక్కడక్కడ జరీపోగులు కలసి ఉన్నవి. గాంభీర్యమూ ఉంది; సౌలభ్యము ఉంది—ఉనికిలో చేష్టల్లో, చూపుల్లో.

రామలక్ష్మమ్మ: నాయనా! ఆరువేశారు. మందు పుచ్చుకోవూ! (బల్లదగ్గిర గ్లాసులో ఒక సీసానుంచి మందు వంచబోతుంది)

వేణుగోపాలరావు: (కొంచెం దీనంగా) అమ్మా!

రామ: ఏమి నాయనా!

వేణు: వద్దే ఇవ్వాళ మందువద్దే... చూడు! నీకేమీ పని లేకపోతే ఇక్కడ కొంచెం సేపు కూర్చో ...... నాకేమీ తోచడంలేదు.

రామ: అలాగే నాయనా! (ప్రక్కగ కుర్చీ వేసుకొని కూచ్చుంటుంది. కొంతసేపు ఇద్దరూ మాట్లాడరు)

వేణు: అమ్మా! నా జన్మంతా ఇంతే కదమ్మా.

రామ: ఏమి మాటలు నాయనా.

వేణు: అయ్యో! నాకు తెలియదటే...

రామ: (దుఃఖం ఆపుకొని) నీకేమి తెలుస్తుందిరా. మన డాక్టరుగారు చాలా గొప్పవారంటారు. నీమీద ఎక్కువ శ్రద్ధ కూడాను. త్వరగా లేచి తిరుగుతావులే నాయనా.

వేణు: (కొంచెంసేపు ఊరుకొని) అమ్మా! శారద పాపం చాలా కష్టపడుతూ ఉందికదూ నామూలాన్న.

రామ: (అనాలోచితముగా) అబ్బే! లేదు నాయనా.

వేణు: ఆఁ—అదీ దొరికావు. అదేనమ్మా నిన్నడగాలని. నీ అభిప్రాయం చెప్పకపోతే ఒట్టు... ...

రామ: ఎందులో?

వేణు: శారద విషయంలో.

రామ: (స్వల్పంగా చలించి) అంటే?

వేణు: శారదలో మార్పుకనపడుతూవుంది కొన్నాళ్లుగా— నాలుగైదు మాసాలుగా. నాకు జబ్బుచేసిన మొదటి రోజుల్లో అబ్బా! ఏమి ఏడ్చేది ... రోజుకు ఒక్కసారైనా అన్నం ముట్టుకునేది కాదు కదూ! జ్ఞాపకం లేదూ?

రామ: ఊం.

వేణు : డాక్టరుగూడా ఒకసారి మందలించాడు. 'ఇదిటమ్మా పతివ్రతా ధర్మం. పతికి పరిచర్య చెయ్యడానికైనా ఒంట్లో సత్తువ ఉండవద్దటమ్మా' అని... ...పాపం. రోజూ రాత్రిళ్ళు నేను నిద్రించే వరకు ప్రక్కనే కని పెట్టుకుని ఉండేది. అవునా ?

రామ: అవు నిదంతా ఎందుకు నాయనా ఇప్పుడు ?

వేణు : (వినిపించుకోక నే) నాకు చాలా జాలివేసేది. ఆ కుసుమ సుకుమారమైన దేహం కృశించి పోవడం చూచినప్పుడు నామీద నాకు కోపం వచ్చేది, కారణం నా వ్యాధికదా అని... ...ఆ లేడి కళ్ళల్లో నీళ్ళు గిర్రుమని తిరిగితే నా కడుపులో చేతులు వేసి కలబెట్టినట్లు బాధపడేవాడిని... ...

రామ· (ధోరణి త్రిప్పేయడానికి) చీకటి పడుతోంది. దీపం వెయ్యనా ?

వేణు : వద్దు. వద్దు ...వింటూ ...అలా ఉండేదా, మనసత్యం పరీక్షలు కాగానే వచ్చినప్పుడు చూచి ఆనవాలు గూడా పట్టలేకపోయాడు ...ఆ తరువాతే కదూ నేను కూడా మందలించి ఇంత చిన్నతనంలో ఎల్లప్పుడూ రోగిదగ్గరనే ఉంటే తప్పు అని, ఇతరవిషయాల్లో కొంచెం ఆసక్తి తీసుకోనేటట్టు చెయ్యరా మీ వదినగార్ని అని సత్యంతోకూడా అన్నాను.

రామ: వేణూ ! ఏమిటీ పురాణం ?

వేణు : పోనీలే! నీ ఆశ ఇంతే.

రామ: (దుఃఖం ఆపుకొని) పిచ్చి తండ్రీ...

వేణు : (తటాలున ఏడుస్తూ) అంతా మారిపోయిందమ్మా శారద!... ...

రామ: అయ్యయ్యో! ఏడుపెందుకు నాయనా! ఛీ!... ఊరుకో...

వేణు : మెల్ల మెల్లగా నా దగ్గిరికే రావడం మానేసింది... రోజు కొక్కసారి కూడా రావటంలేదు. విచారం లేదు. పోనీ అనుకున్నాను. విసుగుకూడానూ.... మొన్న ఆరోజు పట్టుచీర కట్టుకుంటే పూచిన గులాబీ పువ్వులాగ కనబడింది... కండ్లు కొర్కాతీరా చూచి ఆనందించటానికైనా పట్టుమని పదినిముషాలు ఉండ మంటే కూడా ఉండలేదు... ...సినీమాకు వెళ్ళి పోయింది...

రామ: చిన్నతనం నాయనా!

వేణు : అమ్మా! అమ్మా! నీవుకూడా ఈ ఇచ్చకాలే కదూ పలుకుతావు? ఇందుకనేనా నీతో చెప్పుకున్నది.

రామ: అదికాదురా! శారద పసిపిల్ల. సరదామనిషికూడాను. ఎన్నాళ్ళు కృశిస్తూ ఉంటుంది? ఎప్పుడైనా అలా షికారు వెళ్ళుతుంది.

వేణు : అది తప్పన్నానా! నేనేగా పొమ్మన్నది... ...కాదు అంతమాత్రానికి ఇంత క్రూరంగా బాధపడతానా

కాదుకాదు... (గద్గదస్వరముతో) అదికాదు......
శారదకు నామీద ప్రేమే పోయింది.

రామ: ఛీ! ప్రేమ లేవి ట్రా... నాటకాల్లో కావ్యాల్లోలాగ.
ఇంకేవైనా మాట్లాడుకుందాం రా... లేదా గ్రామ
ఫోను విందువుగాని.

వేణు : వద్దు వద్దు నాకు సంగీతంవింటే ఒళ్ళంతా మండుకు
పోతుంది. వద్దు అమ్మా... అమ్మా! ... ఏమను
కోవుగమా నేనొకమాట అంటే...ప్రేమంటే ఆక్షే
పించావు. అయితేచెప్తు, నాయన నిన్ను పెళ్ళాడి
నట్లేనా నేను శారదను పెళ్ళాడింది......నాయన
నీవెవరో తెలియకుండానే మూడుముళ్ళు వేశాడు.
నేను శారదను కోరి ప్రేమించి అనురాగంతో
వివాహం చేసుకున్నాను....

రామ: ఇప్పుడు మాత్రం ఏమినాయనా. ప్రేమ ఎక్కడికి
పోతుంది?

వేణు : లేదమ్మా లేదు. నేనెరుగనూ? ప్రేమ నశించి
పోయింది. శారదకు నామీద ప్రేమ నశించింది...
నా జీవితంలో ఆనందలక్ష్మి వెళ్ళిపోయింది... నా
హృదయాకాశంలో ఇప్పుడు చంద్రుడు లేడు......
నిండు అమావాస్య......

రామ: నేనేమిచెప్పను నీవంత పిచ్చిగా మాట్లాడుతూవుంటే!

వేణు : (అమ్మచేతులు గట్టిగా పట్టుకొని గద్గదస్వరముతో)
అయితే......అమ్మా! అమ్మా!...ఒకవేళ శారద

ఇంకొకణ్ని ప్రేమించినట్టు తెలిసిందా. అబ్బా ... ఓర్చుకోలేను... ఆపుకోలేను... అప్పుడు నా రక్త నాళాల్లో రక్తం ప్రవహించదు... ... అగ్నిజ్వాలలు పరుగెత్తుతవి. ఆ బాధ పడలేను.

రామ: (ఆ పరధ్యానంలో ఎంత ఆలోచన ఉందో ఎవరికి తెలుసును. తటాలున చిరునవ్వుతో) ఛీ! ఎంత వెర్రిరా, అబ్బాయి. ద్రోహం కూడాన్ను అలా భావించడం... నిజం చెప్పనా ?

వేణు : చెప్పు, చెప్పు. త్వరగా చెప్పు.

రామ: ఇదంతా నాతప్పే... శారద అలా విచారంగా ఉంటే నీవు బెంగ పెట్టుకోవడం చూచి డాక్టరు నాతో అన్నాడు: 'మీ రెట్లాగన్నా ఆవిడను కొంత సరదాగా ఉండేట్లు చేయాలి... అప్పుడుగాని అబ్బాయికి శాంతి ఉండదు. శాంతి ఉంటేగాని మందులు పనిచెయ్యవు' అని; అందుచేత మేమందరమూ చిలకకు చెప్పినట్లు చెప్పి బ్రతిమాలి ఆవిణ్ని మెల్లమెల్లగా నీదగ్గరే ఉండకుండా చేయించాము... ...పాపం! అదేమి చెయ్యగలదు.

వేణు : నిజంగా ? నిజంగా! కల్పిస్తున్నావు.

రామ: పోనీలే! నమ్మకపోతే.

వేణు : కాదే. నిజంగానా అని సంతోషంచేత అడిగానే... (కండ్లు మూసుకొని) అబ్బ! ఎంత కష్టపడ్డాను... ...

రామ: పిచ్చినాయనా...కొంచెం పాలుపుచ్చుకో. (పాలు తాగిస్తుంది.)

వేణు : (త్రాగి) అబ్బబ్బ! (అని గుండెపట్టుకొని) చాలా బాధగా ఉందమ్మా!... ...ఏదీ! ఏదీ! డాక్టరుగారు ఇస్తాడే ఆ నిద్రమందు ఇచ్చేయవే...

రామ: (గబగబా ఆ సీసా వెదకి గ్లాసులో పోస్తుంది)

వేణు : అబ్బా! ఘోరంగా వుందే బాధ.

రామ: (చేతులు తడబడినవి గాబోలు. వేగముగా చుక్కలు పడ్డవి గ్లాసులో. గ్లాసు నోటివద్దపెట్టి త్రాగించును)

వేణు : (త్రాగిన రెండునిముషాలకు నిశ్శబ్దము. తల్లి వేణును రెప్పవాల్చకుండా చూస్తుంది. వేణు కండ్లు మూసు కుంటాడు. తల్లి అలాగే చూస్తూవుంది)
(తలుపుచప్పుడు)

రామ: (అదిరిపడి) ఎవరు?

(తెరలో) డాక్టర్ని.

రామ: రండి.

ప్రవేశం: డాక్టరు గుప్తా.

నిద్రపోతూవున్నాడు ... ఇప్పుడే మీరిచ్చిన నిద్ర మందిచ్చాను–చాల బాధపడుతూవుంటే.

డాక్టరు: ఆఁ, బాగా నిద్రపోతున్నట్టుంది... ... (కొంత అను మానిస్తూ) రామలక్ష్మమ్మగారూ! ఎవరూ లేరుగనుక ... ఒకగొప్ప సందర్భం తటస్థించింది... చెప్పకతీరదు.

రామ: (లేచి) ఏమిటది?

డాక్టర్: మీరు మీకోడళ్లో మార్పు ఏమైనా కనిపెట్టినారా?

రామ: (తల ఊపును)

డాక్టర్: అనుకున్నాను. మీవంటి సూక్ష్మజ్ఞులకు కష్టంకాదు. మళ్ళీ అడుగుతాను... నేను చెప్పే మార్పు ఏమిటో అర్థం చేసుకున్నారా...!

రామ: ఆఁ; శారద... సత్యం...

డాక్టర్: అంతేకాదమ్మా.

రామ: (నిట్టూర్చి) అబ్బా! డాక్టరుగారూ! తెలుసును... మూడవనెల... ...

డాక్టర్: (నమస్కరిస్తూ) క్షమించండి మూర్ఖుణ్ణి. అబ్బాయికి తెలిస్తే ఈ రోగబాధతోకూడా మనోవేదన ఎలా సహిస్తాడు! ఎంత ఘోరము! భరించటానికి శక్తి కూడా లేదే.

రామ: (కండ్లనుండి నీళ్ళు ధారలుగా ప్రవహిస్తూ వున్నవి.) అబ్బాయికి ఆ బాధ తప్పిపోయింది.

డాక్టర్: ఆఁ. ఆఁ. (అప్పుడు హఠాత్తుగా వేణుచెయ్యి పట్టుకొంటాడు. నాడి దొరకలేదు.) ఎప్పుడు? ఎప్పుడు... ఏమైంది...?

రామ: (ఏడుపు బిగబట్టి ఆపి) నిద్రమందు... చుక్కలు... ఎక్కువైనవి.

డాక్టర్: (అంతా స్ఫురిస్తుంది.) ఆఁ ఆఁ... ఎంతధైర్యము!

తెరలోనుంచి వినబడుతుంది, మెల్లెక్కివచ్చు

శారదా సత్యనారాయణుల సంభాషణ.

శారద: ఎంత అద్భుతంగా ప్రకటించిందోయి భావాలు ఆ ప్రేటాగారోబ.

సత్య: అబ్బో, ఫిల్ముల్లో ఆసక్తి ఎక్కువవుతూవుందే!

శారద: పోదాం వేళాకోళం.

రామలక్ష్మమ్మ, డాక్టరు ఒకరినొకరు చూచుకొంటూ నిలబడతారు. రామలక్ష్మమ్మ కన్నీళ్ళధారమాత్రం ఆగలేదు.

—...—

## పాత్రలు:

| | | |
|---|---|---|
| వెంకటసుబ్బయ్య | ... | |
| కామేశ్వరమ్మ | ... | వెంకటసుబ్బయ్య భార్య |
| సుబ్బమ్మ | ... | వెంకటసుబ్బయ్య చెల్లెలు |
| సత్యనారాయణ | ... | వెంకటసుబ్బయ్య కుమారుడు |
| సుభద్ర | ... | సుబ్బమ్మ కూతురు |
| వెంకటేశ్వర్లు | ... | కామేశ్వరమ్మ తమ్ముడు |
| రాధ | .. | బాల వితంతువు |
| నౌఖరు | | |

# విముక్తి

## రంగం ౧. వెంకటసుబ్బయ్యగారి యిల్లు.

వీధి ప్రక్కగదిలో వెంకటసుబ్బయ్యగారి భార్య కామేశ్వరమ్మ వక్కలు కత్తిరిస్తూ కూర్చున్నది. వెంకటసుబ్బయ్యగారి చెల్లెలు సుబ్బమ్మ రుక్మిణీ కల్యాణము చదువుచున్నది. కామేశ్వరమ్మ వయసు 45 సంవత్సరాలు దాటినవి. వెంట్రుకలలో వెండిఛాయ కనబడుచున్నది. విశాలమైన కండ్లు. చేష్టలలో చాల నెమ్మది. సుబ్బమ్మ విధవరాలు. ముఖములో కాఠిన్యమున్నది. కోపము వచ్చినప్పుడు మిడిగ్రుడ్లు భయంకరముగా వుంటవి.

సుబ్బమ్మ: (కూనిరాగముతో చదువుచు ఆపి) ఆఁ, రుక్మిణంటే జ్ఞాపకం వచ్చింది వదినెగారూ! మన ఎదిరింటి రుక్మిణిని సూరిసెట్టి వారబ్బాయి ఉంచుకున్నట్టుంది, వారి కారు రోజూ గుమ్మందగ్గిర వుంటుంది. చాలా అదృష్టవంతురాలు.

కామేశ్వరమ్మ: ఏ మదృష్టమో. వయసూ సొగసూ వున్న రోజులు బాగానే గడిచిపోతవి. తరువాత నరకం గదూ.

సుబ్బ: నరకంమాట దేవుడెరుగును. వీలైనంతవరకు లక్షణంగా అనుభవిస్తారు... కానీ వదినగారూ, వారి మంచిరోజులు సహా ఈ కలికాలంలో వెళ్ళిపోతూన్నవి.

కామే: అవును మరి. వారికే అసహ్యం పుడుతూ వున్నది గాబోలు వారి సేవనం.

సుబ్బ: ఊఁ! అసహ్యంలేదు, అపత్యం లేదు. దానికి కారణాలు వేరు. అసలు వారి జరుగురే లేకుండా వుంది. మునుపటి రోజుల్లో వయసువచ్చిన కుర్రవాడికి ఏ ఆరో ఏడో పండ్లదాన్నిచ్చి వివాహం చేసేవారు. అది కాపరానికి రావడానికి ఏ ఎనిమిదేండ్లో అయ్యేది. అంతవరకూ... మూచారూ...

కామే: (నవ్వుచు) అర్థమయింది. ఇప్పుడు ఈడుగల పిల్లలకే పెండ్లి చేయటంచేత కుఱ్ఱవాళ్ళు దుర్మార్గానికి దిగరంటావు. అది బాగానేవుంది.

సుబ్బ: బాగా చెప్పావు. మన ఆచారాలు, సాంప్రదాయాలు మట్టిలో కలిసిపోయాయన్న మాట మరిచిపోయావు. అంతేకాదు. ఎన్ని చట్టాలున్నా ఏదో రహస్యంగా మనలోనూ, ఆచారానికి భంగం కాకుండానే వివాహాలు జరుగుతూవున్నవి. కానీ ఇంకొక పెద్ద కారణం. విధవా వివాహాలు బలిసిపోతూవున్నవి. మంచి ప్రాయం వచ్చిన వెధవ ముండలు హాజరుగా వుంటే కుర్రవాళ్ళకి పూర్వపు బాల్యసంబంధాలు ఎలా రుచిస్తవి?

కామే: సుబ్బీ! మన ధర్మశాస్త్రాలకు విరుద్ధమని గాని, వారి గోడు కూడా చాలా కష్టమైంది కాదూ? చూడు మన సుభద్ర గతి.

సుబ్బ: దానికి మన మేమి చెయ్యగలం? దైవాజ్ఞ. అందు కని అది మొగుణ్ణో పెండ్లో అని గోడలు దాటుతూ వుందా?

కామే: ఆ! నీకు చెప్పాలనుకున్నా దానివిషయం. దుర్మార్గం వుందని కాదు. ఎందుకన్నా, ముందు జాగ్రత్తగావుంటే తరువాత చిక్కురాదని. మన సుభద్రకు ఆలమూరి అబ్బాయితో పరిచయం ఎక్కువౌతున్నట్టుంది.

సుబ్బ: (కోపంతో) అహ!! ఎవడు నాబిడ్డని వేలుపెట్టి చూపించగలడో చూస్తాను! పాపం వుంటే లోకానికి భయపడాలి గాని.

కామే: సుబ్బీ! కోప్పడకు. ఏదో పెద్దదాన్నికదా, మన సుభద్రకు కష్టంవస్తే మనకు ఏచ్చినట్లేనా? విన్నావు కదూ, గోపాలకృష్ణయ్యగారి మేనకోడలి సంగతి.

సుబ్బ: ఆ పలుగాకిముండ రాధేనా? వినకేం? మన రాఘవ రావుగారి కుమారుణ్ణి గంగలోకి దింపి కడుపు తెచ్చుకుందేగాక పైగా పెండ్లాడ మన్నదట. ఆ అమాయకుడు ఊఁ అని ఇంటికివచ్చి అయ్య పెట్టేవి రెండు పెట్టిన తరువాత మళ్ళీ కిక్కురు మనకుండా నోరుమూసుకుని వున్నాడు. పాపం. శుద్ధశ్రోత్రియులు గోపాలకృష్ణయ్యగారు, దాన్ని పెట్టుకొని ఎలా భరిస్తారు?

కామే: పాపం! ఆ పిల్లగతి ఇంకేమిటి?

సుబ్బ: చేసుకున్నదానికి అనుభవిస్తుంది. అంతటితో పోదుగా... ... మంచి కుటుంబం పేరు భ్రష్టుచేసింది.

అప్పుడు ప్రవేశము వెంకటేశ్వర్లు, కామేశ్వరమ్మ తమ్ముడు. పని పాట లేదు. భూములపై వచ్చే ఆదాయంతో వేశ్యలనీ తన్నూ పోషించుకుంటూ బావగారి ఇంట్లో ఉన్నాడు.

కామే: ఇదుగో మా తమ్ముడు. ఏమిరా! గోపాలకృష్ణయ్య గారి మేనకోడలి సంగతి ఏమైనా సంపాదించావా!

వెంకటేశ్వర్లు: (చుట్ట వెలిగిస్తూ) ఆ అమ్మాయి పారిపోయిందన్నారు.

సుబ్బ: ఆ! ఆ! ఎవరితో?

వెంక: సుబ్బమ్మగారి భావాలు ఎలా పరుగెత్తుతున్నవో! లేదు. ఎవరితోనూగాదు. తనంతట తానే. ఎవరితో చెప్పకుండా వెళ్ళిపోయిందట.

కామే: ఏమైపోయిందో కదా!

ప్రవేశము సుభద్ర. సుబ్బమ్మకూతురు. బాలవితంతువు. నడవడిక మంచిదిగాదు.

సుభద్ర: ఎవరు?

కామే: రాధ.

సుభ: రాధా? ఆవిడసంగతి చెప్పడానికే వచ్చాను.

వెంక: తమ రిప్పుడెక్కడనించి రావడం?

సుభ: (పెదవులు త్రిప్పుచు) జగన్మోహిని యింట్లోనుంచి.

వెంక: ఛీ! ఊరుకో—నీవు ఆలమూరివారి అబ్బాయితో చాలాదూరం వెళ్ళుతున్నట్లుంది సుమా!

సుభ : గుండెపంట తలనొప్పి మరచిపోయి ఇతన్ని నాక్షేపించిందట.

కామే: సుభద్రా! చాలు.

సుభ : మరి నన్ను అలా అనడం న్యాయమేనా?

కామే: రాధ ఏమయింది?

సుభ : రాధ మనవూరికే వచ్చిందట.

సుబ్బ: ఎంత ధైర్యం? అన్నిటికీ తెగించింది.

కిటికీలో స్త్రీవ్యక్తి కనబడుతుంది. వెనక మాటలు వినబడుతున్నవి. 'కామమ్మగారూ! కామమ్మగారూ'. అని.

కామే: ఎవరది?

సుబ్బ: (పుస్తకం పారవేసి గుడ్లు పగిలిపోవునట్లు చూస్తూ ఉన్నది)

సుభ : (తలుపు తీస్తుంది)

ప్రవేశము రాధ. వయసు 18 కి మించదు. సౌందర్యవతి. బాల వితంతువు. గర్భవతి. అలసి వాడిపోయి వున్నది. దుఃఖముతో క్రుంగిపోయినది.

రాధను చూడగానే మొదట అందరి ముఖాలు రక్తహీనములైన పోయినవి. తరువాత ఒక్కొక్కరి ముఖంలో ఒక్కొక్క భావము. కామేశ్వరమ్మకు జాలి. సుబ్బమ్మకు కోపము, అసహ్యము. వెంకటేశ్వర్లు సౌందర్యాన్నుచూచి ఆనందిస్తున్నాడు. సుభద్రమ్మకు హేళనముతో కూడిన సరదా.

రాధ : కామేశ్వరమ్మగారూ! ఇంత హఠాత్తుగా వచ్చినందుకు క్షమించవలెను.

కామే: (ఏమో అనబోయి సుబ్బమ్మనంక తిరిగి ఆవిడ చూపులోని బెదరింపుకు భయపడి ఆగిపోవును.)

రాధ: (కొంత నిట్టూర్పుతో) నే నెవరినో ఎరుగుదురా? ఈ స్థితిలో ఆనవాలు పట్టలేక పోవచ్చునేమో అని అడిగాను.

సుబ్బ: ఎరగ కేమి? గోపాలకృష్ణయ్యగారి మేనగోడిలివి కావు?

కామే: (కొంత ధైర్యంతో) ఎరగకేమమ్మా! మీ తల్లిని బాగా ఎరుగుదును. పాపం!

రాధ: (కండ్లనిండా నీళ్ళతో) అమ్మ పుణ్యాత్మురాలే లెండి. నా యవస్థ చూడకుండా వెళ్ళిపోయింది.

వెంక: (ఏమనడానికి తోచక ఏదైనా అనవలెనని) అయ్యయ్యో!

సుబ్బ: అయితే-అమ్మాయి! ఇలా అకస్మాత్తుగా రావడం మా కర్థముకా లేదు. గోపాలకృష్ణయ్యగారు నీవు వస్తున్నావని ఉత్తరం వ్రాసినట్లులేదే.

రాధ: లేదు. లేదు. ఇచ్చటికి రావడం వారికి తెలియదు. (తల గిర్రుమని తిరుగుటచే కండ్లుమూసు కొనును.)

కామే: నిలబడే వున్నా వెందుకు! కూర్చోవమ్మా.

సుబ్బ: (రహస్యంగా) వదినెగారూ! వ్యవహారం ఏమీనచ్చ లేదు.

కామే: (తబ్బిబ్బుతో) ఎం చెయ్యాలె మనం?

రాధ : నా కథ చెప్పుకోడానికి నాకే సిగ్గువేస్తూవున్నా చెప్పకోక తప్పదు. మీాకు తెలిసే వుండవచ్చును.

సుబ్బ: ఆహా! ఊరూరా గోపాలకృష్ణయ్యగారి పేరు నీ మూలాన్న దిక్కుదిక్కులకూ గోడ్డుకూడదికి వచ్చింది. తెలియకేమి?

రాధ : మీారెన్నిమాట లన్నప్పటికీ జవాబుచెప్పలేని స్థితిలో ఉన్నాను. కేవలం చేసుకొక తెసయిన, ఏ భావియో, ఏ గుంటనో చూచికొనే వుండును. కాని.. (గద్గదస్వరముతో) ఇంకొక ప్రాణం ... (మాటలాడ లేకపోవును)

కామే: రామ! రామ!

సుబ్బ: (పెద్ద గొంతుతో) అయితే యిప్పుడు మాయింటికి రావడం నాకేమీా సబబుగా కనబడ్డం లేదు. 'వీథిలో వెళ్ళే శనేశ్వరుడా మా యింట్లోకి రారాదా' అన్నట్లుంది.

రాధ : అబ్బబ్బా! మీారింత పరుషంగా మాటాడ నవసరం లేదు. దీనస్థితిలోవున్న నాపై కరుణించి ఆదరిస్తా రేమోనని వచ్చాను. కాని మిమ్మల్ని బాధపెట్ట వలెనని రాలేదు.

కామే: సుబ్బీ! ఎందుకంత కఠినంగా అన్నావు?

సుబ్బ: ఏమిా! కఠినమా? అఘోరించినట్టేవుంది. అన్నయ్య రానీ తెలుస్తుంది.

(ప్రవేశము: వెంకటసుబ్బయ్యగారి కుమారుడు సత్యనారాయణ. వయసు 24. అందగాడు గాకపోయినా, సులక్షణుడే.

సత్య : (మొదట రాధనుచూచి తరువాత ఒక్కొక్కరిని చూస్తాడు. సూక్ష్మగ్రాహి కావున కొంతవరకు అర్థం చేసుకుంటాడు.) అమ్మా! ఏమిది రాధ ఇలా నిలబడ్డది?

కామే: అబ్బే, ఏమీలేదు... నాయనా ... ఇప్పుడే ... అకస్మాత్తుగా... వచ్చింది.

సుబ్బ: (బిగ్గరగా) మీ అమ్మకు మతిపోయింది. ఈఅమ్మాయి సంగతి నీకు పూర్తిగా తెలియనట్లుంది. భర్తను ధారవోసుకొని, ఏదో ఒకమూల 'కృష్ణా, రామా' అని కూర్చోలేక గడ్డిమేసి, మంచి కుటుంబానికి సిగ్గు తెప్పించి యిప్పుడు మన యిల్లుచేరింది ... పురుడు పోయించుకోడానికి.

రాధ : (అవమానముతో సహింపరాని దుఃఖము తలకెక్కి అసలే బలహీనదశలో ఉండడంచేత మూర్ఛపోయి క్రిందికి జారిపోతూవుంది.)

సత్య : (రాధ అవస్థచూచి తటాలున పడిపోకుండా చేతులతో పట్టుకొని) త్వరగా! త్వరగా! నీళ్లు, సుభద్రా, వెళ్లు.

సుభద్ర: (తారుమారై లోపలికివెళ్ళి లోటాతో నీళ్ళు తెచ్చిస్తుంది.)

సత్య : (రాధ ముఖముపై నీళ్ళు చల్లుచున్నాడు.)

రాధ : (కండ్లు తెరచి సత్యనారాయణను చూస్తూవున్నది.) కృతజ్ఞత వెల్లువగా కురుస్తున్నవి-చూపులు)

సత్య : కొంత నెమ్మదిగా ఉందా?

రాధ : (తల వూపుతుంది)

సత్య : (మెల్లగా రాధను కూర్చుండబెట్టి లేచి తీక్షణముగా ఒక్కొక్కరిని చూస్తూ)... మీరు... మీరు ... మీరంతరూ మనుష్యులేనా?... మీనరాల్లో రక్తమే ప్రవహిస్తూందా? లేదు... మీరు రాక్షసులు. రాక్షసులైనా తాము చంపినవారి మాంసము భక్షింతురు. అంతేకాని యిట్లు హింసింపరు ... హింసించి చూచి ఆనందింపరు.. అబ్బబ్బా! ఎంత పాషాణ హృదయాలు మీవి? జాలి అన్నది ఏ కోశంలో లేదు గాబోలు ... మా అమ్మకు జాలి లేదనను గాని, ఇందరు రాక్షసులలో ఒక్కతె ఏమిచేయగలదు?... (కోపముతో) ఛీ! సిగ్గు, సిగ్గు! అబల, అసహాయ, చెప్పరాని దురవస్థలో చిక్కి కృశించి, మీ గడప దాటి 'పాహి' అని వచ్చినదాన్ని, కూర్చోమనికూడా చెప్పక, చిత్రవధ చెయ్యడానికి పూనుకొన్నారు.— అయ్యయ్యో! ఈవిడ పవిత్రమైన స్థితిలోనుంది. ఎరుగుదురా? గర్భవతి. సృష్టికి సిద్ధమవుతూవున్నది. అనగా భగవత్ స్వరూపము ధరించియున్నది... అట్టి దాన్ని దయతో ఆదరించి, పోషించడానికి బదులు ఎంత ఘనకార్యంచేశారు? ... సుభద్రా! తీసికొని

వెళ్ళు. మేడమీద నా గదిలో పడుకోబెట్టి పాలూ అవి యిప్పించు... అమ్మా! నేను కఠినంగా మాట్లాడానని నొచ్చుకోకు. నీయందున్న మాతృభక్తే అనుకో, ఈ రాధ యొక్క మాతృ స్వరూపాన్ని గ్రహింపజేసింది. (లోపలికి వెళ్ళును)

కామే: (చీరచెంగుతో కళ్ళు తుడుచుకుంటూ) రా! అమ్మా! రాధా రా! ముఖం, కాళ్ళూ కడుక్కొని యింత పాలో, కాఫీయో పుచ్చుకొని పడుకో (రాధతో నిష్క్రమిస్తుంది.)

వెంక: (సగం తనలో, సగం ప్రకాశంగా) అబ్బో! అబ్బాయి పెద్ద లెక్చరు కొట్టేశాడే!

సుభద్ర: ఇప్పుడా నోరుదెరవడం మీరు! ఏమి ధైర్యం!

సుబ్బ: సుభద్రా! ఊరుకో... మనకెందుకీ గొడవ ... మీ మామయ్య వస్తే తెలుస్తుంది పర్యవసానం.

సుభద్ర: మన సత్యం బావయ్యకి రాధ బాగా పరిచయమైనట్టుందే.

సుబ్బ: కామమ్మవదినె, రాధతల్లీ ఒక్క వూరివారు. చిన్నప్పటి స్నేహమనుకొంటాను.

వెంక: ఇప్పుడు మాత్రం స్నేహం ఎందుకుండకూడదూ?

సుభద్ర: (పకపక నవ్వును)

ప్రవేశము: లోపలినుంచి సత్యనారాయణ. అందరు మౌనము వహిస్తారు. సత్యనారాయణ మరచురామాస్తూ వెళ్లిపోతాడు. ముగ్గురు ఒకరినొకరు చూచుకుంటారు.

## రంగం — ౨

## మేడమీద సత్యనారాయణ గది.

ఒకప్రక్క మంచం. ఇంకొకప్రక్క బీరువా. సమీపంలో బల్ల. గోడమీద ఫోటోలున్నవి. మంచంమీద రాధ కూర్చున్నది.

రాధ : (లేచి, ఫోటో – సత్యనారాయణది – చూస్తున్నది. చప్పుడువిని ఉలికిపడి మళ్లీ మంచంమీద కూర్చుని, ఉస్సురుమని, ముఖం చేతులతో కప్పివేసుకుని, మెల్లగా ఏడుస్తున్నది )

ప్రవేశము : సుభద్ర.

సుభద్ర: (సమీపించి) రాధా !

రాధ : (చేతులు తీసివేసి కండ్లుతుడుచుకుంటూ) కూర్చోండి.

సుభద్ర: కూర్చుంటాను, మర్యాద లెందుకులే.

రాధ : (పలకదు.)

సుభద్ర: (కొంతసేపు ఊరుకుండి) రాధా! నీవు తెలివి మాలినపని చేశావు సుమా.

రాధ : (కనుబొమ్మలు ముడివేసింది.) ఏది ?

సుభద్ర: నవ్వనా, ఏడవనా ? ... ఇంకేమున్నది? మనబోటి వారికి సంభవించే విపత్తు ఇంతకన్నా ఇంకేమున్నది?

రాధ : మనలో నున్నదా ?

సుభద్ర: ఆహా! ... అందుకే అన్నాను తెలివితక్కువపని చేశావని. ఎందుకంటావా? ... లోకం అభిప్రాయానికి తోవా తెన్నూ ఉండదు. మనం ఏదో

మనసు పట్టలేక తప్పుచేస్తామనుకో. అంత మాత్ర ముతో పోతే సవ్యంగానే వుంటుంది. లోకానికి తెలిసినా ఒక కన్ను మూసుకుంటుంది. మనకేమీ బాధ కలగదు...కానీ, కర్మవశాత్తుగ ఈ కష్టం సంభవించిందా; లోకం ఉగ్రమైపోతుంది ... నా విషయం తీసుకో ఉదాహరణానికి, నేను మహాపతి వ్రతనని చెప్పకోవడంలేదు. అందులో నీతో ఎందు కబద్ధమాడుతాను? అయినా లోకం నన్ను వేలుపెట్టి చూపించిందా ?... నీకు చూడు- ఎంత బాధో ? మనం చేసిన తప్పలో భేదం లేకపోయినా శిక్షించడంలో ఎంత భేదమో చూచావా ?

రాధ : మీ మాటల్లో అర్థం నేను పూర్తిగా గ్రహింపలే కున్నాను. నేను తప్పని తెలిసి ఏపనీ చెయ్యలేదే!

సుభద్ర: (నవ్వుచు) అంతదూరం వెళ్ళలేదు నాభావాలు. లోకానికి వ్యతిరేకంగా వర్తించగల ధైర్యం నాకు లేదు.

రాధ : విపరీతంగా అర్థంచేసుకున్నారు నామాట. నేనన్నది వేరు. వారు వివాహం చేసుకుంటానని వాగ్దానం చేశారు గనుకనే సమ్మతించాను.

సుభద్ర: (బిగ్గరగా నవ్వుతుంది)

రాధ : (తెల్లబోయి చూస్తుంది) ఇందులో హాస్యానికి చోటు లేదే ?

సుభద్ర: లేదు, లేదు. నీ అమాయకత్వానికి విచారించ వలసిందే!

రాధ : అనగా ?

సుభద్ర: వివాహం చేసుకుంటానని మగవాడు మాట్లాడే మాటలు నమ్మడం...

రాధ : అబ్బ! ప్రపంచంలో అంతమరాద్గ్యం, అంతమోసం ఉంటుందా...అవును, ప్రత్యక్షంగా అనుభవిస్తుంటే ఇక అనుమానం ఎందుకు... నిజంగా తెలిసి తక్కువే.

సుభద్ర: ఏమీ అనుకోకు. నీకు ఇంకా లోకజ్ఞానం లేక పోవటంచేత ఎక్కువగా బాధపడుతున్నావు. నేను వచ్చిం దెవరికి చెప్పవుగదూ! (వెళ్ళిపోవును)

రాధ : పరధ్యానంగా చూస్తున్నది. (వెంకటేశ్వర్లు తొంగి చూస్తాడు. తరువాత చప్పుడుచెయ్యకుండా ప్రవేశిస్తాడు.)

రాధ : (లేవబోవును )

వెంక: (వద్దని సైగచేస్తూ) కూర్చో, అమ్మాయీ, కూర్చో. అసలే ఒంట్లో పటుత్వం లేనిదానవు - అందులో మరిన్ని—

రాధ : కామమ్మగా రేమైనా చెప్పమన్నారా ?

వెంక: అబ్బెబ్బె...(ఇటు అటూ తిరిగిచూచి) అబ్బే నే నిక్కడికి రావడం ఎవరికీ తెలియదు. తెలియనక్కర లేదు కూడాను. నాఅంతట నేనే వచ్చాను. ఒకరు కష్టదశలోఉంటే చూడలేను. ఉడతకు ఊడతా భక్తి అన్నట్లు ఏదో ఒక మాత్రమైనా సహాయం చెయ్యక ఊరుకోలేను.

రాధ : నాకు నువ్వేమి సహాయం చేయగలవు ?

వెంక : సహాయమంటే... స్వయంగా కాదనుకో... దారైనా చూపించవచ్చునుగదా.

రాధ : (నిరాశతో) నాకేమి దారి చూపిస్తావు ?

వెంక : అంత నిశ్చితంగా అడిగితే ఎలా మరి ? నీ విషయమేమి చేయదలచుకున్నావు ?

రాధ : (పెదవి విరుస్తూ) ఏమో.

వెంక : నేనొక గొప్పవిషయం చెపుతాను సావధానంగా విను. 'లోకమో, కులమో, మతమో, ఆచారమో' అని దేవుళ్ళాడితేనే కలుగుతవి కష్టాలు. లోకాన్ని ఎప్పుడు లక్ష్యం చెయ్యమో అప్పుడే సుఖం. శాస్త్రాలు అనుసరిస్తే కడుపు నిండుతుందా ? మర్యాద కాపాడుకోబోతే నెత్తి మాడిపోతుంది... అంతే.

రాధ : ఏమి చెయ్యమంటావు ?

వెంక: ఈయింటివారు శుద్ధఛాందసులు. పిరికిపందలు. నిన్ను వారింట్లో మూడురోజులు ఉంచుకోరు. వాడు కుఱ్ఱవాడు, లెక్కచేసకొట్టి వెళ్ళిపొయ్యాడు. మా బావ వచ్చిన తరువాత తెలుస్తుంది నీకీ ... నాటకానికి సమాప్తి.

రాధ : వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోక తప్పదుగదా !

వెంక : ఎక్కడికి వెళ్ళగలవు ?

రాధ : (పలకదు)

వెంక: మీ మేనమామగారింటికా ?

రాధ : (కాదని తల ఊపుతుంది)

వెంక: రాఘవరావుగారింటికా ?

రాధ : (కాదని సూచించును.)

వెంక: మరి విను ! దమ్మిడీకి పనికిరాని భగ్నసంకోచాలు పెట్టుకుంటే సాగదు. ఉన్నసందర్భం ఏలాంటిదో ఆలోచించు. ఉపకరించే సాధనాలు ఏవున్నాయో లెక్కపెట్టు. నేను చెప్పేమార్గం విను. ఆఖరుకు నీవే తీర్మానించు. ఏం... వింటావా ?

రాధ : ఊఁ.

వెంక : నాకు బాగా తెలిసినవారు ఉన్నారు ఈ వూళ్లోనే. మంచి హృదయం కలవారు. నిన్ను కూతుర్లాగ చూచుకుంటారు. అనుమానం పెట్టుకుంటే మాత్రం ఉపయోగంలేదు. దయ, పరోపకారం మనకు కావాలిగాని వృత్తితో, జాతితో ఏం అవసరం ? కాదంటావా ?

రాధ : ఎవరు వారు ?

వెంక : నాకు చాలకాలంనుంచి పరిచయం. జగన్మోహిని ఆవిడ పేరు.

రాధ : భోగంవారా ?

వెంక: అవును. అయితే నేమి ?

రాధ : సరేలెండి. బాగా ఆలోచించి చెపుతాను.

వెంక: ఇంకా చాలా సహాయముకూడా చెయ్యగలదు. (రహస్యంగా) నీవు దేనిమూలాన్ని ఇలా బయట

పడ్డావో ఆబాధకూడా తీర్చేస్తుంది. దానిదగ్గరనున్న ఔషధాలు ఇంగ్లీషు డాక్టర్లవద్దకూడా లేవు.

రాధ : (కోపంతో) అయ్యా! నమస్కారం. తమరు వెళ్లిపోవచ్చును. ఇంత నిర్భయంగా ఇంత ఘోరమైన కార్యం చెయ్యమని చెప్పగలవారు ఎంతకైనా తగుదురు. మీరు నా విషయంలో ఏమీ కలుగజేసుకోవద్దు... ...వృథాశ్రమ.

వెంక : ఊహూ! ఇంకా తెలియడంలేదు ముందువచ్చేవి... ...ఎంతకోపం వచ్చింది ... చూద్దాం కదూ......, నీవే వస్తావు చేతులు జోడిస్తూ.

రాధ : వందనాలు మీకు... వెళ్ళిపోరూ?

వెంక : బంగారువంటి శరీరం వదులు కుంటున్నావు. జగన్మోహిని నిన్ను పువ్వుల్లో పెట్టుకుంటుంది.

రాధ : (బిగ్గరగా) కామమ్మగారూ! కామమ్మగారూ!

వెంక : (తత్తరముతో) ఓసీ! (పరుగెత్తును)

రాధ : (గుమ్మమువద్దకి వచ్చిచూస్తుంది వెళ్ళిపోయాడో లేదో అని. ఆ సమయానికే సత్యనారాయణ వస్తున్నాడని గ్రహిస్తుంది. మంచంమీద మళ్ళీ కూర్చుంటుంది, పైట సద్దుకొని)

ప్రవేశం : సత్యనారాయణ. కోటుతీసి స్టాండుకు తగిలిస్తాడు.

సత్య : వెంకటేశ్వర్లుమామ ఏమిమాట్లాడాడు?

రాధ : ఏముంటుంది? ఏమీలేదు,

సత్య : అతని ముఖంచూచాను. ఏమీలేదంటే నేను నమ్మ గలనా ? ఎందుకీ దాపరికము.

రాధ : వారికి తోచిన సహాయం చేస్తానన్నారు.

సత్య : ఏమి సహాయం. జగన్మోహినికి అప్పజెపుతా నన్నాడా ?

రాధ : (పటుక్కున నవ్వుతుంది)

సత్య : తరువాత నీవు చెప్పనక్కరలేదు. అతని ముఖమే చెప్పింది. ( నవ్వు ఆపి ) దారిలో రాఘవరావుగా రింటికి వెళ్ళబోయి మానివేశాను- నీతో మొదట మాట్లాడి నీ అభిప్రాయం కనుక్కున్న వెనక వెళ్ళ వచ్చునని.

రాధ : వారితో నా కేసంబంధము లేదు... తమరు వెళ్ళ నవసరము లేదు.

సత్య : (కొంచెము సేపు ఊరకుండి) రాధా ! ఏమిచేయడానికి నిశ్చయించావు ?

రాధ : ఆ ప్రశ్నకు సమాధానం చెప్పే స్థితిలో వున్నానా నేను ?

సత్య : (హఠాత్తుగా) అయితే రాఘవరావుగారి కుమారునిపై నీ ప్రేమ నశించినదా ?

రాధ : ప్రేమనా ?... ప్రేమస్వరూపమే తెలియని రోజుల్లో నా భావాలకి అర్థ తాత్పర్యాలు లేవనుకోండి. ప్రేమస్వరూపం తెలుసుకున్నప్పుడు ప్రేమలేదని నిశ్చయించాను.

సత్య : నిజంగా ?
రాధ : అబద్ధమాడగల ధైర్యం లేదు నాకు.
సత్య : ఇప్పుడు ప్రేమస్వరూపం తెలుసుకున్నావా ?
రాధ : (సిగ్గుతో తల వంచుకుంటుంది.)
సత్య : ఏం చెయ్య నిశ్చయించానో అడగరాదూ ?
రాధ : చెప్పండి.
సత్య : (నవ్వుతూ) రాధా ... పతి కావడానికి. (నిష్క్రమణ)
రాధ : (గుమ్మమువంక చూస్తూ నిలబడుతుంది ఆనందంతో)

## రంగము — 3

### మొదటి రంగంలోని గది.

వెంకటసుబ్బయ్యగారు పచారుచేస్తూ మాట్లాడుతున్నాడు. కామేశ్వరమ్మ నిలబడి వున్నది. సుబ్బమ్మ గుమ్మం దగ్గిరగా వున్నది.

వెం-సు: ఏమిటో ! ఇంతవరకు నీ మాటలు విని శాంతించాను. ఇక అలా జరగదు ... శ్రుతి మీరిపోతూ వుంది.

సుబ్బ : నేను అప్పుడే చెప్పాను వదినెగారితో.

వెం-సు: అంతమాత్రం బుద్ధి ఉంటే గదూ.

కామే : అయ్యో ! నన్నేమి చెయ్యమంటారు. దానిస్థితి చూస్తే ఘోరంగావుంది. లోకానికి భయపడవలసిందే, కాదంటానా ? మన అబ్బాయి ...

వెం-సు: ఆ కుర్రవెధవ కేమి తెలుస్తుంది?

సుబ్బ: పసితనం కదూ, యుక్తాయుక్తాలు బోధపడుతవా మరి.

లోపలినుంచి ప్రవేశం సత్యనారాయణ.
తక్షణమే సుబ్బమ్మ నిష్క్రమణ.

సత్య: ఏమమ్మా! అలా నిలబడ్డావు?

కామే: ఏముంది నాయనా? మీ నాన్నగారు మాట్లాడుతూ వుంటే వింటున్నా.

వెం-సు: సత్యం! నీవు చేసినపని ఎంత ఖంగారు పెడుతూ వుందో నన్ను, చూశావా?

సత్య: తప్పుపని ఏంచేశాను నాన్నా?

వెం-సు: అల్లా బృహస్పతిలాగ మాట్లాడకు.

కామే: కోప్పడుతా రెందుకండీ?

వెం-సు: అప్పుడే పట్టణంలో సగంమందినోట్లో పడ్డది నా పేరు. ఇంకా ఏమితప్పుచేశామని అంగలార్చడమా? ఈ విషయం జడ్జీగారికి తెలిసిందా, ఉద్యోగానికే ముప్పొస్తుంది.

సత్య: ఏమి చెయ్యదలచుకున్నారు?

వెం-సు: ఏం చెయ్యడమని ప్రశ్నకూడానా? ఏం జేస్తాననుకున్నావు. ఇంట్లో నెత్తిమీద పెట్టుకొని పోషిస్తాననుకున్నావా? ఇల్లనుకొన్నావా? ... సత్రమనుకొన్నావా?

సత్య: అయితే.

వెం-సు: అయితే లేదు, గియితే లేదు. ఇక పది ఘడియ లుంచుకోను నాయింట్లో.

సత్య: ఎక్కడికి వెళ్ళమంటారు?

వెం-సు: ఇక్కడికి రమ్మన్నాము గనుకనా మనం? ఎక్కడికైనా వెళ్ళుతుంది. ప్రస్తుతం నా యింట్లోనుంచి వీధిలోకి వెళ్ళుతుంది..

సత్య: ఆ! అంత క్రూరంగానా?

వెం-సు: ఏమన్నావు? క్రూరమా? నీకేమి తెలుస్తుంది! జడ్జీగారి కీసంగతంతా తెలిస్తే నీకూ, నాకూ ఉద్యోగాలు పోతవి.

సత్య: ఉద్యోగాలకీ ఈ విషయానికీ ఏమి సంబంధం నాన్నా? జడ్జీగారు అంత మూర్ఖంగా వర్తిస్తారా?

వెం-సు: నీతో నేను వాదం పెట్టుకోవలసినంత కారణం లేదు. ఇది నా యిల్లు. నా ఆజ్ఞ మించి ఏదీ జరగదు. అధిక ప్రసంగం మాని నీ పనేదో నీవు చూచుకో.

కామే: అయ్యయ్యో! ఎందుకండి, అబ్బాయి నంత కసిరేస్తున్నారు.

వెం-సు: మరెందుకీ శషభిషలు. ఇప్పుడు దాన్నేమి చేయగలం?

సత్య: (నెమ్మదిగా) నేను వివాహం చేసుకొంటాను.

వెం-సు: (నిర్ఘాంతపడి) ఆ! ఆ! ఏమీ?

సత్య: అవును! నేను వివాహం చేసుకొంటాను. అప్పుడు ఏ ఆక్షేపణ ఉండదు కదా!

వెం-సు: దాన్నా ! నీవా ! మతిపోయిందా ?

సత్య : మతి ఉపయోగించే చెప్పాను.

వెం-సు: ఆ నడవడిక గలదాన్నా ?

సత్య : నేను ఆపిడ గుణగణాలు బాగా పరిశీలించాను. ఆవిడ శీలం బాధలుపడటంచేత నిర్మలమైంది. ఆవిడకు గల స్థైర్యం ఏ విచారమూ లేక మూల కూర్చున్న మన పిల్లలకన్న ఎన్నోరెట్లు ఎక్కువైనది.

వెం-సు: (ఉగ్రమూర్తియై) ఒరే! ఒరే! నా మాటకు వ్యతిరేకంగా చెప్పడం కాకుండా నాకు చదువు నేర్పేస్తున్నావుగా! నాకు దాని పాతివ్రత్యం వర్ణిస్తున్నావా ? కుర్రవాడ వని పస్తాయిస్తే వ్యవహారం మీరిపోతూ వుందే.

సత్య : కుర్రవాడయితే మాత్రం స్వబుద్ధి ఉపయోగించకూడదా ?

కామే: నాయనా, నాయనా ! నెమ్మదిగా. నాన్నగారితో అలా మాట్లాడవచ్చునా ! తప్పుగదా.

వెం-సు: మాటాడనీ. వాడు నా కొడుకుగాడు ... వెళ్ళిపొమ్మను, దానితో కలిసి... ...

అప్పుడు ప్రవేశం: రాధ—మేడమీదనుంచి దిగివచ్చింది.

రాధ : కామమ్మగారూ ! విన్నాను కొంతవరకు. ఇదిగో నమస్కారం అందరికిని. ఇంతమాత్రం సహాయం

చేసినందుకు ఇదా నేను చేసినలాభం... మీలో
మీకు దెబ్బలాటలా... సెలవు. నా మూలాన్ని
మీరెండుకు బాధపడడం...

సత్య : అమ్మా! నేను సహా వెళ్ళిపోతూ వున్నాను.

కామే: ఆఁ ఆఁ– నాయనా (చేతులు పట్టుకొంటుంది)

సత్య : అవును, లేకపోతే నేను మీ కుమారుణ్ణి గాను! ఈ
విధంగా ఈవిడను వీధిపాలు చేస్తుంటే చూచి నేను
ఊరుకుంటే సిగ్గునాది కాదు మీదే...

రాధ : మీకు నమస్కారం. వద్దు. నా బాధలు నేను పడ
తాను లెండి.

వెం–సు: ఓహో! ఎంతకు వచ్చింది! వెళ్ళు వెళ్ళు. మళ్ళీ
నా మొహం చూడవద్దు. నాకు కొడుకే లేడు! లేడు!
(తడబడుచూ నిష్క్రమిస్తాడు)

కామే: అయ్యయ్యో! ఇదేమి ఆగడం నాయనా.

సత్య : అమ్మా! నాదేమీ లేదు. ఇంతకన్నా నేనేమి
చెయ్యగలను. రాధా, ఉండు! ఇప్పుడే వచ్చేస్తాను.
(మేడమీదికి వెళ్ళును)

రాధ : (ఏడుస్తూవుంద) అమ్మా! నన్నెప్పుడయినా క్షమి
స్తారా?

కామే: నా కర్మమమ్మా నా కర్మం... నిన్నేమనగలను నీ
స్థితి చూస్తూ.

రాధ : మీతో మళ్ళీ మాట్లాడే భాగ్యం ఉంటుందో, లేదో
... (నమస్కరిస్తూ) మీరు చూపించిన దయ మరచి

పోలేను — బంగారువంటి హృదయం మీకుంటే మాత్రం ఏమి ప్రయోజనం. నా దౌర్భాగ్యం; లోకానికి వెరవవలసి వుంటుంది కదా !

కామే: అమ్మా ! నా మనసు బాగా గ్రహించావు.

పునః ప్రవేశము: సత్యనారాయణ, ప్రయాణా
నికి సిద్ధమయి. చేతిలో బట్టలపెట్టె వుంది.

సత్య : అమ్మా ! కావలసినవి కొన్నిబట్టలు తీసుకొని వెళ్తు న్నాను. తరువాత నా వస్తువులన్నీ పంపించెయ్యి ... కోపం చేసుకోకు.

కామే: నాయనా ! (ఏడుస్తూ) ఇంతేనా ! మళ్ళీ ఎప్పుడు కనబడతావు ?

సత్య : ఎప్పుడైనా ... సిద్ధంగా ... నాన్నకూ నీకూ నామీద అనుగ్రహం వచ్చిన నాటికి.

కామే: (దుఃఖంచేత మాటలురావు)

సత్య : అమ్మా ! సెలవు. (నమస్కరించి) రాధా, రా ! (రాధకూడా కామేశ్వరమ్మకు నమస్కరిస్తుంది. ఇద్దరు నిష్క్రమిస్తారు.)

కామే: (గబాగబా గుమ్మంవద్దకి వెళ్ళి చూస్తుంది. కొంత సేపటికి మళ్ళీవచ్చి కూలిపోతుంది.)

## రంగము—౪.

ప్రస్తుతం సత్యనారాయణ, రాధ కాపురం ఉన్న గృహంలో గది. మంచం, బల్ల, రెండు కుర్చీలు. వస్తువులు ఎక్కువగా లేకపోయినా శుభ్రంగా వుంది.

రాధ : (బల్లపైన కలంకారి ఖండువా పరిచి, పండ్లతో పళ్ళెము, కాఫీగిన్నెలు పెడుతూ వుంది.)

ప్రవేశము: సత్యనారాయ చాలా మారిపోయాడు. చిక్కి వాడిపోయింది ముఖం.

సత్య : (కోటుతీసి మంచంమీద పారవేసి కుర్చీపై కూర్చుంటాడు.)

రాధ : కాఫీ తెమ్మంటారా?

సత్య : ఊఁ.

రాధ : (కాఫీ తెచ్చి అందిస్తుంది.)

సత్య : (మెల్లగా త్రాగుతూ చేతిగుడ్డతో ముఖం తుడుచుకుంటున్నాడు.)

రాధ : (చిరునవ్వు బలవంతంగా తెచ్చుకొని) ఇవ్వేళ ఏమైనా ప్రయత్నం కొనసాగిందా?

సత్య : ఓ కొనసాగిసట్లే. ఏ ఆఫీసులో ఖాళీలు లేవన్నారు. కలెక్టరు ఆఫీసులో ఉందని ఒకడన్నాడు కాని వెంటనే రాఘవరావుగారి బావమరిది నన్నుచూచి లేవని చెప్పించినాడు.

రాధ : మరి కొనసాగిందన్నారు?

సత్య: ఆ సాయిబు దుకాణంలో ఇంగ్లీషు ఉత్తరాలు అవీ వ్రాయడానికి గుమాస్తాగా చేరాను. ఏదో వొకటి.

రాధ: అబ్బబ్బ! ఎంతకష్టం—నామూలాన్ని.

సత్య: (గిన్నె క్రిందపెట్టి) అదుగో! ఆమాటేకదా అనవద్దని ఎన్నిమాట్లు చెప్పాను. ఆ మాటంటే నా ఉత్సాహ మంతా నశించిపోతుంది. ఎన్ని బాధలున్నా సంతోషంగా తాలంగడపగలను కాని నీవా మాటమాత్రం అనకు.

రాధ: ఆహా! ఎంత సంతోషం అనుభవిస్తున్నారు! నా కళ్ళకు గంతలు కట్టుకొమ్మంటారా? మిమ్మి చూస్తూ నే నెలా భరించగలను? ఆ చెక్కిళ్ళు, ఎంత చిక్కిపోయాయో! ఆ కళ్ళల్లో నిరాశ, విసుగు, అలసట ఇవి తప్ప ఏమైనా కనబడుతున్నదా? ... అబ్బా! తిన్నగాచూస్తే గుండె బద్దలై పోతుంది. మూడు మాసాలుకా లేదు. ఇంతలో ఇంతస్థితికివచ్చారు.... కారణం? ... నేనుకాను ... నేను కానా ... కానని చెప్పగలరా? మీరు చెప్పినా, నమ్మగలనా?

సత్య: (కండ్లు మూసుకొని వింటున్నాడు.)

రాధ: కని పెంచి పెద్దవాణ్ణిచేసిన తలిదండ్రులపైకి మీ మనసు పోవడంలేదంటే నేను నమ్ముతానా? దారిలో దొరికినదాన్ని నామీద జాలిగొన్న మీకు వారిమీద ప్రేమ మాయమయిందంటే ఎలా నమ్మ

గలను... ఘోరపాపం చేస్తున్నాను. వా రెంత దుఃఖిస్తున్నారోగదా... అంతకూ కారణం నేనుకానా ?

సత్య : అయితే—

రాధ : నేను నాదారిని వెళ్ళిపోతాను. సృష్టించినవాడు పోషించకుండా పోతాడా ? మీవాళ్ళదగ్గరికి వెళ్ళిపోండి ఇప్పుడే... ఈ క్షణం.

సత్య : (లేచి, కొంచెం కఠినంగా) రాధా ! నే నంత మాట నిలకడలేనివాడ ననుకొంటివా ? నేను మా వారింటికి వెళ్ళ ననలేదే ! ... తప్పకుండా వెళ్తాను. అయితే నేనుమాత్రంకాదు... నీతోసహా. అంతే.

రాధ : అంత భాగ్యపు రోజులకే ఎదురుచూస్తుంటానులెండి (నిట్టూర్పు. తలుపవతలనుండి) 'ఏమండోయి!'

సత్య : ఎవరది. దుకాణంనుంచి ఏదైనా జరూరు కబురు కాబోలు (గట్టిగా) రావచ్చు.

ప్రవేశం: వెంకటసుబ్బయ్యగారి నౌఖరు.

సత్య : ఏమిరా ?

నౌఖరు: అమ్మగా రిమ్మన్నారండీ ! (జాబిస్తాడు)

సత్య : (తీసుకొని చదువుకొంటాడు. చేతులు వణుకుతూ వున్నవి) వెంటనే వస్తున్నానని చెప్పు.

నౌఖరు :చిత్తం. (నిష్క్రమణ)

సత్య : రాధా ! నాన్నగారికి చాలా జబ్బుగావుందట, అమ్మ వ్రాసి పంపింది. నన్ను చూడవలెనని అపేక్షతో వున్నారట. నేను వెళ్తాను... ఏదీ కోటు ?...

రాధ : (కోటు తెచ్చి తొడుగుతుంది.)

సత్య : మళ్ళీ వొచ్చేస్తాను ... ఇప్పుడే. (నిష్క్రమించును)

రాధ: (గుమ్మంవరకూ వెళ్ళి, మళ్ళీ వెనక కొచ్చి కిటికీలోనుంచి చూస్తుంది సత్యనారాయణ వెళ్ళడం ... తరువాత గోడకు తగిలించివున్న ఫొటో దగ్గిర నిలబడి చూస్తూ వుంటుంది. తటాలునతీసి ముద్దుపెట్టుకుంటుంది. మళ్లీ తగిలించేసి నమస్కరిస్తుంది ... అంతే ... త్వరగా తలుపుతీసుకొని బయటికి వెళ్ళిపోతుంది.)

## రంగము — ౫

## వెంకటసుబ్బయ్యగారి మేడమీదిగది.

వెంకటసుబ్బయ్య మంచంమీద పడుకున్నాడు. కామేశ్వరమ్మ ప్రక్కన నిలబడి వుంది.

వెం-సు: ఒసే! వచ్చాడా ?

కామే : వస్తాడండీ. ఇప్పుడేగదూ నౌఖరు వచ్చాడు.

వెం-సు: వస్తాడో; లేదో !

కామే : మందు పుచ్చుకుంటారా ?

వెం-సు: ఎందుకే ఆ చేదునీళ్లు ... ఇది మనోవ్యాధి ... దీనికే మందూ లేదు.

కామే : అయితే యిక తగ్గిపోతుందన్నమాట.

వెం-సు: మళ్ళీవస్తాడా వాడు ? మళ్ళీ మనయింట్లోవుంటాడా? వాణ్ణి ఎంత బాధపెట్టాను ... ఎంతఅన్యాయంచేశాను.

కామే: నేనప్పుడే ఎరుగుదును. తరువాత నీరు పశ్చాత్తాప పడతారని...

వెం-సు: ఎందుకు చెప్పలేదు మరి?

కామే: ఇప్పుడడుగుతారు గాని అప్పుడు నామాట ఎవరు పాటించేవారు? ఆడదాన్ని.

వెం-సు: మగవారి బుద్ధి ఇలా వెలుగుతూవున్నది గనుక.

కామే: పాపం చాలా చిక్కిపోయాట్టండి. నౌకరు చెప్పాడు.

వెం-సు: కాదూ మరి. నన్నెంత దూషించాడో కదా.

కామే: అబ్బా! అలాటివాడు కాడండి.

వెం-సు: అవును, అందుకే నాకు మరీచింత. దూషించేవాడైతే ఇంత బాధపడకేపోదును.

కామే: ఇప్పుడు వచ్చినప్పుడు ఏమి చెప్పదలచుకున్నారు?

వెం-సు: ఇంకా అడుగుతా వెందుకు?

కామే: నిజంగా? ... అమ్మోయి! నాకు కోడలుకూడా వస్తుంది. చేతికందిన కోడలుకూడాను. రాధ నా నేస్తం కూతురు-ఎరుగుదురా?

వెం-సు: తొందరపడకు.

కామే: (మెట్లమీద చప్పుడువిని) అదుగో! (గుమ్మంవద్దకి వెళ్ళుతుంది.)

ప్రవేశం: సత్యనారాయణ.

సత్య: అమ్మా! (చేతులు గట్టిగాపట్టుకొని) నాన్న కెలావుంది?

కామే: అదుగో చూడు. నీకోసం కలవరిస్తున్నారు.

వెం-సు: (లేచి కూర్చున్నాడు)

సత్య : (సమీపంగా వెళ్ళి తలవంచుకొని నిలుచుంటాడు.)

వెం-సు: నాయనా ! నన్ను క్షమించావా ?

సత్య : అయ్యయ్యో ! ఏంతమాటన్నారు ! నన్ను మీరు ఏరోజు క్షమిస్తారో అని కాచుకున్నప్పుడు — నేనా క్షమించడం ?

వెం-సు: నీవు తప్పు చెయ్యలేదే. ఎందుకని క్షమించను ?

సత్య : ఇంతభాగ్యం కలుగుతుందని అనుకోలేదు.

వెం-సు: నాయనా ! నీవు అనుభవించకపోతే ఎందుకు మాకీ భాగ్యం.

కామే: వాడికిమాత్రం తెలియనటండి !

వెం-సు: ఇవ్వేళే వచ్చెయ్యాలి సుమా.

సత్య : (పలకడు)

వెం-సు: ఏమీ ? ఏమి చిక్కు ?

సత్య : నాన్నా ! నన్నర్థం చేసుకోలేదేమో... బాగా...

వెం-సు: (చిరునవ్వుతో) లేదు నాయనా. పూర్తిగా అర్థం చేసుకున్నాం.

సత్య : (వారి అభిప్రాయం స్ఫురిస్తుంది) నిజంగా ?

వెం-సు: సందేహం కూడానా... అంతమాత్రం నన్నర్థం చేసుకోలేకపోయావా ?

సత్య : (సంతోషంతో) ఇంతదయకు పాత్రుణ్ణి కానేమో!... మరి లోకమ్మో ?

వెం-సు: లోకంకన్నా, నా'సత్యం' ఎక్కువని కనుక్కున్నాను.

కామే: వెళ్ళిరానివ్వండి... ఆలస్య మెందుకు ?

వెం-సు: త్వరగావస్తారు కనూ!

సత్య : తక్షణం... అమ్మా! వెళతాను. (నిష్క్రమణ)

వెంకటసుబ్బయ్య, కామేశ్వరమ్మ కొంచెంవరకు మాట్లాడరు.

వెం-సు: ఏమి టాలోచిస్తున్నావు. కోడలికి ఏం సొమ్ములు చేయిస్తా మనా?

కామే: సరేలెద్దురు. మీకు మాత్రం సంతోషంగా లేదా? మొత్తగా వున్నానని వేళాకోళం చేస్తారు.

వెం-సు: అబ్బా! పాడుపడినట్టుండేది మనయిల్లు.

కామే: మనమేగా చేసుకొన్నది. మీ చెల్లెలిమాటవిన్నారే గానీ నామాట విన్నారా? ఆవిడకు మంచిపరాభవమే అయిందిలెండి. విన్నారా... ఊరంతా అల్లుకుంది.

వెం-సు: ఏమి జరిగింది?

కామే: సుభద్ర కిరస్తానంలో కలసిపోయిందట.

వెం-సు: ఆ! ఆ!

కామే: కలిసిపోయి మద్రాసు వెళ్ళిపోయిందనికూడా వదంతి.

వెం-సు: ఎందుచేత?

కామే: ఆవిడ నడవడిక ఏమీ బాగుండేది కాదండీ మన యింట్లో వున్నప్పుడే...ఇక్కడనుంచి వెళ్ళాక మరీ ఎక్కువయిందట. మనవాళ్ళదగ్గర ఇక పరువు నిలవ దనుకొన్నది గాబోలు...

వెం-సు: సుబ్బికి పాపం అంత్యకాలానికి ఎంతదుఃఖం!

కామే: లక్షణంగా ఎవడికో ఒకడికి — ఆ ఆలమూరివారి అబ్బాయికే అనుకోండి —ఇచ్చి వివాహంచేసివుంటే సవ్యంగా వుండిపోయేది కథా!

వెం-సు: ఓహో! సంఘ సంస్కర్తవై పోతున్నావే!

కామే: అవును మరి కాలాలు మారిపోతూవుంటే ధర్మాలు మారవద్దూ? కానీ, ఎక్కడ మారనిస్తారు? ... ... చంపేస్తారు విరుద్ధంగా నడుచుకుంటే.

వెం-సు: ఏమిటే? ఇంకా రాలేదు అబ్బాయి.

కామే: అవునండీ... బస్సులో బండిదొరికింది కాదేమో .. లేదు. అదుగో వచ్చాడు.

వెం-సు: (విని) అబ్బే కాదు. వెంకటేశం వస్తున్నాడు.

వెంకటేశ్వర్లు: (ప్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా! ఎంత ఘోరం జరిగిందో విన్నావా?

కామే: (తొట్రుపాటుతో) ఏమిట్రా!

వెంక: రాధ (సంకోచంతో) మన అబ్బాయి... ...

కామే: ఔను... ఏమైంది రాధ... ...?

వెంక: బజారుదగ్గిర దిగుడుబావిలో పడి చచ్చిపోయింది.

వెంకటసుబ్బయ్య, కామేశ్వరమ్మ 'హా! హా!' అంటారు.

బైటికి లాగేశారు. మన సత్యం అక్కడే ఉన్నాడు. బండికట్టించుకొని ఇక్కడికే వస్తాడనుకుంటా. ఘోరం కదూ... మంచిపిల్ల సుమా... అబ్బాయి పిచ్చెక్కినట్లు అయిపోయాడు.

వెం-సు: (తల రెండు చేతుల్తో పట్టుకొని) రామ రామ! (మెల్లగా తలగడపై, అనుకుంటాడు కూలిపోయి)

కామే: (నడుము విరిగిపోయింది. దుఃఖాతిశయంచేత కళ్ళల్లో నీళ్ళు లేవు. కూర్చుంది కుప్పలాగ)

హఠాత్తుగా ప్రవేశం:- సత్యనారాయణ.

సత్య : (గుమ్మంలో నిలబడి) అమ్మా! (ముఖంలో నెత్తురు చుక్క లేదు. చూపుల్లో ఒక వెర్రి నిశ్చలత్వం వుంది)

కామే: (గద్గద స్వరంతో) నాయనా!

సత్య : అమ్మా! కోడల్ని తీసుకొని వచ్చానమ్మా. అయితే తానే స్వయంగా వచ్చి నీకు నమస్కారం చేయగల స్థితిలో లేదమ్మా!

కామే: తెలుసు నాయనా. ఇలా రా!

సత్య : (ఇక భరించలేక ఉరవడితో వచ్చి ఒడిలో తల దాచుకొని ఏడుస్తున్నాడు.)

కామే: (తల నిమురుతూ) నాయనా! పిచ్చినాయనా! మనం వున్నలోకం సంగతి నీవు ఎరగలేదు సుమా... ఈలోకం ఒక పెద్ద బోనువంటిది. దాని కమ్ములు వాడికత్తులు...... బాగా పదును పెట్టిన కత్తులు నాయనా... బలవంతంగా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే ఏమవుతుంది...... చేతులూ కాళ్లూ కోసుకు పోతవి... దేహం రక్తంతో తడిసిపోతుంది... అంతే, తప్పించుకొనిమాత్రం పోలేము.... మనకు మిగిలేది బాధే!...... (అంటూ కళ్ళు మూసుకుంటుంది. కన్నీళ్ళు ధారలుగా కారిపోతూవున్నవి.)

---

## పాత్రలు :

| | | |
|---|---|---|
| అచ్యుతరామయ్య | ... | |
| లక్ష్మీకాంతమ్మ | ... | అతనికూతురు |
| చలపతిరావు | ... | అతని అల్లుడు |
| సుధ | ... | అతని తమ్ముడికూతురు |
| రంగయ్య | ... | లక్ష్మీకాంతమ్మ పేరమాను |

# దెయ్యాల లంక

## రంగము—౧

రాజమహేంద్రవరంలో కంబంవారి వీధిలో అచ్యుతరామయ్య పంతులుగారి ఇంట్లో గది. పడకటిల్లు కాదు గాని ఒకమూల మంచంవుంది. కుర్చీలు, అద్దం స్టాండుతో పనసచెక్కల మేజా.

లక్ష్మీకాంతమ్మ పంతులుగారి కూతురు. కూర్చుని తల చిక్కు తీసుకుంటోంది, తీసుకోనడానికి అట్టే జుత్తు లేకపోయినా. కొంచెం పొట్టిగా లావుగా వుంటుంది. వయస్సు 25, 26.

లక్ష్మీకాంతమ్మ: అబ్బ! ఏమి జుత్తమ్మా!... కాఫీ పుచ్చు కుంటేనేగాని లొంగదు........అమ్మయ్యో! ఎంత ప్రొద్దెక్కింది... (ఆవలిస్తూ) పాడునిద్ర, ఆయనగారు ఇప్పుడు వచ్చారా ఏదో మాటంటారు. మనస్సు చివుక్కుమని పోతుంది. మా సుధనిపిలుస్తా... ఒసే! ఒసే!... పలకదూ!... ఒసే సుధా!...

ప్రవేశం: సుధ. బుద్ధి తెలియకముందే వివాహం, వైధవ్యం రెండూ సంభవించాయి. సన్నగా నాజూకుగా వుంటుంది. అంత పొడగరీ కాదు, పొట్టీ కాదు. మంచి తలకట్టు. జడ పొడుగ్గా వ్రేళ్ళాడుతుంది. అయితే చమురులేదు. పువ్వులు పెట్టుకుంది. చెంగు చెంగుమని లేడిలాగా పరుగెడుతూ ప్రవేశిస్తుంది.

సుధ: ఏమిటే? ఏమైంది... తెల్లవారిందని చెప్పడానికాఏం...

లక్ష్మి: ఛీ, ఊరుకో. ఎప్పుడూ పరాచికమే (సుధలో వ్యక్త మవుతూవున్న కళ కండ్లకు, తట్టింది ... చురుగ్గా) ... అహాఁ పెంకిపిల్లలాగ తయారయ్యావు.

సుధ: (నవ్వుచు) మరేఁ, పెంకిపిల్ల గాకపోతే పెద్ద ముత్త యిద వనుకొన్నావా ... పోనీ! ఎందుకు పిల్చావు?

లక్ష్మి: మీకేం ఈవూళ్లో మీరేమీ పుచ్చుకోరు, నాకల్లా కాదబ్బా. కాఫీ లేకపోతే పిచ్చెక్కినట్టుంటుంది.

సుధ: (మాట్లాడకుండా కిటికీలోనుంచి చూస్తూ నిలబడు తుంది.)

లక్ష్మి: వినబళ్ళే ?

సుధ: ఆఁ విన్నా ... రేపు కాఫీడబ్బా దాచేసిచూస్తా. పిచ్చెక్కితే ఎలా వుంటుందో చూడాలని సరదాగా వుంది - అక్కయ్యా !

లక్ష్మి: (కొట్టబోతుంది–వేళాకోళంగానే)

సుధ: (తప్పించుకొని గంతులేస్తుంది)

లక్ష్మి: (తల్లో పువ్వులుచూచి) ఒసే! ఈ అన్యాయం ఏమిటే? ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?

సుధ: ఏమనుకుంటారు? అదిన్నీ పాపమేనా?

లక్ష్మి: అవును. అసలల్లా జుత్తు వుంచుకోవడమే తప్పు. చిన్నదానవేలని నాన్న జాలిపడి తీసేయించలేదు... పైగా పువ్వులుకూడానా!

సుధ : అబ్బ! ఎందుకే నన్ను బాధపెడతావు. నాకు పువ్వులంటే ఇష్టం... పోనీ ఎవరు చూస్తారే? ఇంట్లో నాన్నా, నువ్వూ, మామయ్య—బావయ్య.

లక్ష్మి: (ఎందుకో తటాలున) తీసేస్తావా, లేదా?

సుధ : ఎందుకే? నీవు పువ్వులు పెట్టుకోడానికి తగినంత జుత్తు లేదని వుడికిల్తున్నావేమో.

లక్ష్మి: ఆం (అని గర్జించి, జడ పట్టుకొని బలవంతంగా పువ్వులులాగి క్రింద పడేస్తుంది.)

సుధ : అయ్యో అక్కయ్యా! (వొంగి పువ్వు లేరుకొంటుంది.

ప్రవేశం: లక్ష్మీకాంతంభర్త, చలపతిరావు. పొడుగ్గా అందంగా వుంటాడు. కళ్లల్లో లాలిత్యం, తేజస్సు రెండూ వున్నాయి.

చలపతిరావు: (నవ్వుతూ) పొద్దున్నే బంతులాట్లా!... ... కాంతం! నువ్వుపడేసి చెల్లెల్ని తీసియ్యమంటున్నావా?

సుధ : (పువ్వులు తీసుకొని) పువ్వులు నావేలెండి... ... . (కళ్ళనిండా నీళ్ళున్నాయని గ్రహించుకొని తల తిప్పేస్తూ) అక్కయ్యా! వెళ్ళి కాఫీ పట్టుకొస్తా. (నిష్క్రమిస్తుంది.)

చల : (ఏదో రహస్యం వుందని కనిపెట్టి) కాంతం! ఏమి జరిగింది... మీ చెల్లెలి నేమన్నా అన్నావా?

లక్ష్మి: దాన్ని చెల్లెలు చెల్లెలంటారేమిటి... ... నా రక్తం పంచుకొని పుట్టిందా?

చల : అలా వాగకు. ఏం జరిగింది?

లక్ష్మి: ఏదో జరిగింది. ఆడవాళ్ళగోల మీకెందుకూ?

8

చల : చెప్తావా; లేకపోతే నేనేవెళ్ళి కనుక్కుంటాను.

లక్ష్మి: అబబ్బ !...ఎటు వెళ్ళినా నాకేనా... ఏమీ లేదు లెండి చెప్తాను. అది తలనిండా పువ్వులు పెట్టుకొచ్చింది. తీసేయమంటే తీసిందిగాదు. పెంకిగా మాట్లాడింది. కోపంవచ్చి నేనే తీసేశాను.

చల : ఆఁ ఆఁ—ఎంతపని చేశావు ? పెట్టుకొంటేమాత్రం తప్పేవిఁటి ?

లక్ష్మి: బాగానేవుంది. వెధవముండకి పువ్వులేమిటండీ... తరవాత వెధవముండకి మొగుడుంటే మాత్రం తప్పేమంటారు గాజోలు !

చల : ఛీ నోరుముయ్యి... అవునుగాని వెధవముండ వెధవ ముండా అని చులకనగా మాట్లాడుతున్నావు. నేచస్తే నువ్వేమవుతావో తెలుసునా ? ఆ వెధవముండవే.

లక్ష్మి: (చెవులు మూసుకొంటూ) రామ రామ.

చల : వినగూడందని శాస్త్ర వినేసినాక కృష్ణా రామా అంటే మాత్రం పాపం పరిహార మవుతుందా!

పునః ప్రవేశం : సుధ, కాఫీ కప్పుతో.

సుధ : అక్కయ్యా ! కాఫీ !

లక్ష్మి: (తీసుకొని గబగబా త్రాగుతుంది.)

చల : మీ అక్కయ్య దుడుకుగా పువ్వులు కింద పారేసిందటే. పోనీ వేరే పెట్టుకొనరాదూ ?

సుధ : (సిగ్గుతో వూరుకుంటుంది.)

చల : మీ అక్కయ్య చాదస్తపు మనిషి. ఇంకా పూర్వా చారాలపై మమత పోలే... అంచేతనే అంత కఠినంగా ప్రవర్తించింది.

సుధ : (విరగబడి నవ్వుతుంది.)

చల : ఎందుకూ అలా నవ్వుతున్నావు ?

సుధ : అబ్బెబ్బె !... అక్కయ్య కెందుకోపమొచ్చిందో గ్రహించా. నవ్వొచ్చింది.

చల : ఏదీ చెప్పూ, వింటాను.

సుధ : తనకు (నవ్వుచు) పువ్వులు బాగా పెట్టుకోవడానికి తగినంతజుత్తు (నవ్వుచు)...

చల : (పకపకా నవ్వుచు) అదా రహస్యం ?

లక్ష్మి: (ఉగ్రంగా) సుధా! వెళ్లిపో, సిగ్గూ మానం లేకుండా మొగవాళ్ళతో సరసాలు కూడానా ?

సుధ : (చురచురా చూస్తుంది.)

చల : కాంతం ! ఎందుకలా మనసు నొప్పిస్తావు ! ఛీ- వేళా కోళానికి బొత్తిగా మనిషివికావు. ఇక్కడ పరాయి వాళ్ళెవ రున్నారు ?

లక్ష్మి: చాల్చాలు లెండి. మీరుసహా సహాయానికొచ్చారా. మరీ ఎగిరిపడుతుంది.

సుధ : (కాఫీ కప్పుపుచ్చుకొని వెళ్ళిపోతుంది.)

చల : (సగం విచారంతో సగం నవ్వుతో) కాంతం ! ఆడ వాళ్ళ హృదయం నారికేళపాకం లాంటిదంటే అర్థ మయ్యేదికాదు. బుఱ్ఱమీద కొబ్బరికాయ కొట్టితే

ఎంత స్వారస్యంగా వుంటుందో అలా వుంటుందన్న మాట. ఏం...?

లక్ష్మి: అవును లెండి. నన్నొ త్తిపాడవడమే మీకు సరదాగాని నేనెంత బాధపడతానో గ్రహిస్తారా? నాజన్మం, నాఖర్మం... (ఏడవడానికి మొదలుపెట్టుతుంది.)

చల : ఓసి దీనికే నీళ్ళకుండకు చిల్లి!—చూడు! ... బోటు షికారు ఏర్పాటు చేస్తామని ఎంతో కులాసాగా వచ్చానే... కాంతం! ఇదో చూడు.

లక్ష్మి: (గొణుగుతూ) సుధని కష్టపెట్టానని నాపైని మీకు అసహ్యంగా లేదూ?

చల : ఛీ, ఛీ - నాకుమాత్రం తెలియదూ, నీకు సుధంటే అభిమానమని. పోనిద్దూ. పిలువు సుధని బోటు షికారు వస్తుందేమో!

లక్ష్మి: (అంత ఉత్సాహం కనబర్చదు.)

చల : ఇదేకాదూ!

లక్ష్మి: ఆఁ పిలుస్తా... సుధా! సుధా! ...... అది రాదు దాని కోపం వచ్చింది.

చల: కోపంలేదూ, గీపంలేదూ... నే పిలుస్తాచూడు. (లక్ష్మి కాంతం అడ్డం వస్తూవున్నా) సుధా! (గుమ్మం దగ్గరకెళ్ళి.)

సుధ : (లోపల్నించి ఆఁ అంటూ ప్రవేశించి) నిజంగా మీరు పిల్చారా!

చల : ఏమీ పిలవకూడదో.

సుధ : (పలకదు.)

చల : అందరమూ రేపు బోటుషికారు వెళ్ళాలని అనుకు న్నాము. మీ అక్కయ్య వస్తుంది... నిన్నుకూడా రమ్మనమని నన్నడగమన్నది.

లక్ష్మి: (ఏమో చెప్పబోతోంది.)

చల : (అపవారిస్తూ) అబ్బ! సరేలెద్దూ...

సుధ : (అలాచూస్తూ నిలబడుతుంది.)

చల : ఇష్టమేనా ?

సుధ : (తల పంకించి అంగీకారం చూపిస్తూ, పరధ్యానంగా) బోటు సర్రుమని వెడుతూంటే గోదావరి హృద యాన్ని చీల్చేసుకొని పోతూతున్నట్టుంటుంది కదూ.. అయితే వెంటనే ఒక్క మరకైనా కనపడదు. ఎన్ని దెబ్బలైనా తన కెరటాలతో కప్పేసుకుంటుంది. ఏమంటారు ?

చల : (కనుబొమ్మలు ముడిపడ్డవి—మెల్లగా) నువ్వొక కవి వమ్మా...

సుధ : (తటాలున మారిపోయి చేతులు తట్టుచూ) దారిలో లంకలొస్తాయి గావూ ...... మంచి పుచ్చకాయలు కోసుకొని తినవచ్చునుగదూ ... ... పుచ్చకాయ దొంగంటే బుజాలు చూచుకొన్నాట్ట ? మా అక్కయ్య కప్పుడే నోరూరుగుతుంది.

లక్ష్మి: అబ్బే! నాకసలు పుచ్చకాయలంటే ఇష్టంలేదు. నాకు పడదుకూడానూ.

చల : పోనీలెద్దూ... వద్దంటే నిన్నెవరు బలవంతం చేస్తారు? ఐతే మనం ముగ్గురం... మీ నాన్నగారూ.

సుధ : (నవ్వుతూ) మామయ్యో?

చల : అవును మరిచిపోయా...

సుధ : నేను పట్టుకొస్తా... (వెళ్ళుతుంది.)

చల : ఏమి చిత్రంగా మారిపోతుంది.

లక్ష్మి: అయితే నిజంగా నన్ను రమ్మంటారా?

చల : ఇంతవరకూ మాటాడుకున్న తెలుగుముక్కల్ని సంస్కృతంలో తర్జుమాచేసి చెప్పాలా?

లక్ష్మి: సరే మీరు రమ్మంటున్నారు గనుక వస్తున్నా.

చల : మళ్ళీ అదేవిటీ, అలాగైతే ఉండిపో.

లక్ష్మి: అదుగో చూచారా నేను రానన్నదే చాలు మీకు.

చల : (నవ్వుచు) నువ్వు బారిష్టరు కావలసినదానవు. ఇప్పుడైనా వేళ మీరిపోలే.

లక్ష్మి: రమ్మంటారా, వద్దంటారా ఒక్కమాట చెప్పండి.

చల : రా, రా, రా, సరేనా ఒకటిగాదు, మూడుసార్లు.

ప్రవేశం: సుధ రంగయ్యమామతో.

సుధ : (నవ్వుచు) మా... మా... మామయ్య రాట్ట. భయమట. బోటు తిరగబడితే మునిగిపోతాట్ట ... మళ్ళీ తేలినా వుపయోగం లేదట...

రంగయ్య: (ఒకమాత్రం నత్తి) ఆఁ ఆఁ ఆఁ ... నేనలా... అన్నానా? క... క... కల్పించి చెప్తోంది. బో... బో ...బోటు షికారు ఒక్కొక్కప్పుడు అపాయకరం గదూ... పె... పె...పెద్దవాణ్ని గనక అనుభవం జాస్తి ఏ... ఏ... ఏమంటావమ్మా?

లక్ష్మి: అవును మామయ్యా.

సుధ : (నవ్వుతూ) పోనీ మీ యిద్దరి నడుంచుట్టూ పెద్ద మోటారు టైర్లు కట్టేస్తాం. అప్పుడు మునిగిపోరు. (చలపతి వంకజూచి) కాదండీ.

చల : (నవ్వబోయి ఆపుకొని) మామయ్యగారూ! అలాంటి భయమేమీ వుండదు. ఉన్నా నాకు బాగా ఈత వచ్చును. బోటువాళ్ళుంటారు. మీరుంటే సరదాగా ఉంటుంది.

రంగ : అబ్బెబ్బె? నే రానన్నానా ... నే రానన్నానా...: పె.. పె...పెంకిపిల్ల అలా చెప్పింది. చి ..చి...చిన్న వాళ్ళు మీరందరూ వెళుతుంటే కా...కా....కాటికి కాళ్ళు చాచుకున్న నాకు భయమా.....ఎప్పుడూ ప్రయాణం?

చల : రేపే.

రంగ : ఆ (యోచిస్తూ) రేపా, రోజు బాగుందా?

చల : బోటుషికారుకి ముహూర్తం కూడానా?

సుధ : మామయ్యకు మంచి పుణ్యదినంనాడు మునిగి పోవాలని....మోక్షం వస్తుందేమోనని

రంగ : నో....నోరు మూసుకో లేవూ.

సుధ : (నవ్వుచు) రేపు ములిగిపోతాంగదాఅని ఇవ్వేళే కరువుదీరా మాట్లాడేదామనిబుద్ధి పుడుతోంది.

చల : సుధా! ఊరుకో.

సుధ : (చప్పున నవ్వు ఆపేస్తుంది.)

లక్ష్మి: ఇక మాటలు చాలవూ. రా, స్నానం చేసొద్దాం.

రంగ : సెలవండీ, (చల. తప్ప అందరూ నిష్క్రమిస్తారు.)

చల : (ఆవులించి, ఇటూ అటూ చూస్తే, దృష్టి బల్లపైన వుండే మేఘసందేశం కాపీ పైన పడుతుంది. కుర్చీ మీద కూర్చుని పుస్తకంతీసి) మేఘసందేశం చదివే వారెవరు (అని మొదటి పేజీ చూచి) సుధనా! అరే! (మెల్లగా) మన్దం మన్దం నుదతి పవనశ్చాను కూలం యథాత్వాం.

ప్రవేశం : సుధ.

చల : ఏం కావాలి సుధా?

సుధ : అక్కయ్య సబ్బుపెట్టె పట్టుకురమ్మన్నది. (చల. చేతిలోని పుస్తకంచూచి చూడనట్టు నటిస్తుంది.)

చల : సుధా! నీదేనా ఈ పుస్తకం?

సుధ : నాదే.

చల : సంస్కృతం బాగావచ్చునా?

సుధ : ఏదో కొద్దిగానే లెండి.

చల : మేఘసందేశం చాలా బాగుంటుంది కదూ?

సుధ : (జవాబివ్వదు)

చల : బాగుండదూ ?

సుధ : నన్నెందుకడుగుతారు ! మీకు తెలియదూ ?

చల : నీ అభిప్రాయాన్నికోసరం. కాళిదాసు యక్షుని విరహావస్థ అద్భుతంగా వర్ణించాడుకదూ ...

సుధ : అంటే నాకేం తెలుస్తుంది ?

చల : (తటాలున పుస్తకం పడేసి) ఎంత ఫూల్‌ను నేను !

సుధ : (నవ్వుపెట్టి పుచ్చుకొని వెళ్ళిపోతుంది.)

చల : (చూస్తూ కూర్చుంటాడు, ఏదో యోచిస్తూ)

## రంగం — 2

గోదావరిమధ్య లంకల్లో వకటి. సాయంత్రమైపోయింది.
రంగం నడవనూ నడవనూ చీకటి పడుతుంది.

ప్రవేశం: పడవ వాళ్ళిద్దరు.

1-వ వాడు: చచ్చాన్రా బాబూ ! నారాయుడు కూర్చొన్నవ తారమెత్తి బూదేవిని మోశాట్ట... ఏమోన్నశాడో ఈ యమ్మని మోశి చూస్తే తెలిసేది.

2-వ వాడు: నీ బాద నీది. నాది నాది. ఆ అయ్యోర్ని లాక్కొచ్చే టప్పటికి నా పానాలు పోయాయి.

1-వ వాడు: (తలగుడ్డలోంచి చుట్టముక్క తీసి వెలిగించి) ఛా ! ఏం బ్యామ్మదేవుడ్రా.

2-వ వాడు: (తనూ చుట్ట కాలుచేస్తూ) ఏం ?

1-వ వాడు: ఆ చిన్నయ్యకీ ఈయమ్మకీ రాత్రాడా బుద్ధి లేకుండా. ఆ చిన్నయ్యకీ చిన్నమ్మకీ కలిపేవాణ్ణి నేనైతే...

2-వ వాడు: ఎంకయ్యా బ్బ్యమ్మ దేవుడికి బుద్ధుంటే మనం ఇలా ఎందు కుంటామురా.

1-వ వాడు: ఒరే, మన బాగోతం సాలురా. అరుగో అయ్యోరూ అమ్మోరూ వోణుక్కుంటూ వస్తున్నార్రా... పద... చిన్న మంటేద్దాం... రా.

ఇద్దరూ కలిసి మంట రాజేస్తారు.

అప్పుడు తడిసీ సగమారిన బట్టల్లో వోణుక్కుంటూ ప్రవేశిస్తారు అచ్యుతరామయ్యపంతులూ, లక్ష్మీకాంతమూ. చేసుకున్న పై తళుకు లన్నీపోయి సహజ వికారాకారంతో ప్రత్యక్షమవుతుంది కాంతం.

పంతులు: అమ్మాయీ ! రా కాస్సేపు కాచుకో.

లక్ష్మి: ఏం కాచుకోవడం నాన్నా. ఆకలితో కడుపు తరుక్కుపోతుంది... (అంటూ మంటదగ్గిర చేర్తుంది.)

పంతులు: వెధవ బోటు షికారు. మా అల్లుడిదంతా ఇలాటి చేష్టలే.

లక్ష్మి: ఎక్కడా, వాడు కనబడ లేదు.

పంతులు: ఆఁ ఏమౌతారు ? చూచాంగా మనం, మనకన్న ముందరే గట్టు చేరారుగా ఆయనా సుధాన్నూ.

లక్ష్మి: సుధ మరిన్నీ మగరాయుడిలాగ విరగబడిపోతోంది కదూ నాన్నా.

పంతులు: పోనీ పాపం దాని జన్మలో సుఖమెక్కడిది. ఇలా సరదాగా కాలం గడపనీ.

లక్ష్మి: (గొణుక్కుంటూ) బాగా చెప్పావు.

పంతులు: (కొంచెం కాచుకున్న తరువాత) ఒరే! ఇఖ ఈ రాత్రి కిక్కణ్ణేనా మఖాం.

1-వ వాడు: మరేనండి.

పంతులు: ఈ లంకను పేరేవిట్రా.

2-వ వాడు: ఏదో బాబూ ఏక్కైతే నేం.

పంతులు: ఇంతేనట్రా.

2-వ వాడు: తెలవక్కాదు బాబూ, అమ్మగారు భయపడతారేమోనండి.

లక్ష్మి: (ఉలికిపడుతుంది)

పంతులు: ఛీ చెప్పు.

2-వ వాడు: దెయ్యాల్లంకండి.

లక్ష్మి: బాబోయ్! (కేక)

2-వ వాడు: నా చెప్పలేదండీ!

పంతులు: శాంతం! ఏవిటది. పేరుకే భయం?

లక్ష్మి: వింతలేందే ఆవలింతైనా పుట్టదు; ఒరే ఎందుకురా ఆ పే రొచ్చింది దీనికి.

పంతులు: ఛీ! ఊరుకోండ్రా ... వెళ్ళిపోండి ... తినడానికి ఏవైనా ఫలాలు ఉంటే పట్టుకురండి.

1-వ వాడు: ఈ లంకలో ఏ వ్వుంటాయండి.

పంతులు: అయితే ఉపవాసమే! ... వెళ్ళండి.

పడవవాళ్ళు నిష్క్రమిస్తారు

లక్ష్మి: మీ దగ్గిర డబ్బులవీ ఏమీ లేవుగద. నాన్నా: వీళ్ళు కావలిస్తే బోటు ముంచేసి మనల్ని దోచుకొని చంపేస్తారేమో!

పంతులు: (కొంచెం మెత్తపడినా) అబ్బబ్బ! నీ కెక్కడి సందేహాలూ వస్తవి? ఆక లెక్కువద్యోకొద్ది బుద్ధి తక్కువౌతుంది నీకు.

లక్ష్మి: (గొణుగుతూ) మీరుకూడా అంటారా నాన్నా?

పంతులు: ఉత్తినే అన్నానమ్మా... నీకు ధైర్యం చెప్పాలని.

లక్ష్మి: (చీకట్లో రెండు నీడలు చూచి పంతులు భుజం పట్టుకొని) నాన్నోయ్! (అని కేక వేస్తుంది.)

పంతులు: ఏమిటే?

లక్ష్మి: (రహస్యంగా) చూడూ! చూడూ! (నీడలు చూపించి) దెయ్యాలు.

పంతులు: (సందిగ్ధంగా చూస్తుంటాడు)

ప్రవేశం: చలపతిరావు, సుధ. చలపతిరావు వొంటిమీద కండువా తప్పితే ఏమిలేదు. సహజ దేహసౌందర్యం ప్రస్ఫుటంగా వెలుగుతోంది. సుధ తలవెండ్రుకలు ముడివీడి విరబోసుకొని వున్నవి... లావణ్యం వొలుకుతోంది. ఇద్దరి చేతుల్లో పుచ్చకాయలు.

సుధ: అదుగో అక్కయ్య, బాబయ్య!

పంతులు: (కొంచెం గుండెకొట్టుకోవడం ఆగింది) అమ్మయ్య! ఒసే కాంతం. చూడు—మనవాళ్ళే.

లక్ష్మి: (తేరిచూచి) ఎక్కడే సుధా? భయంవేయలే. చీకట్లో అలా తిరగడానికి... ఈ లంక ఏం లంకను కున్నావు?

సుధ: ఆ – కనుక్కున్నాం, దెయ్యాల్లంక.

లక్ష్మి: నీకెక్కడ భయం, నువ్వొక. దెయ్యానివిమల్లే వుంటేను...ఆకలి కూడా కావడంలే?

సుధ: ఆకలా! కడుపునిండా పుచ్చకాయలు తిని తిని వెగటు పుడుతోంటే. అడుగు బావయ్యని.

చల: అవును మామయ్యా మీకోసం తెచ్చాంకూడానూ రెండుకాయలు.

పంతులు: (పుచ్చుకొని) కాంతం ఆకల్తో చస్తుంది. పాపం! (ఇవ్వబోతుంటే)

సుధ: అబ్బే! లాభంలేదు. కాంతానికి పుచ్చకాయ లస లిష్టంలేదు. అందులో పడవు కూడానూ—(నవ్వు తోంది)

లక్ష్మి: (కోపంతో సుధను తినేస్తామా అని చూస్తో: ఆక లవడంచేత పుచ్చకాయని తినేస్తోంది)

సుధ: (చల. వంక చూచుచు) క్షుదాతురాణాం నరుచి ర్నపక్వం. (మళ్ళీ నవ్వు)

చల: (మెచ్చుకుంటూ సుధవంక చూస్తున్నాడు.)

సుధ: (చప్పున నవ్వు మానేస్తుంది. లోపల్నుంచి 'హుఁ హుఁ హుఁ' అని శబ్దం వింటుంది.)

లక్ష్మి: అమ్మయ్యో? (పెద్దకేక)

ప్రవేశం: రంగయ్య మామ. వికృతాకా
రంగా, వొణుకుతూ, హుఁ హుఁ అంటూ.

లక్ష్మి: నాన్నా! నాన్నా! (కళ్ళు గట్టిగా మూసేసుకొని పంతుల్ని గట్టిగా పట్టుకుంటుంది.)

పంతులు: (ఖంగారుపడి చూస్తున్నాడు)

సుధ : (విరగబడి నవ్వుతోంది)

పంతులు: అబ్బాయి !

రంగ : (మంట దగ్గరికి చేర్తాడు)

చల : ఎవడో మనలాగే వచ్చివుంటాడు లెండి.

సుధ : (మరీ నవ్వుతూ) మా—మా—మామయ్యా !

రంగ : (అదిరిపడి లేచి) ఆఁ ఆఁ ఆఁ (నలుదిక్కులు చూచి) ఓరి ! మీరట్రా... మీరందరూ గో... గో... గోదావర్లోనే మునిగిపోయారనుకున్నా.

పంతులు: (ధైర్యమొచ్చిం దిక) బావా! నువ్వా... కాంతం! మామయ్యే... మన రంగయ్య మామ.

లక్ష్మి: (కండ్లు తెరచి తొంగిచూస్తోంది.)

సుధ : (మళ్ళీ నవ్వు)

లక్ష్మి: అలా నవ్వేదానవు అప్పుడే చెప్పకూడదమా ?

సుధ : నన్ను చెప్పని_స్తేనా... మామయ్యా ! అదేమిటి అల్లా తయ్యారయ్యారు ?... (నవ్వు)

రంగ : సీ... సీ—సీ రోగం ఇంకా కుదర్లే... (చాలావరకు వొణుకు తగ్గింది) అబ్బాయ్ !... తి... తి... తినడాని కేమైనా దొరుకుతుందా...

సుధ : పుచ్చకాయలు. కావలసినంత ఇసికె మధ్యే మధ్యే గోదావరీ పానం సమర్పయామి...

చల : (పుచ్చకాయ ఇస్తాడు)

రంగ : (చాల తొందరగా తినేస్తున్నాడు)

సుధ : (నవ్వుతూ చలపతితో) అదో! ఆచారా బాబయ్య అప్పుడే కునికిపాట్లు పడుతూవున్నారు...

పంతులు: (మెళకువొచ్చి) అమ్మాయీ! కాంతం! నిద్ర రావడం లే?

లక్ష్మి: (ఆవులిస్తూ) నా కాళ్ళు లాగుతున్నాయి. పడుకుంటేనా, తీస్తుందేమోనుందిగాని ఎక్కడ, పడుకోవటం.

సుధ : ఒంటి స్తంభం మేడలో హంసతూలికా తల్పాలపైన ఒయ్యారంగా...

లక్ష్మి: నీకేదో దయ్యమో భూతమో పూనిందా? ఏం అలా మిడిసిపడిపోతున్నావ్?

సుధ : పూనితే నువ్వే పూనాలి (నవ్వుతూ) దెయ్యంలాగే వున్నావు చూస్తే.

చల : (చిరునవ్వు అపుకుంటాడు)

పంతులు: (లక్ష్మీకాంతానికి కోపం వచ్చిందని ఎరిగి) సుధా! అక్కయ్యనలా అనడం సబబుగా వుందా? చిన్నతనమైనా ఒక హద్దుండవద్దూ!

సుధ : (మౌనం)

లక్ష్మి: అయితే నాన్నా, ఇక్కడే పడుకుంటా., తలకింద చెయ్యెట్టుకొని (పడుకోటానికి సర్దుకుంటోంది.)

సుధ : (చల. చెయ్యిపట్టుకొని బిగ్గరగా గంతు వేస్తున్నట్టు) అదిగో, అదిగో, చూచారా!

లక్ష్మి: (అదిరిపడి) అమ్మోయి!

పంతులు: సుధా ! ఏవిటది ?

సుధ : అదో చూచారా చంద్రోదయం ! ఎంత అందంగా వుందో, (అట్టే చూస్తూ నిలబడిపోతుంది.)

చల : (చంద్రోదయాన్ని చూచి, వెంటనే సుధయొక్క వికసించిన ముఖచంద్రుణ్ణి చూస్తున్నాడు.)

పంతులు: (కొంచెం కోపంగా) సుధా ! అవతలికెళ్ళు. మరిన్నీ వెంకితనం ఎక్కువై పోతుంది. ఒళ్ళు తెలియడం లేదూ ?

సుధ : (మనస్సు చివుక్కుమన్నది ) ఏం తప్పుచేశాను బాబయ్యా ! (మెల్లగా వెనకబడుతోంది)

పంతులు: పడుకోవమ్మా కాంతం పడుకో.. భయంలేదు. అబ్బాయీ ! ఎక్కడికీ వెళ్ళకు. (రహస్యంగా) కాంతం వొంటిమీద సరుకులూ అవీ ఉన్నాయి.

చల : ఈ దిబ్బలో దొంగ లెవరుంటారు లెండి. అయినా నే నిక్కడే వుంటాను. మీరు పడుకోండి.

పంతులు: ఆఁ– అదే నేనూ అనబోయా. (ఆవలిస్తూ) ముసిలి వాణ్ణికదూ ...

లక్ష్మి: (పడుకుంటోంది)

రంగ : (అప్పుడే గుర కెడుతున్నాడు.)

చల : (రాతిపై కూర్చుని చంద్రుణ్ని చూస్తూ తటాలున సుధకోసం ఇటూ అటూ చూస్తాడు. సుధ కనబల్లేదు.

పంతులు: (పడుకుని కళ్ళుమూశాడు.)

చల : (లేచి చూస్తున్నాడు సుధకోసరం చుట్టూనూ.) లేదెక్కడా... ...ఉస్సురని మళ్ళీ ఆ రాయిపైనే కూర్చుని వచ్చిన ఆవులింతను ఆపుచు, కూనిరాగం మొదలుతీసి, తరవాత శ్లోకం చదవడం ప్రారంభిస్తాడు)

స్వచ్ఛాంగీ నవమార్జనా దసిలతే వోల్లాసితా స్వాత్మనా
జ్యోత్స్నాంపూర విపాండరాంబరధరా రాత్రిర్యథాశారదీ
బిభ్రాణా తరపల్లవేన కబరీ మార్ద్రాళిమియం దృశ్యతే
శ్రీశృంగారసుధాపయోధి సలిలా దభ్యుత్థితే వాపరా

మళ్ళీ చంద్రుడివంకే చూస్తూ, ఏవో స్మృతికివచ్చిన
ట్లభినయించి ఇంకొక శ్లోకం చదువుచున్నాడు.

నక్షత్రేశ త్వదుదరగతం చిహ్న మేకే వటద్రుం
భాష న్తేన్యే శశక మపరే కోమలాంగం చమూరమ్
మన్యే కాంతాధరదళపిధా వగ్రహీత్ కుక్షిసంస్థం
కర్పూరయామం తవ విధి రహో జాలమాసీత్ తదేతి

ఈ శ్లోకం చదువుతూవుండగా వెనకనుంచి సుధ ప్రవేశించి, ఇటూ అటూ చూస్తోంది — అందరూ నిద్రలో మునిగి వున్నారని ... తలనిండా రకరకాల పువ్వులు — పేరు,

ప్రతిష్ట లేనివి — ఏవేవో ఉన్నాయి — చేతినిండా
పూలే — మందహాసంతో వింటూ వుంది శ్లోకం.

సుధ : (శ్లోకం ముగించగానే) శహబాష్ ! ఏం చక్కగా పాడారు.

చల : (గబుక్కున లేచి) సుధా ! నువ్వా ! ఎక్కడ మాయ మయ్యావ్ ? ఎక్కణ్నించి వచ్చావ్ ?

సుధ : (మెల్లగా నవ్వుతో) చీకట్లో మాయమయ్యా. వెన్నెల్లో నుంచి మళ్ళీవచ్చా... ఏమిటల్లా చూస్తున్నారు ?

చల : ఆ పూలు! నీ జుత్తనే ఆకాశంనిండా ఎలా చల్లేశావు నక్షత్రాలు.

సుధ : గాయకులూ కవులూన్ను మెచ్చుకున్నందుకు అభినందించొద్దూ మరి. (అని చేతుల్లోవున్న పువ్వులు పైకి చల్లుతుంది.)

చల : (పులకరిస్తూ) సుధా ! చంద్రునికి సుధాకరుడనే పేరు యెందుకొచ్చిందో తెలిసింది.

సుధ : (సిగ్గుతో) అయ్యో ! హాయిగా కూచుని పాడుకొంటూంటే పానకంలో పుడకలాగ అడ్డంవచ్చాను. కూచోండి.

చల : కూచోమంటే కూచుంటానా. చేసిన అపరాధానికి ప్రతిక్రియ చేస్తేగాని...

సుధ : (నవ్వుచు) ఏం చెయ్యమంటారు ?

చల : నువ్వూ పాడు ఒక శ్లోకం - మేఘ సందేశంలో దే నీ కిష్టంగదూ !

సుధ : నాకిష్టమని చెప్పనా...అసలు పాడ్డంకూడా చేత గాదు...నా కెవ్వరు నేర్పుతారు?

చల : అయితే కూర్చోను...అమ్మా! టక్కరివి...పాడ్డం చేతగాకూ నీకు ... నే వినలేదనుకున్నావా ... నీ కొకరు నేర్పాలా ఏమిటి...కోవిలకు పాడ్డం ఎవరు నేర్పుతారు.

సుధ : ఎవరా? నే చెప్పనా? మీకీ మాట లెవరు నేర్పారో వారు...పోనీలెద్దురూ, నా పాటెందుకిప్పుడు.

చల : వింటే మనవాళ్ళేమైనా అనుకుంటారని భయమా?

సుధ : భయమా? ఏమీలేదు. ఈ లంకమీద నాకేమీ భయంలేదు. ఎవ్వరన్నా భయంలేదు ... అదో ప్రపంచం, ఇదో ప్రపంచం.

చల : (కొంచెం మృదువుగా) సుధా! పాడవూ?

సుధ : (కరిగిపోయి) అబ్బా! పాడతాలెండి.

పాడుతూ కళ్ళుమూసుకొంటుంది. కళ్ళు తెరచేటప్పటికి చల. తనదగ్గిర నిలబడి వుంటాడు...కళ్లూ కళ్లూ కలిశాయి. సుధ తల తిప్పేస్తుంది.

చల : ఎందుకలా కళ్ళు తిప్పేశావు?

సుధ : (పలకదు)

చల : సుధా! రా! కూచుందాం ఈరాయిమైన ఇద్దరమూ.

అని చెయ్యి పట్టుకుంటాడు.

సుధ : (మొదట విడిపించుకోపోయి, మళ్ళీ మానేస్తుంది.)

చల : ఏం చేత — మొదట ఇష్టం లేకపోయిందా?

సుధ : నన్ను మీరడక్కండి... ఈ ప్రపంచంలో నాయిష్టం వచ్చినట్లు చేస్తాను. నన్నెవ్వరూ కారణాలడగ నవసరం లేదు. అడిగినా చెప్పను...ఏం, నిలబడి పోయారు. కూచుండా మన్నారే!

ఇద్దరూ కూచుంటారు.

చల : (తల్లో పువ్వులుచూస్తూ) నీకుపువ్వులంటే ఎంతిష్టం! మీ అక్కయ్య నిన్న తీసి పారేసిందట కదూ... పాపం!

సుధ : పూర్లో కాబట్టి సరిపోయింది ... అదే ఇక్కడై యుంటేనా!

చల : (చిరునవ్వుతో) ఏం చేసుందువు?

సుధ : ఈ లెంపా ఆ లెంపా వాయించుందును.

చల : నిజంగా?

సుధ : ఆఁ – నిజంగా?...

చల : (నవ్వుచూ) అయితే మీ అక్కయ్యని లేపుతా... (లేపబోతూ)

సుధ : (చెయ్యిపట్టుకొని ఆపేస్తూ) అబ్బబ్బ!

చల : (వేళాకోళంగా) డబ్బు కేనా.

సుధ : (దీనంగా) ఇంతేనా? మీకుకూడా అర్థంకా లేదా..? (మొహం చేతుల్తో కప్పేసుకుంటుంది.)

చల : (యదార్థం స్ఫురిస్తుంది. చప్పున లేచి సుధ భుజాల మీద చేతులుంచుతూ) సుధా ... ఎంతమోటుగా

ప్రవర్తించాను. క్షమిస్తావుగదూ ... (మెల్లగా చేతులు మొహంమీదనుంచి తీసేస్తూ) చూడు ... సుధా. నన్ను చూచి చెప్పూ క్షమించానని ...

సుధ : (మెల్లగా తల ఎత్తిచూచి చిరునవ్వుతో) కూచోండి.

చల : (కూర్చుని) సుధా! చూచావూ! వెన్నెల ఎలా వుందో. పాలసముద్రం అని మనవారు వర్ణించేది ఇంకెక్కడో వైకుంఠంలో వుందని నేన్నమ్మను ... ఇప్పుడు మనం క్షీరాబ్ధిలో తేలడంలేదూ ?

సుధ : (కళ్ళు మూసుకొని అవాచ్యానంద మనుభవిస్తుంది.)

చల : సుధా! ఏమిటలా ఆలోచిస్తున్నావు ?

సుధ : (కళ్ళు తెరుస్తూ) అబ్బ! ఈరాత్రి ఇలాగే వుండిపో కూడదూ! ఇలాగే లంకలో వుండిపోతే ?

చల : (చిన్న నవ్వుతో) నిజంగా... మళ్ళీ వూర్లోకి పోవాలని ఇష్టముండదూ ?

సుధ : నిజంగా నాకుండదు.

చల : సుధా! మేలుకొనే కలవరిస్తున్నావు.

సుధ : నేనా! నేనా కలవరించడం — బాగా చెప్పారు. మీరు కలవరిస్తున్నారు—వూరో—వూరోఅంటూ.

చల : ఎందుకూ నీకు వూరంటే అంతవైరం ?

సుధ : వూరులో అందరూ దెయ్యాలు ... ఈ దెయ్యాల్లంకే నాకు ఆనందంగావుంది నా ... (అర్ధోక్తిలోఆపేస్తుంది.)

చల : ఎంత క్రూరం! అలా కత్తిరించేశావు.

సుధ : లేదు——చెప్పేస్తాను... నాకు నచ్చిన వక్కర్తో ఇంత కాలం గడపడానికి అవకాశం ఇచ్చింది కదా ఈ దెయ్యాల్లంక..

చల : సుధా ! ఆ అదృష్టవంతుడు నేనేనా.

సుధ : అలా అనకండి. అదృష్టం నాదీ...

చల : (చెయ్యి తన చేత్లో పట్టుకొని) సుధా !

సుధ : (చల. కళ్లల్లో తనచూపులు లీనమైపోతూవున్నాయి.)

చల : (సమీపించి ముద్దుపెట్టుకోవడానికి సూచిస్తున్నాడు.)

సుధ : (వారించి) వద్దు ... వద్దు ... నన్నొక్కక్షణంలో చంపేయకండి.

చల : చూచావా. ఇంతకుముందు నీకిష్టం వచ్చింది చేస్తానన్నావు.

సుధ : (తల వొంచుకుంటుంది.)

చల : (గడ్డం పట్టుకొని ముద్దు పెట్టుకుంటున్నాడు.)

సుధ : (తప్పించుకొని) వద్దు ... ఇక వద్దు ... మిమ్మల్ని వేడుకొంటాను.

చల : ఏమో ?

సుధ : అప్పుడు మనం ఇక్కడే వుండిపోవాలి. మళ్ళీ ఆ దెయ్యాల వూళ్లోకి పోతే ఎలా బతకడం!

చల : సుధా ! చిత్రంగా మాట్లాడుతావు...

సుధ : మీా కర్థంకాదులెండి ... ఎందుకీ గొడవ. అదుగో చూడండి – ఎలా నవ్వుతున్నాడో చంద్రుడు.

చల : ఎంత సుంద్రంగా వున్నాడో మనం సంతోషాన్ని చూచి కడుపుబ్బిపోతున్నట్టుంది గాపూ?

సుధ : అవునుగాని వకప్రశ్నండీ ... చంద్రమండలం వక గోళమనికదూ శాస్త్రజ్ఞులంటూను? దాన్ని మనవాళ్లు మగవాణ్ణి చేశారెందుకో?

చల : ఇంగ్లీషువాళ్ళు మొదలయిన పాశ్చాత్యులు ఆడ దాన్ని చేశారు.

సుధ : (నవ్వుతోంది)

చల : ఎందుకూ నవ్వు?

సుధ : మన మొగవాళ్ళూ వాళ్ళ ఆడవాళ్ళూ సమాను లేమో అని స్ఫురించింది. (నవ్వుచు)

చల : నాకూ స్ఫురించింది.

సుధ : ఏమిటి?

చల : వక్రోక్తి కవిత్వానికి 'ఎలా జీవనమైందో.

సుధ : అబ్బ! అలంకారశాస్త్రాలెందుకో ఇప్పుడు...

చల : సాక్షాత్తు రసానుభవం గ్రహించలేనట్టి వెధవను గనక ...

సుధ : అల్లా అనకండి. బాబూ నమస్కారం. ఆ మాటలే వద్దు... అసలు మీరు మాట్లాడకండి. నేనే పిచ్చ దానిలాగ వాగుతాను... ...చూచారా, చూచారా! గోదావరి ఎలా పొంగుతూవుందో ... ...చంద్రుణ్ణి చూచా? చంద్రుడేమాత్రాడో గోదావరికి... అయ్యో

ఎంత వెఱ్ఱిప్రశ్న అడిగాను... సముద్రానికి చంద్రుడు కొడుకన్నావూ... అయితే గోదావరికికూడా కొడుకే అవుతాడన్నమాట. ఏం... అంతేనాండీ?

చల : (కొంచెం కునికిపాట్లు పడుతున్నాడు.)

సుధ : (చివుక్కు-మన్నది ఎందుకో) పాపం! నిద్దరొస్తుందా!

చల : (ఆవలిస్తూ) అబ్బే! బద్ధకంగావుంది... ...అలిసి పోయాంకాదూ...

సుధ : అవును దుర్మార్గంగా మిమ్మల్ని నిద్రపోకుండా ఆటంకపరచాను. పడుకోండి.

చల : నువ్వో?

సుధ : నామాటెందుకూ, నాకు నిద్దరావటం లేదు.

చల : ఒంటరిగానా వుంటావు... భయం వెయ్యదూ?

సుధ : అబ్బ! ఎన్నిసార్లు చెప్పను నాకీచోట్లో భయం వెయ్యదని—నాకు భయం వూళ్ళోకి వెళ్ళినప్పుడు – పడుకోండి... అదుగో అక్కడ గడ్డి మెత్తగావుంది.

చల : (ఆవలిస్తూ) అయితే చల్లగా వకపాటపాడు. ఆనందంగా పడుకొంటాను.

సుధ : అంతకన్నానా.

చల : (క్రింద పడుకుంటాడు.)

సుధ : (ఆనందంతో. దేహమంతా స్పందిస్తూవుంది. మృదువుగా జాలుగా పాడుతుంది...)

చలపతిరావుకి అప్పుడే నిద్రపట్టింది.

సుధ : (పాట మెల్లగా ఆపి చూస్తోంది) అబ్బా! అప్పుడే నిద్ర...

ఏం తోచిందో ఎవరు చెప్పగలరు? లేచి నిల్చుంటుంది...దూరముగా చూస్తోంది...మళ్ళీ చల వంక చూచి, కూర్చుని, చప్పుడు చెయ్యకుండా, ఒక చిన్న ముద్దు పెట్టుకుంది...అంతే పరిగెట్టి పోతుంది.

తెరతీసేటప్పటికి తెల్లవారుతుంది. అందరూ నిద్రపోతూ వున్నారు.

చల : (మేలుకొని) అప్పుడే తెల్లవారింది...ఎలా వచ్చింది నిద్ర...సముద్రంలాగ ముంచేసింది ... (లేచి ఇటు నటు చూచి) ఏదీ సుధ...(గట్టిగా) సుధా! సుధా! ... ఎక్కడికో అప్పుడే వెళ్ళింది ... ఏమిటిది ... గుండె ఇలా కొట్టుకొంటోంది ... సుధా! (నిమ్కి) మించును. కొంత సేపటికి మళ్ళీ ప్రవేశించి) ఎక్కడా కనబళ్ళేదు... (కాంతం, మామగారు, పడుకున్నది చూచి) ఎలా పడుకున్నారో మొద్దుల్లాగ. (లేపుతూ) కాంతం! కాంతం!

లక్ష్మి: (అదిరిపడి లేచి) అమ్మయ్యో!

చల : ఛీ, నేనే...లెగు...లెగు...

లక్ష్మి: ఎవరూ?

చల : సుధ ఎక్కడా కనబడదు...నీతో ఏమైనా చెప్పి వెళ్ళిందా?

లక్ష్మి: బాగా అడిగారు...మీరు నవ్వుతూ పేలుతూవుంటే గదూ నే న్నిద్దరోయాను. నన్నడుగుతారేమిటి? అసలది ఇక్కడ పడుకుంధా?

చల : ఆఁ... (స్మృతి) ఏమో !

లక్ష్మి: ఏమిఁటలా పరాగ్గా నిలబడ్డారు... దానికేం భయమా భీతా... తిరుగుతూ వుంటుంది-ఎక్కడో.

పంతులు: (లేచి వింటూన్నాడు) ఎవరూ ?

చల : మన సుధండీ కనబడ్డంలేదు.

పంతులు: ఆఁ నిజంగా.

చల : అవును బోటువాళ్ళని బాగా వెతకమని చెప్పి వచ్చాను.

పంతులు: ఇక్కడే పడుకో లేదూ ?

చల : పడుకున్నది మాత్రం నేను చూడలేదు. అర్ధరాత్రి వరకూ ఏవో మాట్లాడుకుంటూ, పద్యాలు పాడుకుంటూ గడిపాము... తరవాత వాళ్లు తెలియకుండా నిద్దరొచ్చేసింది... అంతే - ఉదయాన్నే మెలకువ.

లక్ష్మి (మామయ్యని లేపుతూ) మామయ్యా, మామయ్యా!

రంగ : (లేస్తున్నాడు.)

లక్ష్మి: సుధ కనబడ్డం లేదట ... అల్లాడిపోతూ వున్నారు. మీరైనా వెతికి తీసుకురండి ... పాపం.

రంగ : అమ్మా ! అమ్మా !... కూ... కూ... కూతురేమై పోయిందో... మొ... మొ... మొసళ్లుగనా.

లక్ష్మి: మొసళ్ళూ లేవు... తిమింగిలాలూ లేవు.

చల : అదుగో... బోటువాళ్ళలా వస్తున్నారు ... ఏమిఁటిది చేతులూ కాళ్లూ వొణుకుతున్నాయి.

ప్రవేశం: పడవవాళ్ళు దిగులుమొహాల్తో.

1-వ వాడు: (2-వ వాడితో) చెప్పరా.

2-వ వాడు: అబ్బబ్బా! నువ్వే చెప్పరాదట్రా.

చల: ఏమిరా... ఏమి... ఆ గుసగుసలేవిటి? చిన్నమ్మగారి జాడ ఏమైనా దొరికిందా?

1-వ వాడు: బాబుగారూ! ఎలా సెప్పమండి... ఆ గోరం.

చల: (తబ్బిబ్బుతో) అంటే! ఏమైంది?

2-వ వాడు: గోదారి తల్లి కడుపులో పెట్టుకుందండీ!

చల: ఆఁ ... (మొదట నిర్ఘాంతపోయాడు ... తెప్పరిల్లి తరవాత అర్థం చేసుకుంటున్నాడు.)

రంగ: పంతులు: ఆఁ ఆఁ ఆఁ...

లక్ష్మి: (గుండె బాదుకుంటూ) అయ్యో! అయ్యో! నే నప్పుడే చెప్పలే నాన్నా... ఈ పాడులంక బలి తీసుకుంది... దెయ్యాలు హతం చేసేశాయి!...

చల: (కఠినంగా) ఛీ! నోరుముయ్యి! దెయ్యాలా? ఎవరూ దెయ్యాలు?... (పడవవాళ్లతో) నడవండిరా నడవండి.

మొదట పడవవాళ్ళు, తరవాత చలపతిరావు, ఆ వెనక పంతులు, కాంతం, మామయ్య నిష్క్రమిస్తారు ... మామయ్య మాత్రం కళ్ళనీళ్ళు తుడుచుకుంటున్నాడు.

---

## పాత్రలు:

| | | |
|---|---|---|
| యాకూబ్ : | ... | |
| మార్తా : | ... | యాకూబ్ భార్య |
| జుబేదా : | ... | దాది |

---

# కఠినమార్గం

## కాలం : ఏసుక్రీస్తు జీవించి ఉన్న రోజులు

ఇండియాలో యాకూబ్ సౌధం. మేడగదిలో యాకూబ్, అతని భార్య మార్తా. యాకూబ్ చాలా ధనవంతుడు. ఆగర్భ శ్రీమంతుడు, యౌవనం దాటనివాడు, చిన్న గడ్డం, విశాలమైన నుదురు, కోటేర్చిన ముక్కు, పెద్ద కళ్ళు, నోరూ, పెదవులూ, ఇంద్రియ లోలత్వాం సూచిస్తవి. మార్తా అందగత్తె యని అంటారు అందరు. ఏ ఒక్క అవయవమూ అంతగా బాగుండకపోయినా, చేష్టల్లో, మాటల్లో, చూపుల్లో లాలిత్యం వుంది.

మార్తా కిటికీనుంచి తొంగిచూస్తోంది. యాకూబ్ మంచంమీద కూర్చున్నాడు.

యాకూబ్ : ఏమిటా కలకలం ?

మార్తా: ఏమిజనం! ఏమిజనం! కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, వాళ్ళ వెంబడి వాళ్ళ బంధువులు, రోగంతో బాధపడే పిల్లల్ని భుజాలమీద వేసుకొని వెళ్లే ఆడవాళ్లు, ఒక్కక్షణం ఆగకుండా వెళ్ళిపోతున్నారు. ఏ పండగనాడూ చూడలేదు ఇటువంటి జనసమ్మర్దం.

యా : ఆయన దగ్గరికేనా ?

మార్తా: మరి ? అయ్యో, చూడండి నాముసలిదాది జుబేదా కూడా పది సంవత్సరాలుగా మానలేదు దాని రణం. ఎలా వెర్రిగా పోతూవుందో ?

యా : ఏమిటీ మాయ!

మార్తా: (కిటికీనుంచి మంచం దగ్గిరకు వచ్చి) భగవంతుని మాయ. ఇంకేం ఉంటుంది?

యూ : నేనూ చాలా విన్నాను. మొదట నమ్మకం లేక పోయింది గాని ఆయనకీర్తి రోజురోజుకూ ఎక్కువై పోతూంది. మొన్న గలిలిలో ఆయనచేసిన మహాత్కార్యం కళ్ళారాచూచిన నాస్నేహితుడే చెప్పాడు.

మార్తా: ఏమది?

యూ : ఎలియాస్ ఎరగవూ. అతనికొడుకు వట్టి పిచ్చివాడు.

మార్తా: అవును, పాపం. ఎప్పుడూ కట్టేసి వుంచుతారు. ఒక్కక్షణం అజాగ్రత్తగావుంటే వెర్రిగా ఎగురుతూ పోయి ఏ బావిలోనో, గోతిలోనో పడిపొయ్యేవాడు.

యూ : కొడుకుని తీసుకువెళ్ళారట; ఏమైన ఉపయోగం ఉంటుందేమోనని. ఆయన కొండమీద ఎక్కడో ప్రార్థించడానికి వెళ్ళినాడని విని, పోనీ ఆయన శిష్యులకు ఆ ఒకమాత్రం శక్తి ఉండదా అని, వారిదగ్గరికి పోయి చెప్పుకున్నాడు, విషయమంతా. వాళ్ళలో ఇద్దరు ముగ్గురు అనుమానిస్తూ ప్రయత్నించి చూస్తామంటూ దగ్గిరకువస్తే, కుర్రవాడు కరవబోయాడు. భయంవేసి వారు 'మావల్లకాదు నాయనా' అని మొఖం వేలవేశారు.

మార్తా: అందిరికీ ఉంటాయా అలాటి శక్తులు.

యూకూ: ఎలియాస్ ఆయన వచ్చేవరకూ ఉండి, ఆయన రావటంతో కాళ్ళమీద పడ్డాడు. ఆయన చాలా

దయతో లేవనెత్తి, ఎందుకన్నట్లు సూచించగానే జరిగిందంతా చెప్పుకున్నాడట. ఆయన భంగపడి 'అయ్యో, ఇంకా ఎన్నాళ్లకి కలుగుతుంది విశ్వాసం? నే నింకా ఎన్నాళ్ళుంటాననుమీతో' అని అడిగాడు. కొడుకుని తీసుకొనివచ్చి, ఎదురుగా నిలబెట్టగానే ఆయన ఏదో మంత్రించాడు. అంతే – ఎక్కడపిచ్చి అక్కడ పారిపోయి, నిక్షేపంలాగ అయ్యాడు కుర్ర వాడు. శిష్యులు సిగ్గుపడిపోయి, 'స్వామీ, మాచేత కాలే దెందుకో' అన్నారుట. ఆయన అన్నాడట– కఠినంగా 'ఊరికే రాదు తపోబలం' అని. ఆశ్చ ర్యంగా ఉందికదూ. అయితే అంతా నిజం. చూచిన వాళ్ళే చెప్పారు.

మార్తా: మహాత్ముడే నిజంగా. కానీ, 'నేనింకా ఎన్నా ళ్ళుంటా'నని ఎందుకన్నాడో కదా. అందులో ఏదో రహస్యం ఉందా?

యాకూ: నీ కెప్పుడూ వింతఊహలే. ఏదో విసుగుతో అని ఉంటాడు.

మార్తా: మీరు అలాగే అనండి; నాకుమాత్రం ఏదో విశే షార్థం ఉందనే నమ్మకం. ఆయన ఇట్టేకాలం ఈ లోకంలో ఉండడేమోనండి, అలాటి వాళ్ళకి భవి ష్యత్తుకూడా తెలుస్తుంది కరతలామలకంగా...

(కొంత సేపు మౌనంగా ఉండి హఠాత్తుగా)
ఏమండీ!

యాకూ: ఆc. ఇంకేనో ఊహ పుట్టుకొచ్చిందా? చెప్పు.

మార్తా: ఆయన్ని మీరొకసారి చూచి రారాదండీ?

యాకూ: (పలకడు)

మార్తా: ఇందులో తప్పేమి ఉందండి!

యాకూ: ఊరికే చూచివస్తే ఏమిలాభం. ఏంతా, వినో దమా? ఉత్సవానికి వచ్చిన జనసమూహాన్ని నోరు తెరుచుకొని చూచే పల్లెటూరివారి మోస్తరు చూచి రానా?

మార్తా: వద్దు. ఆయన దగ్గరికి వెళ్ళి మాట్లాడి రండి.

యాకూ: నా వ్యర్థపు మాటలతో ఆయన్ని విసిగించనా. ఆయన చేసే మహాత్కార్యాలకు అంతరాయం కలి గించమంటావా?

మార్తా: ఆయన అలా అనుకోడు. చిన్న బిడ్డల్ని కూడా చేర దీస్తారటండీ. ఆతని సౌలభ్యాన్ని పొగడనివారు లేరు.

యాకూ: ఏమడగను?

మార్తా: దైవానుగ్రహంవల్ల మనకు సిరిసంపద లోటులేదు. పరమార్థం ప్రాప్తించే మార్గం ఉపదేశించమని ప్రార్థించండి.

యూకూ: (కొంచెం ఆలోచించి) అబ్బా! (ప్రేమతో మార్తా తల నొక్కుచు) ఈ బుర్రలో ఎంత తెలివి వుంది !

మార్తా: భయం వేస్తూ వుందండీ. వెళ్ళి వచ్చాక మెచ్చుకోండి.

యూకూ: భయ మెందుకు? నే నే పాపమూ చెయ్యలేదు. ఆయన ఏమి ఉపదేశించినా అది చెయ్యడానికి నాకేమి అభ్యంతరం ఉంటుంది? తప్పక చేస్తాను.

మార్తా: ఆయనకి మీరు శిష్యులైతే మీతో నేను శిష్యురాలనవుతానులెండి.

యూకూ: ఒంటరిగా ఉంటావా?

మార్తా: ఫరవాలేదు. కిటికీనుంచి వీధిలోకి చూస్తూంటే ఎంత కాలమైనా గడిచిపోతూ వుంటుంది.

యూకూ: సరే, వెళ్తాను. (నిష్క్రమణ) (మార్తా కిటికీనుంచి చూస్తోంటుంది భర్త వెళ్ళడం; ఇతరులు రావడం; పోవడం. ఇంతలో ఆ గుంపులో దాది జుబేదా కన బడుతుంది. మామూలుగా కష్టం లేకుండా నడిచి వస్తోంది) జుబేదా! (బిగ్గరగా) జుబేదా, పైకిరా, రా! రా! అబ్బ? ఏమి ఆశ్చర్యం.

జుబేదా ప్రవేశిస్తుంది. 60 ఏండ్లు దాటిన ముసలి దాది. ముఖములో సంతోషం, ఆవేశం, ఆశ్చర్యం తాండవిస్తూ వున్నాయి.

జుబే : అమ్మగారు! అమ్మగారు! నన్ను రక్షించారండి ఆయన. ఈ జన్మలో నాకు మానదనుకున్నాను కదండీ రణం. అంతా ఆరిపోయింది. చూడండి! (కాలు చూపిస్తుంది.) ఒక మచ్చ తప్ప ఇంకేమీ లేదు—మాయగా వుందికదూ అమ్మగారు. కాదు, కాదు. ఆయన దయ, ఆయన మహాత్మ్యం.

మార్తా: (కండ్లలో నీళ్ళు తిరుగుతున్నవి) చెప్పు, జుబేదా, చెప్పు. ఏమి జరిగింది ? ఎలా జరిగింది ?

జుబే : నేనీ రణంతో ఎంతబాధ పడ్డానో మీకు తెలియదండీ. ఎందరు హకీములదగ్గర మందు తిన్నాను. ఎంత ఖర్చుపెట్టాను. ఆవగింజంత లాభం లేకపోయింది. ప్రాణంపిసిగి ఇంతే నా కర్మ అనుకున్నాను. మొన్నాయన కథలన్నీ విన్నాను. పదిమంది చెప్పుకుంటూవుంటే, ఏమిటో తక్షణమే పిచ్చినమ్మకం కలిగింది. ఎలాగైనా ఆయన నా బాధ తీరుస్తాడు ... అని—అంతే ... బయలుదేరాను.

మార్తా: నేను చూచాను జుబేదా నీవు వెళ్ళడం. తదేకధ్యానంతో నీవు వెళ్ళటం చూచి వెర్రెత్తిందేమో అనికూడా అనుకొన్నాను.

జూబే : అలాగేనమ్మా, నా మనస్సులో ఒక్కటే భావం. వెళ్ళి ఆయన్ని ముట్టుకున్నా చాలు, నా రోగం కుదిరి పోతుంది అని.

మార్తా: ఎంత వెర్రినమ్మకం ?

జూబే : నమ్మకమంతా వెర్రేకదమ్మా ?

మార్తా: మాట్లాశాను, ఆఁ, తరవాత ఏం జరిగింది?

జూబే : అలా, ఒకటే ధ్యానంతో వెళ్ళాను. వెళ్ళేటప్పటికి ఆయన్ని మన దేవాలయం ధర్మకర్తో ఎవరో పెద్ద మనిషి తన ఇంటికి పిలుచుకెళ్ళుతున్నట్లు చెప్పు కొన్నారు. దూరంగా కనబడింది ఆయన వీపు, తల. నాకూ ఆయనకూ మధ్య వరదలు. గుండె జారిపో యింది. ఆయన్ని ఎదుర్కొని వేడుకోవడం నావంటి దానికి వీలుగాని పని. పోనీ, ఆయన వస్త్రమైనా ముట్టితే చాలు, అనుకుని దీనంగా 'బాబూ, దారి తియ్యండి బాబూ' అని అడుక్కొంటూ, ఆయన దగ్గిరకి వెళ్ళడానికి ప్రయత్నం చేశాను.

మార్తా: పాపం !

జూబే : నాపుణ్యమనమ్మా. అలా ఈడుకునివచ్చి, తీరా సమీపించేటప్పటికి, ఆయన ముందు వెళ్ళడానికి ధైర్యం చాల్లేదు. చెయ్యిచాచి ఆయన ఉత్తరీ యాన్ని ముట్టుకొని ఆ చెయ్యి నాకళ్ళ కద్దు

కున్నాను. ఒళ్ళు ఝల్లుమంది. చెమటలు పోసి నాయి. గుండె గబగబా కొట్టుకుంది. రణంవల్ల ఎప్పుడూ పోటుపెట్టుతూ వుండేది. ఆపోటు మాయ మైంది. బ్రతికా ననుకున్నా.

మార్తా: ఆశ్చర్య మాశ్చర్యం!

జుబే: ఇంకావుంది నా కథ. వినాలి మరి. అలా నేను ముట్టుకున్నా, క్షణంలో ఆయన ఇటూ అటూచూచి అడిగారు 'ఎవరు నా వస్త్రం ముట్టినవారు?' అని. ఆయన శిష్యుల్లో ఒకడన్నాడు: 'స్వామీ, ఈ జన సమ్మర్దం మిమ్మల్ని చుట్టుకోవటం చూస్తూ, ఇందులో ఎవరు అంటే ఎలా చెప్పగలం' అని. అప్పుడాయన గిరుక్కు మని వెనక్కి తిరిగి నన్ను చూచారు. అమ్మయ్యో! తలుచుకుంటే జలదరిస్తుంది. నాకు అమిత భయంపట్టుకుంది. గజగజలాడిపోయా. నోట్లో తడిలేదు. వేరే ఏమీ తోచక సాష్టాంగంగా పడ్డాను. 'స్వామీ నేనే, మీ వస్త్రం తాకినా, నా రణంమానిపోతుందని అలాచేశాను.. రక్షించండి' అని ఏడ్చాను. ఆయన తనచేతుల్తో నన్ను లేవ నెత్తి 'అమ్మా, నీ నమ్మకమే, నీ రణాన్ని నయం చేసింది: వెళ్ళు, సుఖంగా వెళ్ళు. నీకు ఇక బాధ వుండదు' అని చల్లగా పలికారు. ఇంతలోనే ఎవరో

ఆ ధర్మకర్తగారి ఇంట్లోనుంచి వచ్చి 'ప్రభూ, మీా కూతురు చచ్చిపోయింది. ఎందుకు స్వామికి శ్రమ' అని దుఃఖవార్త చెప్పాడు. ఆయన ధర్మకర్తని చూచి 'ఏమిా భయంలేదు. నమ్మండి' అన్నాడు. వారలా వెళ్ళిపోయారు; నేను సంతోషం పట్టలేకుండా గెంతుతూ వచ్చేశాను.

మార్తా: ఎటువంటి మహాత్ముడు!

జుబే: నేను వస్తూవుంటే దారిలో చెప్పుకున్నారు; ఆ ధర్మకర్త కూతుర్ని, చచ్చిపోయిందాన్ని లేచి రా అని అనగానే మళ్ళీ బ్రతికి లేచిం దని.

మార్తా: వెళ్ళు, దాదీ, వెళ్ళి శ్రమతీర్చుకో.

జుబే: అలాగేతల్లి. సెలవు.

నిష్క్రమణ

మార్తా ఇటు అటు పచారుచేస్తుంది. ఖాగారుగా అప్పుడప్పుడు కిటికిలోనుంచి చూస్తుంది. కొంతసేపటికి భర్త రావడంచూచి ద్వారంవద్దకు పరుగెడుతుంది.

ప్రవేశం: యాకూబ్. అలసినట్లుంటాడు గాని అది కేవలం శరీరం అలసటకాదు. ముఖంలో తేజస్సులేదు. ఆశాభంగంవల్ల వాడిపోయినట్లుంది.

యాకూ: (తలమిాద పాగా తీసి మంచంమిాద విసిరి ఉస్సురంటూ కూర్చుంటాడు.)

మార్తా: ఏమండీ, ఆయన కనిపించనే లేదా,

యాకూ: ఓ, దర్శనానికేమీ భంగం కలగలేదు.

మార్తా: ఏమండీ అలా వున్నారు? ఆయన చులకనగా చూచారా? పరుషంగా పలికారా? దూషించారా?

యాకూ: అయ్యయ్యో, అలాంటి నిందలకి ఆయన చోటిస్తారా? ఆయన్ని అంటే పాపంతో నాలిక కుళ్ళిపోతుంది. మార్తా, అటువంటి సౌమ్యమూర్తిని నేనీ జన్మలో చూడలేదు; ఇక చూడబోను. ఆయన నన్ను కాదుకదా, డబ్బుకు శరీరం అమ్ముకునే భోగస్త్రీని కూడా ఒక్కమాట పరుషంగా అనలేరు.

మార్తా: మరీ?

యాకూ: వెళ్ళి, చేతులుమోడ్చి అడిగాను: 'పుణ్యప్రభూ, నాకు పరమార్థం ఎలా లభిస్తుందో సెలవియ్యండి.' ఆయన విని చిరునవ్వుతో 'నన్నెందుకు పుణ్యప్రభువని పిలుస్తావు? పుణ్య స్వరూపుడు ఆ భగవంతుడు ఒక్కడే. నీ ప్రశ్నకు నేనేమి జవాబు చెప్పమందువు. మన ఆచార్యులు నిర్ణయించిన నీతిమార్గాన్ని అనుసరించు—అంతే' అన్నారు.

మార్తా: అంటే?

యాకూ: అదే నేనూ అడిగాను. ఆయన ప్రత్యుత్తరం ఇచ్చారు. 'ప్రాణం తియ్యకు, వ్యభిచరించకు, అపహ

రింపకు, అసత్యమాడకు, తల్లిదండ్రులను పూజించు. అందర్నీ నీతో సమంగా ప్రేమించు.' ఇంతేనా అని గర్వపడ్డాను. 'స్వామీ, ఇవన్నీ నా చిన్ననాటినుంచే అనుసరించాను. ఇంకా ఏమిచెయ్యమని తమ సెలవు, పరిపూర్ణమైన పారమార్థిక జీవితానికి' అని ఉత్సాహంతో అడిగాను. మార్తా, అప్పుడాయన నన్ను పరామర్శించినట్లు చూచాడు, జాలిగా. నాకు అర్థం కాలేదు. మృదువుగా, అయినా నిశితంగా, గంభీరంగా పలికిన ఆయన మాటలు విన్నప్పు డర్థమైంది.

మార్తా: (తొందరగా) ఏమన్నారు?

యాకూ: ఏమా, చెప్తాను. 'నాయనా నీకు పరిపూర్ణత్వం సిద్ధించాలంటే ఇంకొకటి చెయ్యాలి. నీ వస్తు వాహనాలు, ధన ధాన్యాలు యావత్తూ బీదలకు ఇచ్చేసి, బంధాలన్నీ తెంచేసి, నా వెంట వచ్చేయి' ఇవీ ఆయన మాటలు. మార్తా! మార్తా! అలా అంటారని అనుకోలేదు. నానోట మాటరాలేదు. నమస్కారం చేసి, వంచిన తల పైకెత్తకుండా వచ్చేశాను. వస్తూవుంటే శిష్యులతో ఆయనఅన్నది విన్నాను, ఏమంటే 'నిజం చెప్తున్నాను! ధనవంతుడు ఆధ్యాత్మిక రాజ్యంలో ప్రవేశించడం దుస్సాధ్యం లొట్టిపిట్ట దొడ్డిగుమ్మంలో నుంచైనా పోవచ్చునుగాని, ధనవంతుడు ఆరాజ్యంలోకి పోలేడు' అని,

మార్తా: అబ్బా!

యాకూ: చాలా కఠినమార్గంకదూ మార్తా?

మార్తా: (పలకదు-కాని జాలిగా భర్తవంక చూస్తోవుంటుంది)

యాకూ: (రెండుచేతులతో ముఖం కప్పేసుకుంటాడు.)

ఈ నాటికకు ఆధారం బైబిల్.

---

## పాత్రలు :

ఒకటవ పరిచారకుడు

రెండవ పరిచారకుడు

ఆంనజార్హ్వాతుడు

నాగసుందరుడు

ఒకటవ భిక్షువు

రెండవ భిక్షువు

జయశ్రీ

# నాగుబాము

## ౧

అజంతా పర్వతములలో నొక బౌద్ధచైత్యము లోపల, ధాతుగర్భం, దగోబా అనగా అవశేషములు ప్రతిష్ఠింపబడిన భాగమునకు సమీపమున నున్న గదిలో.

చైత్యము క్రొత్తగా నిర్మింపబడిన దనుటకు తార్కాణము లున్నవి. గదిలో ఒక గోడమీద మాయాదేవి స్వప్నము, బుద్ధుని జననము చిత్రింపబడి యున్నవి. ఎదుటి గోడమీద చిత్రమేమీ లేదు. కాని చిత్రరచనకు అనుకూలముగ సిద్ధము చెయ్యబడి ఉన్నది.

ఇద్దరు పరిచారకులు, రంగుల పాత్రలు, కుంచెలు, చిన్న బల్లలు చిత్రములేని గోడముందు ఉపాయనంగా ఉంచుతారు, మాట్లాడు కుంటూ. అస్పష్టంగా వినబడుతూ వుంటుంది, దగ్గరలో బౌద్ధసూత్ర పారాయణం.

ఒకటవ పరి: నాగయ్య చేతిలో ఎంత విద్దె ఉందిరా!

రెండవ పరి: సిద్ధహస్తుడని పేరుగద్రా... ఎంత సిన్నోడురా, మీసాలైనా తిన్నగా రాలేదురా!

ఒకటవ పరి: ఎంత అందగాడు కూడారా, కన్నుగీటితే చాలు ఎందరు కన్నెలో కాళ్ళమీద పడర్రా. కాని ఆయన ఎందుకో ఇంత చిన్నవయస్సులో సంఘాన్ని చేరిపోయాడు. సన్యాసం పుచ్చుకొని భిక్షువై పోతా డంట.

రెండవ పరి: ఒరే! అది నీకూ నాకూ ఎలా అర్థమవుతుందిరా!

ఒకటవ పరి: (ఆలోచిస్తూ) మహానుభావుడు బుద్ధభగవానుడు అంతఃపురం వదిలి వెళ్ళిపోయేటప్పుడు మంచి ప్రాయంలో వాడు గాదట్రా.

రెండవ పరి: అందరికీ వస్తుందీ వైరాగ్యం. మా ఆవిడతో దెబ్బలాడినప్పుడు సన్నాసై పోదామనిపిస్తది గాని, మళ్ళీ ఆ తర్వాత దగ్గిర జేరి 'పందికూర వండాను మాంబాగుంది సూడు' అని నవ్వుతూ పిలిచేటప్పటికి వైరాగ్యమంతా మాయమవుద్ది.

ఒకటవ పరి: ఇష్ ?

సూత్రములు చదువుచుండినది ఆగిపోయింది. గంభీరమైన కంఠంతో మొదటనొకరు, తత్క్షణం ఏకగ్రీవంగా పలువురు, పారాయణ చేస్తారు.

ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి

పరిచారకులు నిశ్శబ్దంగా తలలు వంచుకొని నిలబడతారు.

తదుపరి ప్రవేశం: ఆనందార్హతుడు, ఇద్దరు భిక్షువులు, నాగసుందరుడు.

ఆనందార్హతుని ముఖంలో తేజస్సు, శాంతి ప్రజ్వరిల్లుతూ వున్నాయి. కండ్లలో కరుణ, నుదుట విశాలభావము, పెదవులలో జాలి, ప్రస్ఫుటంగా కనబడుతవి. నాగసుందరుడు యౌవనుడు. స్ఫురద్రూపి. ఇంకా భిక్షువు కాలేదు. ఉపాసకుడు. మాటిమాటికి కండ్లు మూసుకుని తెరుస్తాడు. అప్పుడు ఇంకో లోకానికి వెళ్ళి ఈ లోకానికి వచ్చిన ట్లుంటుంది.

ఆనంద: (అభిమానంతో) నాయనా, నాగసుందరా! ఈ ప్రదేశమున (గోడచూపిస్తూ) 'మారుని పరాజయం' చిత్రించవలసినట్లుగా చైత్యాధికారులు నిశ్చయించినారు. అందుకు నీవే శిల్పిగా ఉండవలెననే నా అభిప్రాయాన్ని వారు ఆమోదించినారు. సంతోషమేనా?

నాగ: (పరవశుడై) మహాభాగ్యం! మహాప్రసాదం. ధన్యుడను. (సంకోచంతో) కాని, నే నీ కార్యానికి సరిపోగలనా? నా శక్తి చాలునా? భయపడుతున్నాను.

ఆనంద: (చిరునవ్వుతో) ఆ సంశయం నీకు సహజమే కావచ్చును. గాని మాకు లేదు ... నీ శిల్పనైపుణ్యమునకు, నీ ప్రతిభకు, సాధ్యముకాని వస్తువు లేదు అని మా నమ్మకము.

ఒకటవ భి: నీవు చిత్రించిన రాజనర్తకి పశ్చాత్తాప ఘట్టము రాజకుమారి జయశ్రీ చాలా మెచ్చుకొన్న దని విన్నాము.

నాగ: రాజకుమారియా?

ఒకటవ భి: ఆంధ్రరాజ తనయ కళారాధన, తథాగతారాధన, ప్రఖ్యాతము గదా.

ఆనంద: మా విశ్వాసము, బోధిసత్త్వుని కృప చాలును. నాగసుందరా! గొప్ప కార్యము గాని, కృతి గాని ప్రారంభించుటకు ముందు కొంత జంకు కలుగుట మహానుభావులకు సహితము సహజము.

నాగ : (కండ్లు మూసి తెరిచి) అర్హతుల అనురాగము, బుద్ధదేవుని కరుణ. నా భాగ్యము.

ఆనంద: మా కిక వేళ అయినది (నిష్క్రమణ)

౨

కొన్నాళ్ళ తరువాత. అదే ప్రదేశం. నాగసుందరుడు గోడ ముందు చిన్న యాసనముపై కూర్చుండును, నిమీలిత నేత్రుడై. గోడమీద పక్క పక్కనే రేఖ లున్నవి.

ఒకటవ భిక్షువు, ఆంధ్రరాజకుమారి ప్రవేశిస్తారు. మెల్లగా అడుగులచప్పుడు విని ఉలికిపడి కండ్లు తెరుస్తాడు నాగసుందరుడు — ఇద్దరినీ చూస్తాడు.

ఒకటవ భి: ఈమె శ్రీ విజయ శ్రీకుమారి ఆంధ్రరాజన్యుని పుత్రికారత్నం.

నాగ : (లేవబోవును)

జయశ్రీ: వద్దు (ఆపుతూ) వద్దు, వద్దు. నేను రాజపుత్రి నైనప్పటికి చైత్యంలో అందరూ సమానులే. అందులో ఉపాసకుడివి, శిల్ప సార్వభౌముడవు. నాకన్న నెక్కువ గౌరవమునకు నీవే అర్హుడవు.

ఒకటవ భి: నాగయ్యా! ఆలస్యమైనది. జయశ్రీ కుమారికి దారిజూపడానికిమాత్రం వచ్చాను. ఈమె సంగీత సాహిత్య నాట్యాది కళలలో నిపుణురాలు. బౌద్ధమత సేవాపరాయణ. నేను చెప్పలేదా ఆనాడు నీ నర్తకి

చిత్రం చాలా మెచ్చుకొన్నదని. కొత్త చిత్రము రచింపబోవుచున్నావని విని ఉత్సాహముతో వచ్చినది. దేవీ! వెళ్లుచున్నాను. (నిష్క్రమించును)

జయ : (నవయౌవన వైభవం మూర్తీభవించినది, అంగ సౌష్ఠవమున నేమి, రూపరేఖా విలాసాదులందేమి - నిరూపమాన. ఆమె వంపులనడక, ఆమె కండ్లు, తెల్ల నాగుబామును స్ఫురింపజేస్తవి.)

నాగసుందరుని తదేకదృష్టితో చూస్తూ

ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు (పకపక నవ్వుతు నాగసుందరుని కనుగవ చూచి) ఏమది అట్లు చూచు చుంటివి.

నాగ : (సంకోచిస్తూ) ఏమీ లేదు. మీరు నవ్వుతుంటే సెలయేటి రొదలు వింటున్నట్టుంది.

జయ : ఎంత చక్కగా మెచ్చుకొన్నావు! కానీ నేనెందుకు నవ్వినానో, ఎన్నాళ్ళకేమి జరిగిందో తెలుకోవాలని లేదూ?

నాగ : అవును వుంది.

జయ : నీ వొక అమాయకుడవు సుమా.

నాగ : నిజమే. మీ కెట్లు తెలిసింది.

జయ : స్త్రీలకు సూక్ష్మంగా గ్రహింపగల బుద్ధి సహజం... పోనీ చెప్తాను. గొప్ప చిత్రాన్ని చూచినప్పుడల్లా చిత్రించిన శిల్పి ఎలా ఉంటాడో అని చిత్తరువు చూచి భావనాశక్తి ఉపయోగించి ఊహించుకునే దాన్ని, ఆ తర్వాత తటస్థంగా చిత్రకారుని ముఖాముఖీ చూచినప్పుడు నా ఊహ పూర్తిగా

తప్పి పోయ్యేది. ఒకప్పుడు నా ఊహాప్రకారం చిత్రకారుడు సన్నగా, పొడవరిగా, తీర్చిన ముక్కు-కండ్లు కలవాడుగా ఉండెను. ఇక అసలు చిత్రకారుడా - పొట్టిగా, లావుగా, చప్పిడిముక్కు, గుంట కండ్లతో ప్రత్యక్షమయ్యాడు. ఆ పరాభవం తలుచుకొనే నవ్వితిని — ఇక ఎన్నాళ్ళ కెన్నాళ్ళకన్నది నిన్ను చూచే!

నాగ : అంటే?

జయ : ఇన్నాళ్ళకు. నా ఊహాచిత్రకారుడు సాక్షాత్కరించాడు అని.

నాగ : ఎక్కడ? ఎవడు?

జయ : అమాయకుడా! ఇక్కడే. నీవే.

నాగ : (సిగ్గుతో ఇటునటు చూస్తాడు)

జయ : అయ్యయ్యో. నా పనికిరాని మాటలతో నీ పనికి అంతరాయం కలగజేస్తున్నాను. మారుని పరాజయంకనూ నీ చిత్రానికి వస్తువు. ఏ ఘట్టం చిత్రించబోతున్నావు? తృష్ణ, రతి, నాగసుందరులు బోధసత్వుని ఎదుట నాట్యమాడిన ఘట్టమా?

నాగ : (అవునని తల ఊపి సూచిస్తాడు)

జయ : ఇకనేమి నీ శిల్ప ప్రతిభకు అనుకూలించే ఘట్టమే!

నాగ : కాదు. కాదు... అలా అనకండి. ఆ సుందరులు అతిరూప లావణ్యవతులు, అసమాన నాట్యకళాకోవిదులు. నాకు స్త్రీసౌందర్యవిలాసముతో ఎక్కడు

పరిచయము లేదు. నాట్యశాస్త్రము కొంత చదువు కున్నాను గాని అభ్యాసము లేదు. నర్తకీ మణుల నాట్యప్రదర్శనాలు చూచి ఎరుగను. అర్హత లేకుండా ఒప్పుకొన్నానేమో ఈకార్యం. ఏమి చెయ్యటానికీ తోచడం లేదు.

జయ : నీకు కావలసిన సహాయం నే నిస్తాను. చూడు. (చిరు నవ్వుతో) నన్ను బాగా చూడు, నీ శిల్ప దృష్టితో చూడు. నన్ను సౌందర్యవతి అని లోకులంటారు. చూడు (లేచి తన అవయవసౌభాగ్యము ప్రకటిత మగునట్లు పచారు చేసి) చూచావా?

నాగ : (కండ్లతో సౌందర్యాన్ని తాగివేస్తూ) భాగ్యం! భాగ్యం! లావణ్యమంతా మీలో అవతరించి వుంది. అంధత్వంచే చూడలేకపోయాను. (అని తన చెవులకు జడిసి నాలిక కరుచుకొంటాడు.) దేవీ కరుణించుము!

జయ : (నవ్వుచు) అంతేకాదు సుమా. నాట్యశాస్త్రం, పుస్తకాల్లో చదువుకోవడం కాదు, బాగా అభ్య సించినదాన్ని: రాజకుమారిని గాకపోతే రాజ నర్తకినై యుండేదాన్నేమో! నీకు నమ్మకం లేదు కదూ. (ఉత్తరీయం తీసిపారేసి) ఇదుగో ఇది పతాక హస్తం. ఇది త్రిపతాకం: ఇది మయూరం అదిశిఖరం ఇది చక్రభ్రమరీ. ఇది ఏకపాదభ్రమరీ... అన్ని కరణాలు నేర్చుకొన్నదాన్ని, చూడు! ఇది సర్పితం. ఇది నాగాపసర్పితం. ఇది నితంబం. ఇది జనితం. ఇది వివరిత్తం (అయాహస్తాది విన్యాసములుచూపిస్తుంది.)

నాగ : అద్భుతం! అనిర్వచనీయం!

జయ : ఇంతమాత్రానికేనా? పాఠానికి ఉదాహరణ చెప్పినట్లు చేశాను, అసలు నేను నృత్యం చెయ్యనే లేదే. రాగభావలయానిత్వంగా నాట్యంచేసి అభినయించినప్పుడుగదా రసము నిష్పత్తియగును! (ఇటు నటు చూచి) ఇక్కడ నేనెలా నాట్యం చెయ్యగలను. (నవ్వి) చెప్పు.

నాగ: (ఏమి చెప్పడానికి తోచక యుక్తిగా రెప్ప వాల్చక చూస్తాడు)

జయ : (తటాలున) ఆఁ ఇలా చెయ్యి. నేటిరాత్రి అంతఃపురానికి వస్తే, నాట్యం చేస్తాను, నర్తనశాలలో నా చెలు లుంటారు తాళగీతవాద్యాలకు. మా అతిథిగా వస్తే సత్కరిస్తాము. భయము లేదు.

నాగ : (సందేహం సూచించే మౌనం అవలంబిస్తాడు.)

జయ : ఓహో! శంకిస్తున్నావు కాబోలు. నేను నిన్ను ఆహ్వానించినది అంతఃపురానికి, వేశ్యావాటికకు కాదు. అటువంటి సిద్ధాన్తుడే అమ్రపలివంటి భోగస్త్రీయింట విందుగుడువలేదా? (నవ్వుతూ) నేనేమి అమ్రపలికి తీసిపోయినానా. నీవుమాత్రం బుద్ధునంత వాడవైనావా ఏమి?... ఈ వెర్రి సందేహాలు వదిలిపెట్టి వస్తావు కదూ. తప్పక. నేను వెళ్ళిపోవాలి. నిరీక్షిస్తూ వుంటాను—

పల్లెవాటు వేసుకొని నిష్క్రమిస్తుంది.

నాగ : (కత్తెరలో చిక్కిన వక్కలాగు కష్టపడుతూ పచారు చేస్తుంటాడు.)

ప్రవేశం : ఒకటవ భిక్షువు

ఒకటవ భి: ఏమి నాగయ్యా ! తీవ్రాలోచన.

నాగ : (దీనంగా భిక్షువు చేతులు పట్టుకొని) ఏమిచెయ్యను, రాజకుమారి అంతఃపురానికి ఆహ్వానించింది, నేటి రాత్రికి నాట్య ప్రదర్శనానికి. నా చిత్రానికి ఉప యోగకరంగా ఉంటుందని చెప్పింది. ఏమిచెయ్యను.

ఒకటవ భి: వెళ్ళు నాయనా ! రాజకుమారి ఆహ్వానం ఆజ్ఞ కాదా నీకు ? ఆమె గొప్ప నర్తకి అని ప్రఖ్యాతి. నీ వదృష్టవంతుడవులే.

నాగ : (ఆశతో) అయితే వెళ్ళమంటావా ?

ఒకటవ భి: వెళ్ళు. కాని (నాగసుందరుని చెయ్యి తన చేతులతో పట్టుకొని) నాగూ ! బుద్ధ భగవాను డేమని పల్కినాడో జ్ఞాపకం ఉంచుకో.

కామతో జాయతే శోకో
కామతో జాయతే భయం
కామతో జాయతే శోకో
కామతో జాయతే భయం
కామతో విప్పముత్తస్స
పత్థి శోకో కుతో భయం !

నాగ : ఆ యుపదేశం మరిచిపోను.

ఒకటవ భి: బుద్ధం శరణం గచ్ఛామి!

మరునాడు అదే ప్రదేశం. నాగసుందరుడు గోడనుండు కూర్చుని కళ్లుమూసుకుని కలలు కంటున్నాడు. ఒకటువ భిక్షువు ప్రవేశించును గాని అతనికి తెలియదు.

ఒకటవ భి: నాగూ! కల గంటున్నావా?

నాగ: (తెప్పరిల్లి) నమస్కారం

ఒకటవ భి: నిన్నరాత్రి నాట్యం బాగుందా?

నాగ: (ఉత్సాహంతో) నాట్యం అనే పదం ఆ చమత్కృతికి, ఆ ప్రావీణ్యానికి చాలదు. ఆనందానుభవం కళ వల్లనే గాని వేరే విధంగా లభించదని నిన్నే గ్రహించాను. ఏమి ఆ సౌందర్యం! అవయవ సౌభాగ్యం! రామణీయకం! ఆ లయాత్మకమైన రసోత్కర్ష! పరవశుడనై పోయాను. ఈలోకం విడిచి మేఘ మార్గాలలో ఇంకో లోకానికి ఎగిరిపోయాను. నాట్యం ముగించిన తర్వాతనుండి లోకంలో అన్ని వస్తువులు, వ్యక్తులు, నిర్వీర్యంగా, నీరసరగా— కనిపిస్తున్నవి.

ఒకటవ భి: వర్ణన చాలును. ఒక్కరాత్రి కొంతకాలమైనా కావలసినంత అనుభవం పొందావు. ఇక చాలును. నీపని నిర్విఘ్నంగా సాగించు. నాకూ పను లున్నవి. (నిష్క్రమించును.)

నాగ: అవును. కాలం వ్యర్థంచేసుకొంటున్నాను. (కుంచెతో ఒక నర్తకి బొమ్మ వ్రాస్తూ ఉంటాడు)

ప్రవేశం: జయశ్రీ

జయ : ఏమి, నచ్చిందా నిన్నరాత్రి నాట్యం ?

నాగ : నచ్చిందా ? పరవశ్యుడనై పోయాను.

జయ : అవును. నాకూ చాలా సంతోషమైంది. అభ్యాసం లేక, అభినుతి లేక, దోహదం లేని అశోకం లాగు నావిద్య వాడి శుష్కించి పోతూవుంటే నీవు నాకొక క్రొత్త ఉత్సాహం కలిగించావు. నాట్యంమీద నాకు అనురాగం మళ్ళీ సృష్టించావు. నిన్ను చూస్తూ నృత్యం చేసినప్పుడు నృత్యంలో లీనమై పోయాను నీతోకూడా ...

నాగ : ఈ విధంగా మాట్లాడవద్దు. దేనిమీదా అనురాగం వుండకూడదు. అనురాగం శోక హేతువు.

జయ : ఊహుఁ. గ్రంథాల్లోని మాటలవి. నీ హృదయంనుంచి వచ్చినవిగావు. సౌందర్యపిపాస సహజం కాదా. ఆనందానుభవం లోకులందరికీ సమానం కాదా.

నాగ : అలాకాదు. ఈ రాగమే తృష్ణ–కామతృష్ణ, భవ తృష్ణ. భగవానుడు బోధించినది నీకుమాత్రం తెలియదా ? తృష్ణా లత గట్టిగా వేళ్ళు నాటుకొని, పైపైకి పాకి అల్లుకోక మునుపే త్రెంచివేయవలెనని. ఆతీగ నన్ను చుట్టుకుంటే మళ్ళీ వదిలించుకో లేను.

జయ : నీవు కూడానా ?

నాగ : ఏమో. ఎవరు చెప్పగలరు ?

జయ : (మౌనంగా గోడవంకకు చూస్తూ) ఆఁ ! ఆ నర్తకి భంగిమం నిన్నరాత్రి నా నాట్యంలోనిది కాదూ?

నాగ : (ఉలికిపడి) అలాగా ? కావచ్చును.

జయ : ఇంకేమి ? నా గర్వానికి మితిలేదు. (మళ్లీచూచి) చూడు ! చనుకట్టు ఆ వైపు కొంత జారినట్లున్నది కాదా ! (ఆ రీతిగా దగ్గిర నిలబడుతుంది.)

నాగ : (చలిస్తుంది మనస్సు) అవును. సవరిస్తాను ... ప్రొద్దయినది, వెళ్తారేమో.

జయ : కాదు, కాదు. నేనుంటే నీ పని సాగదు. అదేనా ?

నాగ : (తలవంచుకొని) అవును.

జయ : (బిగ్గరగా నవ్వుతూ) అయితే వెళ్తాను. (అతని చెయ్యి పట్టుకుంటుంది.)

నాగ : (జంకుతో చెయ్యి లాగివేస్తాడు.)

జయ : ఏఁ ? భయమా కరుస్తానని ? నాగుబామునా ?

నాగ : (నమస్కరించి) క్షమించండి.

జయ : (నవ్వుతో నిష్క్రమిస్తుంది.)

నాగ : (ఆ నవ్వు ప్రతిధ్వనులు వినకుండా చెవులు మూసుకుంటాడు. ఆ తర్వాత ఆవిడ పట్టుకొన్న చెయ్యి ఘూచుకుంటాడు.)

౨

కొన్ని రోజుల తరవాత, సాయంత్రం నాగసుందరుడు చుట్టూ రంగుపాత్రలు, కుంచెలతో, కూర్చున్నాడు. నృత్యం చేస్తూవున్న రతిబొమ్మ పూర్తిఅయింది. కుంచె తీస్తాడుగాని మళ్ళీ పాకవేసి కండ్లు మూసుకుంటాడు.

ప్రవేశం: జయశ్రీ, చప్పుడుచెయ్యకుండా. అతని వెనక నిల్చుని రతి చిత్తరువు చూచి అందులో తన రూపం గుర్తిస్తుంది. ఆనందంతో మెల్లగా అతని భుజాన్ని చేతితో తాకుతుంది.

నాగ : (త్రుళ్ళిపడి జయశ్రీని చూచి) వచ్చి ఎంతకాలమైంది.

జయ : ఇప్పుడే వచ్చా.

నాగ : ఎందుకు వచ్చావు?

జయ : నాలుగు రోజులైనవి నిన్ను చూచి!

నాగ : అయితే?

జయ : ఇంతేనా? అర్థం కాలేదా నీకు. గొప్పశిల్పివే! కళోపాసకుడవే! మనోభావాల్ని అర్థంచేసుకోకుండా శిల్పి ఎట్లా కాగలవు. కాదు, ఎందుకర్థం కాదు. చెప్పు. నిజంగాచెప్పు. నీవు లేకుంటే నా జీవితం శూన్యం, వ్యర్థం, నిరర్థకం, అంధకారమయం అని నీకు తెలియదూ. నేను నీకు రాజకుమారినిగాను; దాసిని

నాగ : తప్పు తప్పు. జ్ఞానంగల నీవే ఇలామాట్లాడితే నేనేమి చెయ్యాను. నేను కళోపాసకుని గాను. భాధ్యధర్మో పాసకుడిని. నావంటివాని జీవితంలో నీవంటివాళ్ళకి చోటు లేదు.

జయ : మీ ధర్మంలో హృదయానికి చోటేలేదా ?

నాగ : పొరపాటు. అహింసనే పరమధర్మంగా పాటించే బౌద్ధనీతిలో హృదయానికా చోటులేదు. దుఃఖ భాజనులైన శతసహస్రకోట్లమీద తన అపారమైన దయ ప్రసరింపచేసిన బుద్ధదేవుని మతంలో హృదయానికి చోటులేదా ? ఎంత పొరబడుచున్నావు ?

జయ : (జాలిగా) నే నీ దుఃఖంలో ఉన్నానే. నా దుఃఖం తీర్చటం నీకు విధిగాదా ?

నాగ : అవును. ఈ దుఃఖాన్ని తీర్చే మార్గం లేకపోలేదు. కానీ, అది నీవు కోరే మార్గం కాదు. ఈ దుఃఖానికి కారణం తృష్ణ, కామం, శారీరక సుఖాపేక్ష. ఆ కారణాన్ని నిర్మూలిస్తే దుఃఖం నశిస్తుంది ... తథాగతుడు ఉపదేశించిన అష్టమార్గమే, నీకూ నాకూ అవశ్యమనుసరణీయం.

జయ : (నిట్టూర్చి) అంతేనా ? ఆ రతి అంత సుందరంగా నృత్యంచేసినా ఆ బుద్ధదేవుడు చలించనట్లే నేను నృత్యం చేసినా నీ మనస్సు చలించదు గాబోలు.

నాగ : అపచారము. బుద్ధదేవుడెక్కడ, నే నెక్కడ.

దీనంగా జయశ్రీ ముఖం చూస్తుంటాడు.

జయ : (ఏడుస్తూ నిలబడుతుంది.)

నాగ : (కరగి, లేచి, ఉత్తరీయంతో కన్నీరు తుడుస్తాడు.)

జయ : (హఠాత్తుగా అతని కుడిచెయ్యి పట్టుకొని, గట్టిగా ముద్దు పెట్టుకొని, వక్షస్థలాన్ని అదుముకుంటుంది.)

నాగ : (ఒక్క క్షణంవరకు ఊగుకుంటాడు. తర్వాత చెయ్యి విడిపించుకుంటాడు.)

జయ : అపరాధం, క్షమార్హను. ఇక నిన్ను బాధపెట్టను. నమ్ము... నీ వెనక నిలబడి చూస్తూ వుంటాను, నీ శిల్ప వైభవం.

నాగ : (దిగ్భ్రమ చెందినవాడివలె శీఘ్రంమీదకూర్చుంటాడు. కుంచె రంగుపాత్రలో ముంచి గోడవరకు ఎత్తి పార వేసి, ఆమె ఏచోట ముద్దు పెట్టుకుందో ఆ చోట చూచుకుంటూ వుంటాడు. కుంచె క్రిందపడి గోడ మూలకు దొర్లిపోతుంది. మరల దొర్లిపోయినకుంచె తీసికోవడానికి చెయ్యి చాస్తాడు. ఆ క్షణంలో గోడమూలనుంచి ఒక తెల్ల నాగు సర సర వచ్చి, ఆ చేతిమీద కాటు వేసి మాయమవుతుంది.)

నాగ : (బిగ్గరగా 'హా' ! అని కరచిన చేతిని ఇంకో చేతితో పట్టుకొని ఘోరమైన బాధతో నేలబడి, స్మృతి దప్పుతాడు )

జయ : (జరిగినది చూచి) అయ్యో తెల్లనాగు (అని అరచి, తక్షణం మోకాళ్ళమీదపడి, నాగసుందరుని కుడి చేతిని కాటు పడినచోట తన పండ్లతో రక్తం వచ్చే వరకు కొరికి, పెదవులతో విషంపీల్చేస్తూ వుంటుంది, రక్తతో కూడా. రెండునిముషాలకే విషప్రభావం కన బడుతుంది. భరించలేక కంఠంరెండుచేతులతో గట్టిగా పట్టుకొని పడిపోతుంది. నోట నురుగులు)

ఈవిధంగా జరుగుతూ ఉన్న సమయంలో త్రిపిటకమునుండి
ఎవరో పఠించడం అస్పష్టంగా వినపడుతూఉండి ఆగిపోతుంది.
తదుపరి ప్రవేశం: ఆనందార్హతుడు, ఒకటువ భిక్షువు.

ఆనంద: నాగూ… (నాగ జయశ్రీలు పడియున్న తీరు చూచి గట్టిగా) కాగడాలు, కాగడాలు !

ఒకటువ భిక్షువు తనచేతిని ఇద్దరి ముఖాలదగ్గిర ఉంచి చూస్తాడు. జయశ్రీ శ్వాసహీనగా గ్రహించి పెదవి విరుస్తాడు. నాగసుందరునకు మాత్రము ఇంకా ఊపిరి ఉంది.
ఇంతలో కాగడాలతో పరిచారకులు ప్రవేశిస్తారు.
ఆ వెలుతురులో తెల్లనాగు కనబడి పారిపోతుంది.

ఆనంద: తొందరగా తొంగరగా విషహారిణీ ! (నీళ్ళు నాగసుందరుని ముఖముపై జల్లి, తీసుకొనివచ్చిన మందు రక్తం వచ్చినచోటు చేతికి పూస్తాడు. కొంతకాలానికి నాగసుందరుడు కండ్లు తెరుస్తాడు.)

నాగ : (ఆనందుని చూచి) స్వామీ తెల్లనాగు … జయశ్రీ ఏమయింది ?

ఆనంద: (సూక్ష్మంగా ఎంతో అర్థంచేసుకుని) అదుగో ! నీ ప్రాణంకోసరం తనప్రాణాన్ని అర్పించిన మహాత్యాగిని. అదుగో–నిన్ను రక్షించి, తన్ను శిక్షించుకొన్నది.

నాగ : (కండ్లు మూసుకుంటాడు.)

ఆనంద: (అతనివెంట అందరు.)

ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి.

—0—

## పాత్రలు:

ఆచార్యులు

వెంకటేశం ... శిష్యుడు

శేషాచలం ... వెంకటేశం తమ్ముడు

సుబ్బయ్య }
రంగడు } గ్రామవాసులు.
వెంకడు }

రామారావు }
వెంకట్రావు } పట్టణవాసులు.

---

# వైకుంఠాచార్యులు

## రంగం—౧

చిన్న పల్లెటూరు. పెద్దగది. ఒకవైపు సగానికి తెర కట్టి ఉంది. తెరముందు చాపలు పరిచివున్నాయి. ఇద్దరు ముగ్గురు ఆవూరివాళ్ళు రంగడు, వెంకడు కూర్చున్నారు. నిదానంతో అలిసినట్లు — తరవాత వచ్చి కూర్చుంటారు. ఒకరు, ఇద్దరు, ముగ్గురుగా ఆ వూరివాళ్ళు పొరుగూళ్ళవాళ్ళు. అందులో అందరూ నిరక్షరకుక్షులే — ఇద్దరు తప్ప. వారుమాత్రమే చొక్కాలు వేసుకొన్నారు. వారు పట్టణ వాస్తవ్యులు.

రంగడు: (హఠాత్తుగా కొత్తగా ప్రవేశించినవాణ్ని ఉద్దేశించి) ఏం సుబ్బయ్యా! ఇంత దూరంవచ్చావు.

సుబ్బయ్య: నీకు తెలుసూ రంగయ్య బావా, అత్తయ్య పోయింది.

రంగ : అయ్యయ్యో!

సుబ్బ: ఏం చేస్తాం ...... ఇంకా ఆచార్యులోరు దరిసనం ఇయ్యలే.

రంగ : ఇంకా లే. అందుకే నేనూ కాచుకున్నా. మొన్న మా నరిసిగాడు వైకుంఠం సేరినట్టుగా కబురొచ్చిందో లేదో కనుక్కుందామని వచ్చా.

సుబ్బ: ఏం వైకుంఠమో. మా ఆవిడ అందుకే తరిమింది ఈ పొద్దుకి, టికెట్టు పట్టుకురమ్మని.

రంగ : వరిసెనం వేళయింది తాళుకో.

రామారావు: (పట్టణ వాస్తవ్యులలో వొకడు. ఆచార్యుల మహాత్మ్యం గురించి కథలు విన్నాడు. తను, తన స్నేహితుడు వెంకట్రావు ఈ విషయం తనిఖీ చెయ్యడానికి పూనుకున్నారు.)
క్షమించండి. ఈ వూరికి కొత్తవారు. ఆచార్యుల వారి మాట విన్నాము గాని బాగా తెలియదు. టిక్కెట్టు ఏమిటి, ఎక్కడికి?

రంగ: ఇంకెక్కడికి, వైకుంఠానికి.

వెంకట్రావు: (నవ్వును) భలే... చార్జీ కూడా వుందా!

రంగ: ఇతగులు నవ్వబోకండి. అపరాధం — చార్జీ ఒక్క వరహా—

రామా: మా కింకా భోధపడ లేదు.

రంగ : చెబుతా విను. నువ్వో రేపు సచ్చిపోతావనుకో. మీ బాబు ఒక వరహా ఇచ్చి నీకోరకు టిక్కెట్టు కొంటాడు. కొని నీ బొందెతో దహనం చేస్తాడు. రెండో రోజునో, మూడో రోజునో. అక్కడినుంచి చీటీ వస్తుంది, నీ ఆత్మ సుఖంగా చేరినట్టు—

వెంకడు: సద్దు సద్దు. తెరతీస్తుండారు. (అందరూ భక్తితో లేస్తారు. రామారావు, వెంకట్రావు విధిలేక లేస్తారు. లోపలినుంచి తెరతీస్తారు. తెర వెనుక పెద్ద పరుపు మీద వైకుంఠాచార్యులవారు ఆసీనులై ఉన్నారు. తిరునామములు లలాటముపైన) భుజముపైన రొమ్ము

పైన ప్రకాశిస్తూ వున్నవి. కండ్లు మూసుకొని వున్నారు. శిష్యుడు ముందు నిలువబడి వున్నాడు. తెర తీసింది అతడే.)

శిష్యుడు: ఆచార్యులవారు నిష్ఠలోనుంచి ఇప్పుడే బయటికి వస్తారు. సావధానంగా ఉండండి...

ఆచార్యులు: (కండ్లు తెరిచి) ఓం నమోనారాయణాయ.

రంగడు మొదలైనవారు: (చెంపలు వేసుకుంటారు.)

ఆచా: వెంకటేశా! వైకుంఠంనుంచి ఏమైనా చీటీలు వచ్చినవా?

శిష్యు: వచ్చాయిండి. వాళ్ళవాళ్ళకి చదివి చెప్పమంటారా?

ఆచా: (తల ఊపును)

శిష్యు: (సంచిలోనుంచి తాటాకులు కొన్ని బయటికి తీసి అందులో ఒకదానిని చదువుతాడు) శ్రీ వేదాంత వేద్యులైన తిరుమంగాచార్యులవారికి వైకుంఠంనుంచి హయగ్రీవాచార్యులు ఉభయకుశలోపరి. తమరు మొన్న పంపిన రామాపురం వెంగళి నరసిగాడి ఆత్మ చేరినది. వాడికి మూడోలోకంలో స్థానం ఏర్పరచినాము... ...ఎవడురా నరసిగాడి బంధువు.

రంగ: నేనే సామీ, ఏదో మీ కృపవల్ల సేసుకున్నాడు, వైకుంటం... లేకపోతే వాడుచేసిన దొంగతనాలకి ఏ నరకంలోనో పడి సావాలిసినవాడేనండి. ఏదీ ఆ చీటీ కొంచెం ఇప్పిస్తారా. ఇంటో పెట్టుకుని పూజ చేసుకొంటాం.

వెంకటేశం: తీసుకో (అని ఇస్తాడు)

రంగ : (తీసుకొని కళ్ళకద్దుకొని కూర్చుంటాడు)

శిష్యుడు ఈవిధంగా ఒక్కొక్కరి చీటీ చదువుతుంటాడు.

రామా: ఏదీ. ఒకమారు నేను చూడవచ్చా. (రంగడు తాటాకు ఇస్తాడు. రామారావు వెంకట్రావు గుసగుసల్లో మాట్లాడుకుంటారు. రామారావు మళ్ళీ ఇస్తే ఇచ్చేస్తాడు తాటాకు.)

సుబ్బ: (లేచి) స్వామీ! ఆలస్యమవుతోంది మా అత్తయ్యకోక టిక్కెట్టు ఇప్పించరూ.

శిష్యు: మీ అత్తయ్య అంటే లోకానికంతా తెలుస్తదా? పేరు?

సుబ్బ: అత్తయ్య అని పిలవడమేనండి. పేరు తెలవదండి. పోనీ లచ్చువమ్మా అనండి. ఈ గొడవంతా మా ఆవిడదండి. వాళ్ళ అమ్మను బొందితోనే వైకుంఠం పంపగలిగితే దానికే టిక్కెట్టు ఇవ్వండి.

శిష్యు: ఛీ! మీ అత్తయ్య మీరాబాయి, సక్కుబాయి అనుకున్నావా బొందితో వైకుంఠం వెళ్ళడానికి – ఏదీ తే వరహా.

సుబ్బ: వరహా ఏమిటండీ?

శిష్యు: టిక్కెట్టుకు డబ్బు.

సుబ్బ: ఇదేమిటండీ రైలుచార్జీ, బస్సు చార్జీలాగ.

శిష్యు: అధిక ప్రసంగంచేస్తే తగిన శాస్తి అవుతుంది.

రంగడు: వరహా ఇచ్చుకో సుబ్బయ్యా! తప్పదు.

సుబ్బ: ఇదేంఖర్మం... బతికున్నన్నాళ్ళు పెట్టి పోషించా. చచ్చాకకూడా ఇలా పీక్కుతింటూందే ఈఅత్తముండ.

ఈ సంభాషణ జరుగుతూవున్నప్పుడు రామశాస్త్రి మెల్లిగా వెళ్ళిపోతాడు.

శిష్యు: ఏమయ్యా ఈగోల. ఎందరో కాచుకున్నారు. నీమూలాన్ని అలస్యమవుతూవుంది. తే వరహా.

సుబ్బ: వరహా ఎక్కడనుంచి తేనుండి. నన్ను తాకట్టు పెట్టితేగాని రాదండి.

శిష్యు: అప్పుడు వెళ్ళిపో.

సుబ్బ: మరేశండి! అయితే మా అత్తయ్యకు వైకుంఠం లేనట్టేనా అండి—చాలాబత్తిగా వుండేదండి-బుజాలు కూడా కాల్చుకోవాలని పెయత్నం చేసిందండి.

శిష్యు: ఏం చెయ్యగలం. తప్పకుండా నరకానికే వెళ్ళు తుంది.

సుబ్బ: ఏం శెయ్యమంటారండి... ... రేపో మాపో అంటే ఇచ్చుకుంటానండి.

అచా: (శిష్యుని పిలిచి చెవులో చెప్పుతాడు)

శిష్యు: ఆచార్యులవారు నీమీద కనికరించి సెలవిచ్చారు. విను, ఈరోజు దహనం చేసేయి. రేపు వరహా ఇస్తే అత్మ వైకుంఠం వెళ్లేటట్టు ఏర్పాటు చేస్తారు.

సుబ్బ: దండాలు బాబు దండాలు. ఎలాగైనా ఇప్పించుకుంటాను. వరహా రేపో ఎల్లుండో—అయితే అంతవరకు

మా అత్తయ్య ఆత్మ నరకానికి ఎల్లకుండా ఆపుచేస్తారు కదండీ ?

శిష్యు: అలాగే... వెళ్ళు. (సుబ్బయ్య వెళ్ళిపోవును.)

ఆ తరువాత కొందరు టిక్కెట్లు కొనుక్కొంటారు.

రామా: (ఇంతలో ప్రవేశం: రామారావు. చేతిలో ఒక తాటాకు.) భక్తులారా ! వినండి, వినండి. ఎంత విచారకరమైన వార్త తెలపవలసి వచ్చింది! ఇప్పుడే నేను వీధిలో వెళ్ళుతూవుంటే అకస్మాత్తుగా ఎక్కడ నుంచో ఈ తాటాకువచ్చి నా ఎదట పడింది. తీసి చదివితే వైకుంఠంనుంచి ఆచార్యులవారికి వచ్చినట్లు ఏర్పడ్డది. కాని, అయ్యో ! చెప్పడానికే నోరు రావడంలేదు. మనకును మన ఆచార్యుల వారికిని రేపటితో ఋణం తీరిపోయింది.

రంగడు, ఇతరులు : హా ! హా ! హా ! ఎందుకయ్యా, ఎలాగయ్యా.

రామా: చదువుతా వినండి.

'శ్రీ వేదాంత వేద్యులైన తిరుమంగాచార్యులవారికి వైకుంఠంనుంచి శ్రీ హయగ్రీవాచార్యులు, ఉభయ కుశలోపరి. తమరు భక్తి శ్రద్ధలతో ఇన్ని రోజుల నుండి పంపుచుండిన ఆత్మలు భద్రముగా చేరినవి. వైకుంఠంలో చోటు చాలకున్నది. అదీగాక తమరు ఇక్కడికే వచ్చేసినచో బాగుండునని, రేపటి దినము, అనగా ఆషాఢ శుద్ధ దశమినాడు పన్నెండు ఘంట

లకు అనగా సూర్యోదయాది 5 ఘడియలు 25 విఘడియలకు తమకు పరమ పదము చేకునట్లుగా విధింపబడినది. ఆబాల గోపాలము వైకుంఠమంతా నిరీక్షిస్తూ ఉన్నది'

ఆహా ! మన మెంత దరిద్రులము.

వెంకట్రావు: మనమే దరిద్రులము. ఆచార్యులవారు ధన్యులే. వైకుంఠంలో ఉండవలసినవారు కర్మవశాత్తు ఈ పాపలోకంలో ఇన్నాళ్ళు ఉన్నారు. ఇక రేపే మోక్షం వారికి.

రంగ : రేపే ? రేపే ? ఆహాహా ! ఎంత ఆపత్తు.

అందరూ ఆశ్చర్య చకితులై తమలోతాము మాట్లాడుకొనుచుందురు.

ఆచా: వెంకటేశా ! ఏమిరా ఈ గందరగోళము!

శిష్యు: ఏదీ ! ఆ తాటాకు ఇలా ఇవ్వండి. మా ఆచార్యుల వారు అడుగుతున్నారు.

రామారావు తాటాకు ఇస్తాడు.

శిష్యుడు ఆచార్యుల కందించును. ఆచార్యులు చదువుకొని ఏమీ తోచక ఊరుకుండును.

శిష్యు: ఆచార్యులవారు ఈ విషయమై యోగ దృష్టితో ఆలోచిస్తారు. మీ రందరు సెలవుతీసుకొని వెళ్ళిపొండి.

రామా: అలాగే వెళ్ళిపోతాం. రేపుమధ్యాహ్నం అందరమూ ఆఖరు దర్శనానికి వచ్చి, ఆచార్యులవారి నిర్యాణాన్ని సేవించి పవిత్రుల మవుతాము. రండి – రా, రండి. (అందరు వెళ్తారు)

ఆచా: (అందరు వెళ్ళిన తరువాత) ఒరే! చాలా ప్రమాదం వచ్చిందిరా. ఆ టక్కరి ముండాకొడుకులు జేసిన పనిరా. ఈ పల్లెటూరువాళ్ళు వట్టి మూర్ఖులు. మన దొంగతాటాకుల్ని ఎలా నమ్మినారో అలాగే వాళ్ళ తాటాకుకూడా నమ్మినారు. ఈ సమస్య కేమిటి విడుపు? ఎంత అవస్థలో పడ్డాం!

వెంకటేశం: గురూజీ! నాకొక తమ్ముడున్నాడు. (వాడిచేత-చెవులో ఏమో చెప్పును.)

ఆచా: అచ్ఛా... నీ తెలివికి సాధ్యంకానిది లేదురా. నీవు లేకపోతే నేనేమైపోయేవాడినో! (భుజం తట్టును.)

వెం.శం: (నడుములోనుండి బీడీ తీసి వెలిగించును)

## రంగము ౨ - మరునాడు

అదే గది. తెరవేసివుంటుంది. తెరముందు పల్లెటూరువాళ్ళు గుమిగూడి కూర్చున్నారు. రంగడు, వెంకడు, ఇత్యాదులు. రామారావు, వెంకట్రావు కూడా ఉన్నారా గుంపులో.

రంగ: రామారావుగారూ! మీ చేతికి తగిలించుకున్నారే అందులో ఎంత గంటయిందండీ...

రామా: పదకొండు దాటింది.

వెం.వు: ఇంకొక గంటలో ఆచార్యులవారు ఈ దేహం వొదిలి వైకుంఠం చేరుకోవాలి. నిర్ణయింపబడ్డ కాలం తప్పుకోడానికి సాధ్యమవుతుందా,

రంగ: ఎలా అవుతుంది. అది బ్రహ్మదేవుడికే సాధ్యంకాని పని.

తెరతీయగా కనపడేవారు ఆచార్యులవారు కండ్లు మూసుకుని - శిష్యుడు, వెంకటేశం, నిలబడి,

వెం.శం:-భక్తులారా ఆచార్యులవారు సమాధిలోవున్నారు. ఇక వారు మన లోకానికి దూరం అయిపోయారు ఒక ఘంటలో వైకుంఠంలో స్వామి తిరువడి గళులలో చేరిపోతారు-మీ కందరికిఇదే ఆఖరుదర్శనం. ఆచార్యులవారు గొప్పయోగీశ్వరులు-వారి మరణం వారిచేతుల్లో వుంటుంది. వారు స్వయంగా ఆత్మ దేహం వదిలేటట్లు చెయ్యగలవారు-

అందరు లేచి చెంపలు వేసుకుంటారు. కొందరు నమస్కారం చేస్తారు. కొందరు కళ్ళు తడిచేసుకుంటారు. రామారావు వెంకట్రావులకు పల్లెటూరివాళ్ళ అమాయకత్వాన్ని చూసి జాలి, ఆచార్యులస్థితిచూసి నవ్వు, ఏంజరుగుతుందో అని వింత.

ఇంతలో వెలుపలినుండి 'ఆగండి, ఆగండి' అని కేకలు.

రంగ : ఎవడురా అది.

ప్రవేశం: వెంకటేశం తమ్ముడు శేషాచలం, పెద్ద తలపాగ పెట్టుకొని, నామాలతో పోల్చడానికి వీలులేకుండా.

శేషాచలం: ఆగండి, ఆగండి! (అని రొప్పుతూ నిలబడును)

వెంకటేశు: ఏమిట్రా ఈగొడవ - ఆగం డేమిటి?

శేషా: అన్యాయంగా నిష్కారణంగా ఈ ఆచార్యుల వారిని మనం దారపోసుకోకుండా ఆగండని–

రంగ: అర్థం కావటంలేదు.

శేషా: ఆ భగవంతుడు పంపబట్టిగాని లేకపోతే–అయ్యయ్యో ఏమైపోయేది ... వినండి నేనూ ఇక్కడికే వస్తున్నా– అకస్మాత్తుగా ఒక పెద్ద గరుత్మంతుడు 'కృష్ణా కృష్ణా' అంటూ ఆకాశంలో ఎగురుతూవచ్చి నాఎదుట సరీగా ఈతాటాకు పడవేశాడు. (అని బొడ్డునుంచి తాటాకు తీసి) దీన్ని ఎత్తుకొని చూచేసరికి ఆ గరుత్మంతుడు మాయమైపోయాడు... ...గుండెలు కొట్టుకొంటూ చదివాను — హా! ఏమిచెప్పను. ఎంతమోసం! ఇదిగోనండి శిష్యులుగారూ! విూరే చదివి చెప్పండి– ఆలస్యమవుతుంది—

వెం–శం: (అందుకొని) శ్రీ వేదాంత వేద్యులగు తిరుమంగాచార్యుల వారికి వైకుంఠం హయగ్రీవాచార్యులు తెలియజేయు ముఖ్య విషయము. ఖర విఖరులనే ఇద్దరు రాక్షసులు మనుష్య రూపంతో రామారావు, వెంకట్రావుఅనే పేర్లతో సంచరిస్తూ వైకుంఠం నుంచి వచ్చినట్లుగా దొంగచీటీలుసృష్టించి లోకుల్ని మోసపుచ్చటానికి ప్రయత్నం చేయుచున్నారు. తమబోటి భక్త శిఖామణులను ఆత్మహత్య చేసుకొనునట్లుగా

కుట్రలు పన్నుతున్నారు. మీవిషయంలో అటువంటి ప్రయత్నంచేసినారని తెలిసింది. జాగ్రత్త! అట్టి కుతంత్రాలకు మోసపోవలదు...

అందరు నిశ్చేష్టు లగుదురు.

ఆచా: (కండ్లు తెరిచి) నా యోగదృష్టిలో అదియే నాకును తెలిసినది. అయుగో! ఖర విఖరులు? — రామారావు, వెంకట్రావు—అనే పేర్లతో-హా హా హా హా!

రామారావు, వెంకట్రావులకు విస్మయంతోపాటు భయంకూడా కలుగుతూ వుంది. రంగడు మొదలుగా అందరి దృష్టులు వారిపైనే.

రంగ: ఇంకా ఊరుకుంటా రేమిట్రా—హతం చేయక — పట్టండి—

రామారావుని, వెంకట్రావుని పట్టుకుంటారు. వా.. తప్పించుకొని గది తలుపు దాటి పరుగిడుతారు.

వెంకడు: పదండి. పట్టుకుందాం. ఎక్కడి కెళ్ళగలరో చూస్తాం—

అని కేకలు వేసుకుంటూ అందరూ వెంబడిస్తారు. కొంత సేపటికి ఆచార్యులు, వెంకటేశం, శేషాచలం తప్ప ఎవ్వరూ ఉండరు. శేషాచలం కడుపు పగల నవ్వుతూ వుంటాడు.

ఆచా: చాలులే నవ్వు—అబ్బ! గండంగడిచింది. అయినా ఈ వూళ్ళో ఇంక ఉండడం తగదు. — ఇంకో మజిలీలో మకాం చెయ్యాలి. ఏం వెంకటేశం?

వెం-శం: (బీడీ వెలిగిస్తూ) ఊః.—

శేషా: అంతేగాదు, వైకుంఠాచార్యుల్ని నిజంగా, వైకుంఠానికి పంపేసి—సదాశివ బ్రహ్మంగా మారిపోండి. మన హెడ్ ఆఫీస్ కైలాసానికి మార్చేద్దాం.

---

## పాత్రలు :

బ్రహ్మానందం

ప్రభ ... బ్రహ్మానందం భార్య

సత్యం<br>మోహనరావు } బ్రహ్మానందం స్నేహితులు

కృష్ణారావు ... డాక్టర్

---

# పరకీయ

## రంగము - ౧

ఏలూరులో బ్రహ్మానందం ఇంట్లో గది. ఇంగ్లీషులో చెప్తే డ్రాయింగు రూము అనవచ్చును. మధ్యన బల్ల. చుట్టూ నాలుగు కుర్చీలు. బల్ల ఎందుకైనా ఉపయోగించుకోవచ్చును. కాఫీ, టీ పుచ్చుకోటానికి, పేకాట ఆడుకోటానికి, ఉత్తరాలవీ వ్రాసుకోవటానికి, పుస్తకాలు, పత్రికలు పడేయటానికి—ఒకమూలమంచం. ఇంకొకమూల ఇంటిలోపలికి వెళ్ళటానికి తలుపు. రంగం కుడివైపున వీధిలోకి వెళ్ళటానికి తలుపు. బ్రహ్మానందం, సత్యం మాట్లాడుతూ కూర్చున్నారు. బ్రహ్మానందం ఏలూరులో స్కూలు మాస్టరు. ౫౦ ఏళ్ళవాడు. అవయవాలలో ఏమీ లోటు కనిపించదు గాని ముఖంలో తేజస్సు లేదు, ఆరిపోయిన పొయ్యిలాగ ... సత్యంకూడా ఆ వయస్సువాడే. లోకజ్ఞానం కలవాడుగా కనబడతాడు. చర్మం గట్టిపడింది. మద్రాసులో ఏదో కంపెనీ ఏజెంటు. పనిమీద ఏలూరు వచ్చాడు. సిగరెట్టు తాగుతున్నాడు.

బ్రహ్మానందం: అయితే సత్యం, ఏలూరు వచ్చి మూడు రోజులైందన్నమాట. ఇప్పటికి జ్ఞాపకం వచ్చావన్నమాట.

సత్యం: కాదురా. వచ్చిన రోజు చాల అలసిపోయి ఎక్కడా కదలబుద్ధి వెయ్యలే. నిన్న పని ముగించుకొని ఇక్కడికే వస్తామనుకొని బయలుదేరాను. దారిలో హఠాత్తుగా మోహనరావు కనబడ్డాడు. చూచి చాలా

కాలమైందికదూ. హలో అంటే హలో అనుకున్నాము. యెంత కాలానికి కలుసుకున్నాం అని అన్నాను. అనగానే వాడు అవున్రా, ఇది సుదినం. కనుక ఉచితరీత్యా గౌరవించాలి సంతోషంగా. రా. నాకు ఆకలి అవుతూవుంది. హోటల్లో పార్టీ చేద్దాం. అని, నా అడుగులు తిప్పివేసి లాగుకొని వెళ్ళాడు. అంత అమాయకంగా అడుగుతూవుంటే ఎలా అడ్డు చెప్పను. సరే, హోటల్ – ఆ సైని బాతాఖానీ–ఈ రోజు విఘ్నం లేకుండా పెండలకడే వచ్చేశాను. స్కూలు సెలవుకదాఅని.

బ్రహ్మ: అరే! మోహన్ ఈ వూళ్లో వున్నాడా. ఉండి కూడా ఒక్కరోజైనా మా యింటికి వచ్చాడు కాదే—అంత స్నేహంగా వుండేవాడు.

సత్యం: ఈ వూళ్లో వున్నాడంటే, నిన్న ఉన్నాడు. ఈ రోజు ఉంటాడేమో — వాడికి నిలకడ కూడానా. పదిరోజు లొకటే ఊళ్లో వుండవలసివస్తే ప్రాణత్యాగం చేసుకొంటాడు.

బ్రహ్మ: ఒక్కరోజు అయితే మాత్రం! నాకు ఈ ఊళ్లో ఉద్యోగమని తెలుసునే. మూడు మాసాల క్రితం తన ఖండకావ్య సంపుటి నాకు పంపాడే?

సత్యం: (ఆలోచించి) నీకు వివాహమైంది, తెలుసునావాడికి.

బ్రహ్మ: తెలియకేం? అసలు నా భార్యది కూడా బందరు, వాడి ఊరే.

సత్యం: అయితే నాకు ఒక కారణం స్ఫురిస్తూ వుంది. భార్యతో సుఖంగా నీవు గౌరవంగా కాపురం చేస్తు న్నావు కదా, ఎందుకు తిరగలాటివాడు మర్యాదస్తు లింటికి రావడం అని మానివేసివుంటాడు.

బ్రహ్మం: ఏమిటోయి విపరీతంగామాట్లాడుతున్నావు. వాడికి తాగడం అలవాటు మనం కాలేజీలో వున్నప్పుడే ఉండేది. అంత మాత్రానికేనా...

సత్యం: (నవ్వి) అయితే నీకు వాడి చరిత్ర అంతా తెలియ దన్నమాట. వాడికి పెండ్లి అయింది తెలుసూ.

బ్రహ్మం: (తెలియదని తల ఆడించును.)

సత్యం: చిన్నప్పుడే అయింది. కాపరానికి వచ్చిన మూడో రోజే భార్యతో చెప్పాడు 'నీతో జీవితం నాకు మృత్యువుతో సమానం, నీవేమీ తప్పు చెయ్యలేదు, వీలుంటే నీవు ఇంకొకర్ని వివాహం చేసుకోవడం నాకు సమ్మతమే – నా ఆస్తి కావలిస్తే నీకు రాయ మని నాన్నగారితో చెప్తాను' అని అలాగే తండ్రితో కూడా చెప్పి, నెల తిరగకముందే నిశ్శంకవారి కోడల్తో లేచిపోయాడు. వాడి తండ్రి, శుద్ధ ఛాంద సుడు మండిపడి ఆస్తిలో సగం కోడలికిచ్చి, ఇంకొక సగం ట్రస్టీలకు వప్పచెప్పి మాసానికి వంద రూపా యలు కొడుక్కు ఇప్పించవలసినదిగా విల్లు వ్రాసి, పాపం, స్వర్గం చేరుకున్నాడు.

బ్రహ్మం: ఎంత గ్రంథం. అయితే మోహన్ ఇప్పుడు ఆవిడతోనే...

సత్యం: అదృష్టవశాత్తు ఆవిడ త్వరలోనే చచ్చిపోయింది. ఎంతకష్టపడ్డదో! అఖండమైన ఆనందం అనుభవించిందంటాడు వాడుమాత్రం...

బ్రహ్మ: ఆ తరువాత ?

సత్యం: నిరంతర సంచారం. హోటల్లో భోజనం, స్టేషన్లో పడక – చేతులో డబ్బుంటే బ్రాందీషాపు, లేదా సానికొంప – వాడు మర్యాదగా కాలం గడుపుతున్న నీయింటికి వస్తే నీ వేమనుకుంటావో అని జంకితే ఆశ్చర్య మేముంది.

బ్రహ్మ: జీవనోపాయం ?

సత్యం: చెప్పలేదూ ? తండ్రి విల్లుప్రకారం ప్రతిమాసం 100 రూపాయలు ట్రస్టీలు ఇస్తారు. ఆ వంద రూపాయలు ఏ పదిరోజుల్లోనో ఖర్చుఅయిపోతవి......ఆ తరువాత జీవితం నిరంతర సమస్య......ఎలాగో ఒకలాగు పూర్తిఅవుతూ వుంటుంది. నిన్న నాతో హోటల్లో తిన్నాడా, మళ్ళీ యింతవరకు పస్తుండినా ఉండవచ్చును. తిక్కతిరిగితేమాత్రం అద్భుతంగా వ్రాస్తాడు... అలాంటివాడికి మన సంఘంలో చోటు ఎక్కడా కనబడదు......ఏం ఆలోచిస్తున్నావు?

బ్రహ్మ: ఎంత బ్రిలియంట్‌గా వుండేవాడు, జాలివేస్తోంది– కొద్దిగానో గొప్పగానో సంసారం చేసుకుంటూవుండి బాల్యస్నేహితుడు పస్తుంటే సహించలేనురా. సత్యం ఎక్కడుంటాడో ఇప్పుడు.

సత్యం: దృష్టంగా చెప్పలేను. ఎందుకు ?

బ్రహ్మ: నేను హోటల్‌కు వెళ్ళడం బాగుండదు. వాడిని ఇక్కడికి తీసుకొనివచ్చావంటే కడుపునిండా టిఫిన్, కాఫీఇచ్చి పంపిస్తాను. నాకు తృప్తిగా వుంటుంది.

సత్యం: ప్రయత్నిస్తాను. (లేచి) కానీ మీఆవిడ ఏమంటుందో ఆలోచించావా?... ...పతివ్రతఅంటే ఆవిడే అని అంటూవుంటుంది కోడలితో. మా అమ్మ... ఇటువంటి దుర్మార్గుణ్ని తన గడప ఎలా తొక్కించారంటుందేమో ? పై పెచ్చు తప్పు నామీదికే వస్తుందేమో ?

బ్రహ్మ: అలాటి భయం నాకు లేదు. నా యిష్టమే ఆవిడ యిష్టము.

సత్యం: (నవ్వుతూ, రాగం తీస్తూ)

తనువులు రెండైన మనసు- ఒకటి ఏం... నాకు ఆకలిగానే వుంది. (నిష్క్రమించును)

బ్రహ్మ: (కొంతసేపు మౌనంగా ఆలోచిస్తుంటాడు)

ప్రవేశం: ప్రభ, బ్రహ్మానందం భార్య. అసలు పేరు ప్రభావతి. కాని అందరూ ప్రభా అనే అంటారు. చామన చాయ, ఏండ్లు ఇరవై అయినా ఎంతో కాలం కాపురం చేసిన ఇల్లాలు తరహా ఉంది. పెద్ద కళ్ళు. ఆ కళ్ళల్లోకి ఏకాగ్రంగా చూస్తే ఎంతో లోతుగా కనిపిస్తవి. కాని అలా చూడనివ్వదు. భర్త కూడా చూచి ఎరుగడు. చూడనివ్వదేమో!

ప్రభ: ఏమిటండీ ఆలోచన.

బ్రహ్మ: ఆఁ ఆలోచనా-నిన్ను గురించే.

ప్రభ: (నవ్వి) నిజంగా? నన్ను గురించి మీ రెప్పుడైనా ఆలోచిస్తారనుకో లేదనుకుంటే, అంటే జబ్బుగా ఉన్నప్పుడు తప్ప.

బ్రహ్మం: అంటే?

ప్రభ: అబ్బే! ఆశ్చర్యం ఏమీ లేదండీ. రోజూ పండుకునే మంచం గురించి మనం ఆలోచిస్తామా చూడండి. దాంట్లో ఏదైనా లోపముంటే అప్పుడు ఆలోచిస్తాం మరమ్మత్తు చేయిస్తామా, పారేసి కొత్తది కొను క్కుంటామా అని. అలాగే – (ప్రభ మాట్లాడుతూ ఉన్నా ఏదో పని చేస్తూనే వుంటుంది, బల్లమీద వస్తువులు సర్దుతూ, గోడమీద క్యాలెండరు తేదీ మారుస్తూ. పనికిరాని కాగితాలు బుట్టలో వేస్తూ–)

బ్రహ్మం: పొరబడ్డావు నిజంగా నిన్ను గురించి దీర్ఘాలోచనలో పడ్డాను.

ప్రభ: గుండె కొట్టుకొట్టుకుంటూ వుందండి, ఏమిటో చెప్పే ద్దురూ.

బ్రహ్మం: నాతో చదువుకొనేవాడు మోహన్‌రావు, ఎరుగు దువు కదూ? అసలు మీ వూరే కాబోలు.

ప్రభ: (ఉలికిపడి, మళ్ళీ సర్దాయించి) ఆఁ.

బ్రహ్మం: చాలా తెలివైనవాడు. కళారాధకుడు, కవి.

ప్రభ: పత్రికల్లో ఎప్పుడైనా చూస్తుంటాను ఆయనపద్యాలు– కానీ, ఎందుకీ భోగట్టా.

బ్రహ్మ: వాడి ఉత్తర గాథంతా తెలుసునా నీకు, భార్యను వదలిపెట్టడం, ఎవరితోనో లేవదీసుకుపోవడం, తాగడం, తిరగడం - విపరీతమైపోయింది వాడి జీవితమంతా, ఎంతో ముందుకు రావలసినవాడు. వట్టి పోకిరీ అనే పేరు సంపాదించుకొన్నాడు ... పాపం (తలుపు) ప్రభా! నేనుకూడా అలా అయిపోతానేమో అని నీకు భయం వేస్తోందా?

ప్రభ : లేదు.

బ్రహ్మ: ఏం, ఎందుచేత?

ప్రభ : (కొంచెం విసుగుతో) దుర్మార్గంగా వుండాలంటే మాత్రం అందరికీ సాధ్యమవుతుందటండీ.

బ్రహ్మ: (లంపకాయ తిన్నట్లు ఉక్కిరిబిక్కిరై, మళ్ళీ సద్దుకొని) మోహన్ ఇప్పుడు ఈవూళ్లో వున్నాడట.

ప్రభ : (కోపంతో) చాల్లెండి ఈ గొడవ. (శాంతించి) ఇదేనా నన్ను గురించి మీ ఆలోచిస్తూ వున్నది.

బ్రహ్మ: తొందరపడితే ఎలాగు?

ప్రభ : క్షమించండి

బ్రహ్మ: సత్యాన్ని పంపించాను, మోహన్ కనబడితే మన యింటికి పిల్చుకొని రమ్మని, ఏదో ఇంత టీ ఇచ్చి బాతాఖానీ కొడదామని. నీవు ఆక్షేపిస్తావేమోనని ఆలోచనలో పడ్డాను. సత్యంకూడా అన్నాడు 'మీ ఆవిడ ఆక్షేపిస్తుందేమోనా' అని. అంటే నేనన్నాను

ఆ భయం లేదు. నా యిష్టమే ఆవిడ యిష్టమ'ని. దేవిగారు ఏమి సెలవిస్తారు.

ప్రభ : మీరే అన్నారుగదండీ. ఇక మళ్ళీ నన్నడగడం ఎందుకూ ? మీరు మీ స్నేహితుల్తో టీ పుచ్చుకొని కాలక్షేపంచేస్తే నాకేమి అభ్యంతరం ఉంటుందండీ.

బ్రహ్మ: బ్రతికాను ... (కొంతసేపు ఇద్దరూ మాట్లాడరు) ప్రభా ! బందరులో వున్నప్పుడు తాగేవాడుటకదూ. మరీ ఎక్కువై పోయిందట వెధవ అలవాటు.

ప్రభ : (పలకదు)

బ్రహ్మ: నిశ్శంకవారి అమ్మాయి నీకు తెలుసునుగదూ, — నానాపాట్లు పడిపోయింది. అప్పటినుంచీ ఏ సాని దొరికితే అదే అంటారు ... ... వాడి తండ్రి ఎంత ఛాందసుడు – ఎంత ఆచారపరాయణుడు, అలాంటి ఆయన కొడుకు ఎందుచేత ఇలా పరిణమించాడో పాపం. (నాతి ప్రకాశంగా) అందుచేతనేమో... ... ఇక లోపలికి వెళ్ళాలండి. బోలెడు పనులున్నా యండి.

నిష్క్రమిస్తుంది. బ్రహ్మానందం లేచి పచారు చేస్తాడు. లోపలికి వెళ్ళి ఒక క్రొత్త టేబుల్ క్లాత్ తీసుకువచ్చి బల్లమీద పరుస్తాడు. కుర్చీలు మూడు చుట్టూవుంచి ఇంకొక కుర్చీ దూరంగా మంచం దగ్గిర వేస్తాడు. మళ్ళీ ఏమనుకున్నాడో దాన్నికూడా బల్లదగ్గిరే వేస్తాడు.

ఇంతలో ప్రవేశం: సత్యం.

బ్రహ్మ: అరే ! ఒంటరిగా వచ్చావేమీ, మోహన్ పరారీ అయ్యాడా ?

సత్యం: (విచారంగా) కాదు ఈ వూళ్ళోనే ఉన్నాడు. కాని ఇక్కడికి వచ్చే స్థితిలో లేడు.

బ్రహ్మ: జబ్బుగా వున్నాడా?

సత్యం: ఆఁ. జబ్బంటే జబ్బే. కారణం అమితంగా తాగడం. మన స్మరణలో కూడా లేడు. చూచి పలకరిస్తే ఆనవాలు పట్టలేడు-వెర్రిచూపులు, మాటలు, లేదా కళ్ళు మూసుకుంటాడు - ఒళ్ళంతా వేడిగా ఉంది, జ్వరం వచ్చినట్లు-నాకేమీ తోచకుండా వచ్చేశాను. పూటకూళ్ళమ్మ ఇంట్లోనే వున్నాడు.

బ్రహ్మ: ఎలా జరిగింది ఇదంతా?

సత్యం: శుద్ధ అమాయకుడవు బ్రహ్మం. నీకర్థంకాదే ఇలాటి వాళ్ళ చర్యలు. ఏ పత్రికవాళ్ళో పంపించివుంటారు డబ్బు. అంతే - పైసా అయిపోయేవరకు తాగి వుంటాడు.

బ్రహ్మ: ఎలా మరి.

సత్యం: డాక్టర్ చూడాలి ఒకటి. ఎక్కడైనా మంచిచోట్లో ఉంచి సంరక్షించే ఏర్పాటు చెయ్యాలి రెండు. పాపం చూస్తే జాలిగావుంది. ఇది మావూరైతే మాయింటికే తీసుకువెళ్ళేవాడివి గాని రైల్లో ఎక్కే స్థితిలో లేడు.

బ్రహ్మ: ఈ యింటికే తీసుకొస్తే...

సత్యం: అంతకన్నానా...

బ్రహ్మ: బండిచేసి తీసుకొనిరా.

సత్య: మరి లేకపోతే మోసుకొనిరావాలి. మంచం సిద్ధం చేయించు.

బ్రహ్మ: ఆఁ ఆఁ (గట్టిగా) ప్రభా! ప్రభా!

సత్యం వెళ్ళిపోతాడు.

ప్రవేశం: ప్రభ మనిషితో.

ప్రభ: తెమ్మంటారా టీ (అని ఎవరూ లేకపోవడం చూచి) మీకొక్కరికేనా టీ?

బ్రహ్మ: చూడు ప్రభా! మోహన్ చాలా ప్రమాదకరమైన స్థితిలో వున్నాడట. సత్యం చూచివచ్చాడు. జ్వరం. మన స్మరణలో లేడట. పాపం వెధవ అలవాటు. అదీ ఒకరకమైన ఉన్మత్త జాడ్యమే కదూ!

ప్రభ: తాగుడా?

బ్రహ్మ: ఊఁ. నాకు చాలా జాలివేసింది ప్రభా. వాడికీ వూళ్ళో నా అన్నవాళ్ళు లేరు.

ప్రభ: సరే. వెళ్ళి చూచిరండి. టీ తేనా. పుచ్చుకొని వెళ్ళండి.

బ్రహ్మ: మళ్ళీ నేను చూడడం ఎందుకు. మన యింట్లోనే ఉంచుకుంటే ఒళ్ళు నయమయ్యాక వెళ్ళిపోతాడు.

ప్రభ: (కఠినంగా) ఎంతమాత్రం వీలుకాదండి.

బ్రహ్మ: (విస్మయంతో) ఏఁ?

ప్రభ: కావలిస్తే హాస్పటల్లో చేర్పించండి. ఎక్కడైనా ఉంచండి.

బ్రహ్మ: ఏమిటి ప్రభా! ఇలా మాట్లాడుతున్నావు. పని మనిషిని రాత్రి ఇక్కడే పండుకొమ్మన్నాను, ఒక్క పూట. నేను కొంచెం నయమైనా పంపించేస్తాను, కష్టంగా వుంటే నీకు.

ప్రభ : (కాఠిన్యం పోయింది. దీనంగా, బతిమాలుతున్నా నండి. వద్దు. వద్దండీ వద్దు. నా మాట వినరూ? వెళ్ళి రండి. డబ్బిస్తే ఎవరైనా చూచుకుంటారు. అన్ని సదుపాయాలు ఏర్పాటు చెయ్యండి. సత్య నారాయణగారు కూడా ఉన్నారుకదా, ఆయనకి లోక వ్యవహారాలన్నీ బాగా తెలుసును.

బ్రహ్మ: (కోపంతో) నాకూ తెలుసును. నేను వట్టి చవట పెద్దమ్మనుగాను ఏమనుకున్నావో. బడిపంతులినైనా నా యింటికి నేనే యజమాన్ని. ఇది నా యిల్లు, నా వాకిలి.—నా యింట్లో నా స్నేహితుణ్ణి ఒక రోజు ఉంచుకోడానికి నా కధికారం లేదా. మహా పతి వ్రతవని ప్రఖ్యాతి గడించినదానవు నాకా అధికారం లేదంటావా?

ప్రభ : (అతి దీనంగా) రామ రామ. అంతమాట అంటానా నోటితో—నేను బ్రతిమాలుకొన్నాను—అంతే. భర్తను బతిమాలుకోడానికిసహా భార్యకు అధికారం లేదా. వేడుకొంటున్నాను - ఈ పని మానరూ?

బ్రహ్మ: మళ్ళీ మొదలుకే వచ్చావూ? మానను. ముమ్మాటికీ మానను—నీవు గంటసేపు వాదించినా, ప్రార్థించినా మానను.

ప్రభ: (నిరాశతో) సరే—నా చేతనైనంతవరకు ప్రయత్నించాను. నామాట విన్నారుగాదు - ఇంక నేనేమి చెయ్యను మన కర్మ అనుకుంటాను.

బ్రహ్మ: ఏమైనా అనుకో. సత్యాన్ని అప్పుడే పంపించాను, తీసుకురమ్మని. డాక్టర్ కూడావస్తాడు...ప్రభా! నీకిష్టం లేని కార్యం అని అశ్రద్ధచేయవుగదూ—

ప్రభ: అంతమాత్రం నమ్మకం లేదా?

బ్రహ్మ: (భుజంమీద తడుతూ) ఎందుకు లేదూ—మాటవరసకి అన్నానుగాని... మరి కానీ, ఆమంచంమీదే పడుకో పెడదాం.

ప్రభ: అలాగే... (అని లోపలికి వెళ్ళి తలగడలు, దుప్పటి, తెచ్చి పడక తయారుచేస్తుంది.)

బ్రహ్మానందం బల్ల ఒకమూలకు లాగి,
కుర్చీలు రెండు మంచందగ్గర వేస్తాడు.

సత్యం, బండివాడు చెరి ఒకప్రక్క పట్టుకొని మోహనరావును లోపలికి ప్రవేశపెడతారు. మోహన్ కళ్ళు మూతలుపడి ఉంటాయి. జుట్టు, నల్లని పొడుగాటి జుట్టు చిందరవందరగా నుదుటిపై పడిఉంది. కోలమొహం, కోటేర్చినముక్కు, లావు కనుబొమలు. చెక్కిళ్ళుపలుచనే, కాని ఎండిపోయినట్లున్నవి. పెదవులు మాటిమాటికి వంకరగా తిప్పుతుంటాడు. సన్నని జుబ్బా, లాగూ కొంచెం మాసినవి.

సత్యం: బ్రహ్మం! ఆ మంచం ఖాళీదేనా?

బ్రహ్మం: (చకితుడై చూస్తూ) ఆఁ. (అని తలఊపుతాడు)

సత్యం బండివాడు మోహన్‌ని మంచంమీద పడుకోబెడ తారు. ప్రభ లోపల్నించి శాలువా తెచ్చి కప్పుతుంది.

బండివాడు: నే వెళ్ళనా బాబు?

సత్యం: (బాడుగ ఇచ్చి) వెళ్ళు. దారిలో డాక్టర్ని మళ్ళీ హెచ్చరించి పో.

బండి: చిత్తం. (వెళ్తాడు)

సత్యం, బ్రహ్మం ఒకర్నొకరు చూసుకుంటారు. మాట్లాడకుండా ఆవెనుక ఇద్దరు మంచంవంక చూస్తారు. ప్రభ, మోహన్ చెదిరిన జుట్టు సరిచేస్తుంటుంది.

ప్రభ: (నుదురు పట్టి చూచి) అబ్బ! ఎంత వేడిగా ఉంది. జ్వరం బాగా కాస్తోంది. ఉడుకులాంలో ముంచి చేతిరుమాలు నొసలుమీద వెయ్యనాండి; మంచి దంటారు.

ఎవ్వరు జవాబు చెప్పరు. ప్రభ వెళ్ళి రుమా లుతో తడిపి తెచ్చి నుదురుమీద వేస్తుంది.

ఇంతలో డాక్టర్ కృష్ణారావు వస్తాడు.

కృష్ణారావు: హలో బ్రహ్మం! గుడ్ ఈవినింగ్ సత్యం.

బ్రహ్మం: డాక్టర్! (మంచంవంక చూపిస్తూ) మోహన్‌రావు మా స్నేహితుడు, ఈ స్థితిలో వుంటే చూచి సత్యం ఇక్కడికి తీసుకొని వచ్చాడు.

డాక్టర్ వెంటనే మంచం దగ్గరికి వెళ్ళి మోహన్‌ని పరీక్ష చేస్తాడు. థర్మామీటర్ పెట్టి చూచి...

డాక్టర్: మరి వేరే జబ్బు ఏమీ లేదు. జ్వరం ఉందిగాని అది ఒక లక్షణమే, అమితంగా తాగడంచేత. సన్నిపాతంకూడా వస్తుంది ఒకప్పుడు. రాత్రి అంతామంచి నీళ్లు తప్పవేరే ఆహారం ఇవ్వకండి-- సత్యం! నాతో రా మందు ఇస్తాను. ఒక డోసు ఇప్పుడు, ప్రొద్దున్నే ఇంకొక డోసు ఇవ్వండి. ఎక్కువగా ప్రేలపం, అదీ ఉంటే నిద్ర పట్టడానికి ఒకస్లీపింగ్ డ్రాఫ్ట్ పంపిస్తాను. ఇవ్వండి. రేపటికి ఆల్‌రైట్‌గా ఉంటాడు. గుడ్ నైట్.

బ్రహ్మ: సత్యం వెళ్ళిరా. (డాక్టర్, సత్యం, వెళ్తారు.)

ప్రభ : (మంచం ప్రక్క కుర్చీమీద కూర్చుంటుంది.)

బ్రహ్మ: (మెల్లగా) ప్రభా!

ప్రభ : ఆఁ.

బ్రహ్మ: మోసేవాడికే తెలుస్తుంది కావడి బరువు. నాకేం! చాలా దయతో ఇంట్లో ఉంచుకుంటానని అన్నాను గాని, పాట్లు పడేదానవు నీవేకదా. నేను ఆలోచించలేకపోయాను. క్షమించు ప్రభా

ప్రభ : అబ్బెబ్బె! మీరు పొరపడుతున్నారండి. ఇంతలో కొంతలో నాకు పని పడుతుందని కాదండీ నేను ఆక్షేపించింది ... ఇదొక లక్ష్యమా నాకు ... మీకు టైఫాయిడ్ జ్వరం వచ్చినప్పుడు ఇరవై రోజులు నర్సు మోస్తరుగా పని చేశాను జ్ఞాపకం లేదూ.

ఈ సంభాషణ జరుగుతూ ఉన్నప్పుడు మోహన్ మూలుగుతూ, గొణుగుతూ, చేతులు కదలిస్తూ, ఉంటాడు. ప్రభ హడావుడిగానే చేతులు పట్టుకుంటుంది.

బ్రహ్మ: కొంచెం నిమ్మళించగానే ఏదో విధంగా పంపిం చేస్తాను.

ప్రభ: ఆయనమాత్రం ఉంటాడంటండీ.

బ్రహ్మ: (జవాబు నచ్చలేదుగాని ఏమనటానికీ తోచక ఊరుకుంటాడు)

ప్రభ: ఏమండోయి, చీకటిపడుతోంది దీపం వెలిగించండి.

బ్రహ్మ: (దీపం వెలిగిస్తాడు) ప్రభా! నీవు మోహన్ని బాగా ఎరుగుదువా?

ప్రభ: అంటే!

బ్రహ్మ: మీ ఊరివాడుకదూ. ఫలానా అని మాత్రం తెలుసునా—లేక పరిచయం ఉందా అని.

ప్రభ: ఎప్పుడైనా మా యింటికి వచ్చేవాడు, మా నాన్న ఆయన్ని పద్యాలు చదవమనేవాడు.

బ్రహ్మ: అవును. బాగా చదివేవాడు, హోటల్లో (బ్ర. ఏదో ఆలోచన, కొంత మౌనం) నిన్నానవాలు పట్టాడా?

ప్రభ: (అపహాసం చేసి) ఆ ప్రశ్నకి నేనెలా జవాబు చెప్ప గలనండీ.

బ్రహ్మ: అవును లే.

సంభాషణ ఆగిపోతుంది. బ్రహ్మానందం పచారు చేస్తూ వుంటాడు. ఇంతలో సత్యం వస్తాడు, రెండు మందు సీసాలతో — సీసాలు బల్లమీద పెడుతూ;

సత్యం: ఇదుగో ఈ సీసాలోమంటు ఒక డోసు ఇప్పుడిస్తే ఇమ్మన్నాడు. ఇంకోడోసు రేపు ప్రొద్దున్న ఇస్తే చాలునట. ఈ సీసాలో ఒకడోసు ఉంది. నెమ్మదిగా నిద్రపోతే ఇవ్వనక్కర్లేదన్నాడు. నిద్రపట్టకుండా, వెర్రిగా మాట్లాడుతూవుంటే ఇమ్మన్నాడు—నిద్ర పోవడాని కనుకుంటా.

ప్రభ: (లేచి మొదటిసీసా తీసుకొని ఒకడోసు ఒక గ్లాసులో పోసి త్రాగిస్తుంది)

సత్యం: ఫస్టుగ్లాస్ నర్సు.

బ్రహ్మ: ఆలస్యమైంది. వెళ్ళిపో సత్యం.

సత్యం: రేపు మార్నింగ్ ట్రెయిన్లో వెళ్ళిపోవాలి. సెలవు. మోహన్ సంగతి వ్రాస్తాను కదూ.

బ్రహ్మ: ఆ. (సత్యం వెళ్ళిపోతాడు)

ప్రభ : వెళ్ళి భోజనం చేసిరండి.

బ్రహ్మ: నీవో?

ప్రభ : ఉపవాసం ఉండనులెండి. ఎవ్వరూ లేకుండా ఎలాగండి, తరవాత నేను భోజనం చేస్తాను ... మీరే వడ్డించుకుంటారుగదూ.

బ్రహ్మ: ఓ ... (లోపలికి వెళ్తాడు)

ప్రభ : (వీధి తలుపు గొళ్ళెంపెట్టి వస్తుంది.)

రంగస్థలంమీద దీపాలన్నీ ఆర్పి, మళ్ళీ వెలిగించవలెను, కొన్ని గంటల తర్వాత అని సూచించడానికి.

అర్ధరాత్రి. మోహన్ మాత్రం మంచంమీద పడుకున్నాడు. ఇంకెవ్వరూలేరు.
మొదట అస్పష్టంగా మాటలు వినపడుతాయి. తర్వాత స్పష్టంగా, బిగ్గరగా.

మోహన్: అబ్బ! దాహం——దాహం——జ్వాల-రక్తజ్వాల-
హోమకుండంలో రక్త ధార, రక్త జ్వాలలు... ఎర్ర
నాలుకలు —— మంట రక్తం అబ్బా! బాధ ——

కండ్లు తెరిచి తేరి చూస్తుంటాడు.

ప్రవేశం: ప్రభ. కేకలు విని వచ్చింది. నిద్రపోతున్నట్లు
కనపడదు. మంచం సమీపించి నిలబడుతుంది.

మో : (కండ్లు గట్టిగా మూసుకొని) చూడు ఏమిచేశారో
రాక్షసులు——ప్రభా!

ప్రభ : (ఉలికిపడుతుంది.)

మో : నా గుండెల్లో పొడిచేశారు. ప్రభా! హృదయేశ్వరీ!
ఇప్పుడు నా హృదయంలో రక్తం లేదు... ధారగా
పోశారు ఆ గుండంలో—అదుగో! అదుగో వాళ్ళని
తరిమేయి ... తరిమేసి ఆ రక్తం నీ చేతుల్తో నా
గుండెల్లో మళ్లీ పోసేయి ... (కండ్లు తెరుస్తాడు.
ఒక్కక్షణం చూపు ప్రభమీద కేంద్రీకరించి) ఎవరు నువ్వు?

ప్రభ : ప్రభను. మీ హృదయేశ్వరిని.

ప్రభ: (వెకిలిచూపుతో వెర్రిగా నవ్వి) రాక్షసీ! నా ప్రభ
చచ్చిపోయింది! నీకు తెలియదు! నువ్వే చంపేశావు
నాకు తెలుసు - పోలీసువాళ్ళతో చెప్పేస్తాను.
(లేవబోతాడు)

ప్రభ: (ప్రయత్నంతో యథారీతి పడుకోబెట్టి) ప్రభ చచ్చిపో లేదు—పడుకోండి.

మో: (మాటలు వినే స్థితిలో లేడు) దాహం! దాహం! దావాగ్ని—జ్వాల! మంట.

ప్రభ: (గ్లాసులో మంచినీళ్ళు తాగిస్తుంది)

మో: వచ్చావా. మళ్ళీ వచ్చావా? బాగా చూడనీ (అని కళ్లు గట్టిగా మూసుకుంటాడు). ఏదీ ముద్దు (ముద్దు పెట్టుకున్నట్లు పెదవులతో శబ్దం చేస్తాడు.) అబ్బ! ఎంత తీపి – సుధ మధురం, మధుమధురం – దధి మధురం – నీ అధరం సుధ రాతి మధురం. (బిగ్గరగా) అయ్యోయ్యో! రాక్షసుడు. నా ప్రభను – బలాత్కారంగా – అబ్బా! ఎంత పోటుగాడి చూపురా– (అని చేతులతో గుండె గట్టిగా పట్టుకుంటాడు)

ప్రభ: (చేతులు విడదీసి, భుజాలు పట్టుకొని) ఎవరూ లేరు. భయపడకండి. పడుకోండి.

మో: (కళ్లు తెరచి) రాక్షసీ, ఇంకా వున్నావూ. నామీద కన్ను వేశావూ? నా ప్రభను ఖూనీచేసి నన్ను పెళ్ళాడుతావు కదూ–పోపో – (అని విదిలించి కండ్లు మూసుకుంటాడు)

ప్రభ: (లేచి, తటాలున ఏదో స్ఫురించినట్లు నటించి, బల్ల మీద ఉన్న ఇంకొక సీసాలో వున్న మందు తాగిస్తుంది)

మో : విషం, విషం. హాలాహలం—పరమేశ్వరుడి కంఠంలో వుండే హాలాహలం. ఎక్కడా దొరికిందయ్యా నీకు డాక్టర్! (కళ్లు తెరిచి) శివుణ్ని చంపేసి ఆ విషం తీసుకొచ్చావుకదూ—ఇంక శివుడు తాండవ నృత్యం చెయ్యడుకదూ - (వెకిలి నవ్వుతో) ఓహ్! మా సుబ్బిగాడుకూడా చేస్తాడు శివతాండవం......అరవ పాటతోకూడా...పాడనా...

'కాళై తూక్కి నిండ్రాడుం దైవమే' ఊగుతా ముక్కలు రావు —— నవ్వుతా పెండుపోరా, నీ తల ముక్కలు ముక్కలు చేస్తాను——కొక్క చెల్చేస్తాను (ఆవులిస్తాడు)

అరే! అలా మేఘాలమీద వెళ్ళిపోతున్నాదేవు ప్రేమా——భామా జ్యోతి స్వేల మహితం - (మళ్ళీ ఆవులింత, కళ్లు మూతలుపడుతున్నవి) ఏ-మి-చల్ల-గాలి (గొణుగుతూ) మన్దం మన్దం...సుదతి పవన శ్వాసకూలో...యథార్థం...(ఆవులింత)గోదావరి కృష్ణవేణి. .అరుణారుణ కేళు-తరుణీమణీ నూపుర ధ్వనులు...వరుణా తరంగిణీ దరిపికస్వర నూత్న కమల కషాయ గంధము వహించి... ...(ఆవులింత) చీకట్లు —గోధూళీ——ధీరసమీరే యమునాతీరే... అదుగో రాధ...రాధా——ప్రభా——(మాటలు నిల్చి పోయినవి. నిద్ర)

ప్రభ : (నుదుటిమీాద జుట్టు వెనక్కుతోసి, తలగడ సవరించి లేచి కొంతసేపు చూచి, మెల్లగా మూరంనుంచే ముద్దుపెట్టుకొని, చప్పుడు చెయ్యకుండా వెళ్ళి పోతూంది.)

మళ్ళీ రంగస్థలంమీాద దీపాలన్నీ ఆరిపోతవి.
మర్నాటి ఉదయం, దాదాపు తొమ్మిదిన్నగ.
మోహనరావు ఇంకా నిద్రపోతున్నాడు.

ప్రభ : (ప్రవేశించి మంచం దగ్గిర నిలబడి నుదురు పట్టి చూస్తుంది. వేడిగా లేదు.)

మో : (మేలుకొంటాడు) ఎవరు? ఎక్కడ? ఎక్కడున్నాను?

ప్రభ : ఇక్కడే. చెప్తానన్నీ మెల్లగా—ఎలావుంది మీాకు?

మో : ఏమీా లేదు. (తల ఆడించి) కొంచెం తలనొప్పిగా వుంది అంతే. ఇది హాస్పిటలా? నువ్వు నర్సువా?

ప్రభ : (నవ్వి) ఒకవిధంగా నర్సునే - ఇది మీా చిన్ననాటి నేస్తం. బ్రహ్మానందంగారి ఇల్లు.

మో: (ప్రభ మాట్లాడుతూవుంటే తదేక దృష్టితో చూస్తాడు. తటాలున ఏదో స్ఫురిస్తుంది. వడిగా) చూడు చూడు. వెంకటశాస్త్రుల్లు కూతురు ప్రభవు కావు నువ్వు.

ప్రభ : అవును. ఇప్పుడు వీరి భార్యను!

మో : ఆఁ. బ్రహ్మాన్ని పెండ్లి చేసుకొన్నావు గనూ— ఎక్కడ బ్రహ్మం?

ప్రభ : స్కూలుకు వేళఅయింది. భోజనంచేసి బట్టలు వేసుకుంటున్నారు. ఇప్పుడే వస్తారు.

మో : బ్రహ్మాం స్కూల్ మాస్టర్ కదూ. వాణ్ని కాలేజీలో వున్నప్పుడే మేము 'మాస్టారండీ!' అనేవాళ్ళం. చాలా మంచివాడుగనూ.

ప్రభ : (మందహాసంతో) బాగుంది. భార్యలను భర్తలకు సర్టిఫికెట్ ఇమ్మంటున్నారా.

మో : చతురత్వం పోలేదింకా (రెప్పవాల్చకుండాచూస్తూ) అరే! చిన్నప్పటికన్నా అందంగా వున్నావు సుమా.

ప్రభ : నాకేం తెలుస్తుంది.

మో : ఆయన చెప్పడూ.

ప్రభ : స్కూలు మాస్టర్లు భార్యల్ని ప్రతిదినం వర్ణిస్తూ వుంటారటండి.

మో : మంచి దెబ్బ. (మెల్లగా లేచి, గోడ నానుకొని కూర్చుంటాడు) రాత్రి అసహ్యంగా ప్రవర్తించి వుంటాను. అయితే ఈ ప్రపంచంలో లేను — క్షమించాలి ... ఆ వెధవ బ్రాందీ మంచి సరుకుగాదు.

ప్రభ : మొఖం కడుక్కొని కాఫీ పుచ్చుకోండి. నీళ్ళు, బేసిన్ పట్టుకొస్తాను —

మో : వద్దు. నేనే లేచి వస్తాను (అంటూ లేవబోతాడు, నీరసంగా)

ప్రభ : వద్దు. వద్దు. నీరసంగా వున్నారు. (అంటూ లేవబోతున్న మోహన్ భుజాలు పట్టుకొని కూర్చోబెడుతుంది. మోహన్ తటాలున తన చేతులతో ప్రభ

చేతులు పట్టుకొని దగ్గిరకు లాగుకొని ముద్దు పెట్టుకుంటాడు.)

మో : పాపంచేశాను.—క్షమించు— నిన్ను బాధపెట్టాను.

ప్రభ : (సర్వం మరిచిపోతూవుంది.) లేదు. లేదు. (అంటూ సమీపించి తన చేతులతో మోహన్ తలపట్టుకొని ముద్దు పెట్టుకుంటుంది. ఆ క్షణంలోనే బ్రహ్మానందం లోపల్నించి వస్తాడు, స్కూల్‌కు వెళ్ళడానికి బట్టలు వేసుకొని. జరిగినదంతా చూడలేదుగాని ఏదో సందేహం హృదయాన్ని అల్లకల్లోలం చేస్తున్నది. పైకి కనబరచడు.)

బ్రహ్మ: మోహన్ లేచాడా ? ఎలా ఉంది.

ప్రభ : (ఖంగారు సర్దుకుంటూ) ఆ:. ఇప్పుడే లేచారు, తల నొప్పిగా వుందట. లేవబోయి పడిపోయారు.

బ్రహ్మ: మోహన్ ! ఇవ్వాళ కొంచెం విశ్రాంతిఅవసరం... మంచంమీదే వుంటే మంచిది.

మో : బ్రహ్మాం, నాకూ విశ్రాంతికీ చాలా దూరం ... అయినా మెనీ థాంక్స్ — అనాథ సంరక్షణ చేసినందుకు—

బ్రహ్మ: నిన్న రాత్రి చాలా చెడ్డ అవస్థలో వున్నట్లు చెప్పాడు సత్యం. తక్షణమే ఇక్కడికి తీసుకొని రమ్మన్నాను.

మో : సత్యం వస్తాడా ఇప్పుడు.

బ్రహ్మ: లేదు. ప్రొద్దున్నే వెళ్ళిపోయాడు.—

మో : మరీమరీ థాంక్సు. కానీ, కాఫీతాగి వెళ్ళిపోతానోయి సెలవిప్పిస్తే.

బ్రహ్మ: నో, నో...(మళ్ళీ ఆలోచించి) పోనీ నేను స్కూల్ నుంచి వచ్చాక చూద్దాం... వెళ్తాను—నీవు ప్రభను ఎరగవ్రూ.

మో : ఆఁ, ఏదో చిన్నప్పుడు కించిత్ పరిచయం. బందరు వాళ్ళమేగదూ.

బ్రహ్మ: అదేలే—సైమయింది. వెళ్తాను (నిష్క్రమణ)

ప్రభ : వెళ్ళి నీళ్ళు పేట్టూ తెస్తాను. (వెళ్తుంది)

మో : (రెండు చేతులతో తల పట్టుకొని కళ్ళు మూసు కుంటాడు.)

( తెర )

మళ్ళీ తెర ఎత్తేటప్పటికి సాయంత్రం నాలుగుగంటలు దాటుతుంది. ప్రభ మంచంమీద కూర్చుంటుంది. మోహన్ ఇటూ అటూ పచారు చేస్తూ ఉంటాడు.

మో : అయిపోయింది. నాలుగు కూడా దాటింది. స్వప్న లోకంలో నుంచి యదార్థ ప్రపంచంలోకి దిగాలి. ప్రభా! ఇక గంటలో వెళ్ళిపోతాను.

ప్రభ : అవును. గంటలో వెళ్ళిపోతాము.

మో : (మాటలు విన్నా మొదట అర్థం పూర్తిగా గ్రహించడు. తర్వాత హఠాత్తుగా స్ఫురిస్తుంది.) ఆఁ, ఏమన్నావు. గంట... ...

ప్రభ : గంటలో వెళ్ళిపోతాము-అని.

మో : అంటే ?

ప్రభ : కవీశ్వరులకు మామూలు తెలుగుభాష అర్థంగావటం లేదుకాబోలు. గంటలో మీరూ, నేనూ వెళ్ళిపోతామని అన్నాను.

మో : ప్రభా ! పిచ్చిగా మాట్లాడుతున్నావు. స్వప్న ప్రపంచంనుంచి ఇంకా బయట పడలేదా?

ప్రభ : ఏది స్వప్న ప్రపంచమో, ఏది జాగ్రత్ ప్రపంచమో నిర్ణయించడం నాకవసరం లేదు. మీరు వెళ్ళేటప్పుడు మీతో వచ్చేస్తున్నాను. నా బట్టలూ అవీ సర్దుకున్నాను. వారు చేయించిన సరుకులు ఇక్కడే వదిలేశాను. ఇదంతా స్వప్నమే అంటారా ?

మో : వద్దు, ప్రభా వద్దు.

ప్రభ : ఎందుకూ ? పాపకార్యమనా ?

మో : కాదు.

ప్రభ : లోకులు తిట్టిపోస్తారనా ?

మో : కాదు.

ప్రభ : స్నేహితుణ్ని ద్రోహం చెయ్యడమనా ?

మో : కాదు.

ప్రభ : నేను కష్టపడతాననా ? ఇల్లు వాకిలిలేక మీరుంటే మీతో తిరుగుతూ అన్నాహారాలుకూడా ఒకొక్కప్పుడు లేక బాధపడతాననా ? ఆ భయం నాకు లేదు.

మో : లేదు.

ప్రభ : మీ స్వేచ్ఛకు భంగం కలిగిస్తాననా ?

మో : కాదు. ప్రభా కాదు.

ప్రభ : (నిశితంగా) అయితే తెలిసింది కారణం. నామీద ప్రేమ లేదు. (లేచి నిలబడుతుంది.)

మో : అయ్యయ్యో ! ఎంత ఘోరంగా పొరబడుతున్నావు! నీమీద ప్రేమవల్లనే వద్దని వేడుకుంటున్నాను.

ప్రభ : (విరసంగా నవ్వి) ప్రేమవల్ల !

మో : (ప్రభను సమీపించి తొందరగా) అవును. ప్రేమ వల్లనే - అసాధారణమైనటువంటి ప్రేమ, అపూర్వమైన ప్రేమ, పవిత్ర ప్రేమ, రాధమీద కృష్ణుడి ప్రేమవంటి అమోఘ ప్రేమ. ప్రభా, కించిత్ మోహానికి లోబడి అటువంటి మన ప్రేమను మలినం చేస్తామా ? మోహం తాత్కాలికం; ప్రేమ శాశ్వతం.

ప్రభ : ప్రేమచేతనే మీ వెంట వస్తానన్నాను, మోహం చేత కాదు.

మో : నేను ఒప్పుకోను. ఎందుకంటే మోహం ఫలాన్ని అపేక్షిస్తుంది. ప్రేమ ఫలాతీతమైంది. సాఫల్యంతో మోహం నశిస్తుంది. ప్రేమానుభవానికి సాఫల్యమన్నదే లేదు. అందుచేత దానికి నాశమన్నటికీ లేదు.

ప్రభ : మరి... కమలం ... నిశ్శంకవారి కోడలు మీతో వచ్చేసి ఆనందం అనుభవించలేదా ?

మో : లేదు. మోహాగ్నిలో భస్మమైపోయింది. కొంత సౌఖ్యం, అనుభవించిందేమో గాని ఆనందం ఎన్నటికీ అనుభవించలేదు. ఆనందానికి హెచ్చుతగ్గులు, సంతృప్తి ఉండదు. మనుచరిత్ర జ్ఞాపకం లేదూ. 'కుంభ గత ప్రదీపకళికా శ్రీ దోప'

ప్రభ : ప్రేమించిన పురుషునకు దేహమూ, ఆత్మ అర్పించడం కన్నా స్త్రీకి వేరే ఆనందం ఏంఉంటుందా ?

మో : మళ్ళీకలిపేస్తున్నావు. ఆత్మనర్పించుకోవద్దన్నానా? దేహాన్ని అర్పించుకున్న క్షణంలో దాని విలువ తగ్గిపోతుంది.—ప్రభా నీవు నాదేవతవు. నీదేహాన్ని నా కర్పించి సామాన్య వనితవైపోతావా ?

ప్రభ : అయితే ఈ ప్రేమను మీరు ఎలా అనుభవించడం?

మో : ప్రేమానుభవం నిష్కామకర్మ... ప్రేమంటే కోరిక గాదు, తీరడానికి. ప్రేమకూ, భక్తికీ తృప్తి లేదు. అనుభవించడంవల్ల ఎక్కువవుతవి. అదీ పరమ రహస్యం.

ప్రభ : ఏమీ తోచడంలేదు. బాధపడిపోతూ వున్నాను.

మో : నాకు తెలుసును. దేన్ని గాని చంపుతున్నప్పుడు బాధ సహజం — ఇప్పుడు మోహాన్ని చంపుకోటానికి ప్రయత్నిస్తున్నావు. అందుకే బాధ.

ప్రభ : (చప్పుడు విని) వస్తున్నారు.

ప్రవేశం: బ్రహ్మానందం.

బ్రహ్మ: (ఇద్దరి వైఖరీ చూచి ఖంగారు పడతాడు గాని అడగడానికి జంకు) మోహన్ ... ఒంట్లో ఎలావుంది?

మో : చూస్తున్నావుగా. ఓ. కే. గా వున్నాను. ఇంతవరకు లెక్చర్లతో మీ యిల్లాలిని విసిగించేస్తున్నా. సెలవిప్పించాలి ... మీ యిద్దర్నీ ఎలా థేంక్ చెయ్యాలో ఊహించలేకుండా వున్నాను.

బ్రహ్మ: అరే. దీనికేనా... అయితే వెళ్ళిపోతానంటావా?

మో : నీవు వచ్చేవరకు ఉంటానని చెప్పాను గదా అని ఇంతవరకూ ఉన్నాను.

బ్రహ్మ: సరే మరి. (జేబునుంచి పర్సు తీసి పది రూపాయల నోటు ఇవ్వబోతాడు.)

మో : వద్దు క్షమించు.

బ్రహ్మ: నీయిష్టం. (నోటు జేబులో పెట్టుకొంటూ)

మో : (ప్రభతో) ఏమండోయ్, సెలవు. మీ దయ, మీ అభిమానం, మరిచిపోలేను. బ్రహ్మం! సెలవు. మళ్ళీ ఎన్నాళ్ళకో.

బ్రహ్మ: (ప్రభతో) గుమ్మంవరకూ వెళ్ళివస్తాను.

(మోహన్ బ్రహ్మం నిష్క్రమిస్తారు.)

ప్రభ : మొదట నిశ్చేష్టగా నిలబడుతుంది. తర్వాత మంచం మీదకూర్చుని చేతుల్లో మొఖంకప్పి వేసుకుంటుంది.)

పునః ప్రవేశం: మోహన్.

మో : (ప్రభను చూసి, సమీపించి, మంచంమీద పక్కనే కూర్చుని, ప్రభ భుజంమీద చెయ్యివేసి) ప్రభా! నీవు వద్దంటే విన్నానుగాను- నిన్నెంత కష్టపెట్టాను.

ప్రభ : (వెక్కి-వెక్కి ఏడుస్తున్న శబ్దం మాత్రం వినబడుతుంది. మిగతా అంతా నిశ్శబ్దం - )

## పాత్రలు:

| | | | |
|---|---|---|---|
| రణ విక్రముడు<br>ఉదయాదిత్యుడు—కొడుకు | జైనులు | | |
| ప్రోలరాజు<br>ప్రతాపరుద్రుడు<br>వీరభద్రుడు | ప్రోలరాజు కుమారులు | వీర శైవులు | |
| నందిని | ... | ప్రోలరాజు కుమార్తె | |



•

# నందిని

## రంగము - ౧

సాయంకాలం కొండచరియలలో ఒక చెట్టుక్రింద—దూరంలో శిబిరాలు, సంధ్యారుణములు రాత్రిలో మిళితమై క్షీణమైపోతూ వున్నవి. పశ్చిమాన రక్తసిక్తంగా వున్నది. తూర్పు దిశలో తొలి వెలుగులో నెలవంక — యుద్ధము — శాంతి.....

ఉదయాదిత్యుడు చెట్టుక్రింద పచారుచేస్తూ మాటి మాటికి శిబిరాలవంక రెప్పవాల్చక చూస్తుంటాడు. కొంతసేపటికి ఒక బండచాటునుంచి ఇంకొక బండచాటుకు చెంగుచెంగున దుముకుచు వచ్చే నందిని కనబడుతుంది. ఉదయ.సంతోషంతో నిరీక్షిస్తుంటాడు

ప్రవేశం: నందిని రోజుతూ.

ఉదయాదిత్యుడు: నందినీ! ఆలస్యమైతే నీవు రానే రావేమో అని భయపడ్డాను ... అయ్యో ఎంత ఆయాసం (అని దగ్గిరికి తీసి, ముంగురులు దిద్ది తన ఉత్తరీయంతో విసురుతాడు )

నందిని: దారిపొడుగునా పరిగెత్తే వచ్చాను. దొంగచాటుగా రావటం ... ఎంత కష్టమనుకొన్నావు ... ... పొంచి చూస్తుంటారు... వాళ్ళకి సందేహం ... కాదుకాదు ... వాళ్ళకి బాగా తెలుసు.

ఉద : మన.......

నంది : మన ప్రేమ... అవును... (ఉదయుని చేతిని తన చేతులలో పెనవేసుకొని) ప్రియా! ఏమి ఆనందం... ... ఆనందంతో గర్వం కూడా ... ... నిన్ను గురించి (విచారంగా) అయితే ఏమోగాని భయంగా వుంటుంది.

ఉద : ఎందుకూ భయం... మరి ఈ విషయం మీతండ్రికి తెలుసునా...

నంది : (తలఊస్తూ) తెలుసు... కాని వారంటే నాకు భయం లేదు. నామీద ఆయనకున్న ఆశవల్లకాదు–ఆయనకు యుద్ధం, విరోధం, విషాదం అంటే ఇష్టంలేదు ... వృద్ధాప్యంలో అందరూ కలిసి మెలిసి సమ్మతంగా వుండడమే ఆయన కోరిక ... అయితే మాఅన్నలంటే నాకు అమిత భయం...వాళ్ళకి అహంభావం ఎక్కువ. దయలేదు. అన్యమతస్థులంటే హంతవ్యులని వారి అభిప్రాయం ... వారి విద్వేషానలంలో నామీది ప్రేమ కూడా భస్మమై పోతుంది ... అందుకే భయం. మన ప్రేమ వాళ్ళకి దుస్సహం.

ఉద : నందినీ! హృదయేశ్వరీ! మన ప్రేమకు మాత్రం ఏ అంతరాయము రాదు. రాజాలదు ... మీఅన్నలు యుద్ధమే అపేక్షిస్తారా సరే, ఈయోధుడు సంసిద్ధుడై యున్నాడు ... లేక, స్నేహం కోరి వచ్చారా .... ఈ యువకుడు చేతులు చాచి కౌగిలించుకోడానికి తయార్! అంతేగాదు, మావాళ్ళందరికీ ఆస్నేహ

భావమే కలిగేటట్లు చేయగలను ... ఒకటి మాత్రం నిశ్చయం, నందినీ, మీ వాళ్ళు దారుణ కృపాణాలతో వచ్చినా సరే; వికసిత సుమహారాలతో వచ్చినా సరే - నీవు నా దానవు, నేను నీవాడిని... నీవు లేకపోతే నా జీవితం శూన్యం...

నంది : (పారవశ్యమున ఉదయుని చేతులు ముద్దుపెట్టుకుంటూ) నా జీవితమే మీరు ... మీరే నేను... మీ మాటలు వింటూన్నప్పుడు మాత్రం నిజంగా మన ప్రేమ నిరంతరాయంగా వికసించి పుష్పించి ఫలించుననే నమ్మకం కలుగుతుంది... కానీ, కానీ... మీకు తెలియదు. మా అన్నలు పట్టుదల. వారి జీవితంలో ప్రేమకే స్థానం లేదు. స్వమత ప్రచారమునకే వారి జీవితాలు ధారపోస్తారు ... ప్రేమ అంటే వారికి దౌర్బల్యమని అభిప్రాయం ... ఏమి మతమో..మతము పేరుపెట్టుకొని ద్వేషం, క్రౌర్యం, మాత్సర్యం, రాజ్య కాంక్ష వీటిని పెంచటమే వారి పరమావధి. ప్రియా! ఎంత మూర్ఖులు వీరు ... జైనులు, బౌద్ధులు, శైవులు, వైష్ణవులు - అందరూ మనుష్యులు గారా - ఇంతమాత్రం ఎందు కర్థం కాదో వీరికి...

ఉద : ఎందుకా... మానవజాతి చరిత్రలో ఇంకా విద్యాహీనమైన శైశవస్థితిలోనే ఉండడంచేత ... అక్కడక్కడ ఎవరో ఒక కొందరికి జ్ఞానం కలిగినా

మానవజాతి మాత్రం ఇంకా అజ్ఞాన కూపంలోనే పడి వుంది ... అందుచేతనే ఈ మత వైరాలు, ఈర్ష్యలు, అపనమ్మకం, విరోధం, యుద్ధం ... జనహత్య ... ఈ తులలేని సౌందర్యంతో విలసిల్లే ఈ లోకం అనే నందన వనాన్ని మృత కళేబరంతో నిండిన స్మశాన వాటికగా చేసే వారికి నిజంగా జ్ఞానం ఉందని ఎవరనగలరు ?

నంది : (అశ్రుపూరితమైన కంఠంతో) అంతేనా ? మనకు ఈ జన్మలో సంతోషమే లేదా ?

ఉద : నందినీ! ఏందుకీ నీరసత్వం ... ఎందుకు మన ప్రేమ వీరి ద్వేషాన్ని చల్లార్పకూడదు. ఉండు ... విశ్వ ప్రయత్నంచేసి చూస్తాను, రేపే ... ఏదీ ! ఒకమారా లేడి కండ్లతో నవ్వు, నాకు ధైర్యం వస్తుంది.

నంది : (కండ్లు తుడుచుకుని, నవ్వు తెచ్చుకుని) అంత భాగ్యమా ... అమ్మయ్యో! చాలా చీకటైపోయింది, అవిగో, దీపాలు, పూజా సమయంలో నేను లేకపోతే కనుక్కుంటారు ... వెళ్తాను ... (అని, నిక్కి ఉదయుని చెక్కిలి ముద్దుపెట్టుకొని పరుగిడిపోతుంది.)

ఉద : అవును ... అదే కర్తవ్యం ... ఏమో ప్రేమ ఎందుకు జయింపకూడదు ... (దూరంలో నక్క-కూత, వెక్కి- రిస్తున్నట్లుగా.)

## రంగము - ౨

ప్రోలవేమరాజు శిబిరం—ఒకప్రక్క మధ్యగా ఎత్తుపీఠం. ఇరువంకల చిన్న పీఠాలు. వీరశైవ ప్రముఖులు ఒక్కొక్కరుగావచ్చి కూర్చుంటూరు, మాట్లాడుకుంటూ.

ప్రవేశం: ప్రోలవేముని కుమారుళ్ళు - వీరభద్రుడు, ప్రతాపుడు.

వీరభద్రుడు: ప్రతాప్! ఏమంటావు... యుద్ధమా సంధియా? ఏది పర్యవసానం.

ప్రతాపుడు: చూద్దాం. వీళ్ళవైఖరి, మొత్తదనం చూస్తే రాయబారం లాగే కనుబడుతూవుంది... (కన్ను చిమిటి) అదీ మంచిదే.

వీర : (తల పంకిస్తూ) ఊం. (క్రూరంగా నవ్వి) ఈఖండా లుడు, ఈ మతభ్రష్టుడు మన నందినీదేవిని మలినం చేశాడు, తెలుసునా?

ప్రతా: విన్నాను. నందిని మంచిపిల్ల.

వీర : ఆకారణం చేతనే వారిఅపరాధం ద్విగుణీకృతమైంది. శిక్షకూడా కఠినంగా వుండి తీరాలి.

ప్రతా: తండ్రిగారు వస్తున్నారు.

వీర : వీరు వట్టిఅమాయకులు. వాళ్ళ వలలో పడిపోతారు.

ప్రవేశం: సపరివారంగా ప్రోలవేముడు. ఉన్నతపీఠా సీనుడవు తారు. 'జయ బసవేశ్వర! జయ ప్రోలరాజ, రాజాధిరాధిరాజ, వీరశైవ శిఖామణీ విజయీభవ' అనే ధ్వనులతో శిబిరం నిండిపోతుంది.

ప్రోలవేమ: విన్నారుకదా మీరందరూ—ఏ విషయం కోసరం మిమ్మల్ని ఆహ్వానించానో. రణ విక్రముడు

అనతికాలంలో ఇక్కడకు వస్తాడు. అతడు మన వైరి అయినను గౌరవార్హుడు. మనము సన్మానించవలెనేగాని అవమానింపరాదు... మనకును అతనికిని మత వైరము తప్ప వేరే విరోధం లేదుగదా. ఇలాటి భేదాలు యుద్ధరంగంలో సమసిపోతవని నాకు నమ్మకంలేదు ... సామంచేత కలిగే విజయం దండంచేత కలగదు...

తండ్రి మాట్లాడుతున్నప్పుడు నందిని వచ్చి కాళ్ళవగ్గర కూర్చుండును.

వీర : (ప్రతాపుని చెవిలో) ఈ మెత్తదనమే మన ఆశయాల కంతటికీ అంతరాయం.

దౌవారికుడు ప్రవేశించి;

శ్రీ శ్రీ శ్రీ రణవిక్రమ మహారాజుగారు, యువరాజ సమేతంగా విచ్చేసివున్నారు.

ప్రోల : తక్షణం ప్రవేశపెట్టవలెను.

ప్రవేశం : రణవిక్రముడు, ఉదయాదిత్యునితో.
అందరు లేచి నిలుచుంటారు, వీరభద్రుడుతప్ప.
స్వాగతం ఇచ్చిన తరువాత అందరు కూర్చుంటారు.

రణవిక్రముడు: రాజపుంగవా! యుద్ధమపేక్షించి రాలేదు మేము. మన విరోధమువలన జనహత్య, ధననాశనం, దేశ కల్లోలం, ఇవి తప్పవు, ఎవరు జయించినా... ఈ విశాల ప్రపంచంలో మన ఇరుపురికీ చోటు లేకపోలేదు... మన పరస్పర విరోధభావం కంటే

అన్యోన్య స్నేహభావమే ఇరువంశల వారికి శ్రేయోదాయకం గాదా!

ప్రోల: (అంగీకారంతో) రాజోత్తమా, నీ భావాలు అత్యంతాకర్షణీయంగా వున్నాయి. నాకుమాత్రం యుద్ధమంటె యిష్టమా.

రణ : సంతోషం...అలాటి అన్యోన్య స్నేహ భావానికి తార్కాణంగా, పునాదిగా శాశ్వత బంధంగా వుండగల కార్యానికి మీ ఆమోదం కోరుతూ వున్నాను. తమ పుత్రికా రత్నమైన నందినీ దేవి కిన్నీ మా పుత్రుడు ఉదయాదిత్యునికిన్నీ వివాహం...

వీర : (కరవాలం తీయబోవును)

ప్రతా: (వారించును)

రణ : ఇరువురు ప్రేమపాశబద్ధులై వున్నారు. (నందిని తల వంచుకుంటుంది) మన ప్రజలందరికీ పరస్పరానుగం కలుగ. పోకపోదు. ఏమి? ప్రోలరాజేశ్వరా, ఏమి శంకిస్తున్నారు.

ప్రోల: (కన్నీళ్ళతో) 'మా నందిని సమ్మతి మందస్మితంలోనే విదితమవుతున్నది. ఇక నాకుమాత్రం...

వీర : (లేచి). ఆగండి! ఆగండి! తండ్రిగారు మన్నించాలి... ఈ కార్యం అసంభవం! జరగడానికి వీలు లేదు...మన మతం అద్వితీయమైన పూజ్య శైవ మతం. వీళ్ళది నాస్తికమతం... మన యింటి ఆడ బిడ్డని ఈ నాస్తికులకిచ్చి వివాహం చేయడంకన్న

మహాపాతక కృత్యం ఇంకొకటి ఉంటుందా? ఇంత కన్న మత ద్రోహం — ఉండదు. మతౌన్నత్యం కోసం ప్రాణాలను వదలడానికి సిద్ధంగా వున్న ఈ వీరశైవ శిఖామణులకు ఇంతకన్న తలవంపుండునా...

ఉద : (లేచి) ఇంతేనా ఆక్షేపణ. (తండ్రితో రహస్యంగా మాట్లాడి) అన్ని మతాలూ నా అభిప్రాయంలో ఒక్కటే. అందుచేత మేమందరమూ వీరశైవ మతాన్ని స్వీకరిస్తాము. నేను ప్రేమైక నిధిని నందినీ దేవిని స్వీకరిస్తాను...

ప్రోల: భళీ! భళీ! ఉదయాదిత్యా! కుమారా! నీఔదార్యం వర్ణనాతీతం ... నీ ప్రేమ పరస్పర విరోధాల్ని నిర్మూలనం చేసింది. నీ త్యాగం మమ్మల్ని జయిం చింది. నందినీ! నీవు ధన్యురాలవు.

నంది : (తండ్రి పాదాలకు నమస్కరించి రణ విక్రమునికి నమస్కరిస్తుంది.)

వీర : (ప్రతాపునితో) చూశావా, ఛండాలు డెంత మోసం చేసినాడో... కానీ... మోసానికి ప్రతీకారం మోసమే.

సభ్యులలో గుసగుసలు.

## రంగం - 3

ఆరు దివసములతర్వాత పడకటింట్లో, ఉదయా
దిత్యుడు, నందిని కూర్చుని ఉంటారు.

ఉద : నందినీ, ఏ మంత పరధ్యానంగా వున్నావు?

నంది : ఆఁ. ఏమీ లేదు ... ఎక్కడా ఎవ్వరూ కనబడ్డం లేదేమీ.

ఉద : కామ దహనోత్సవమైంది కదా! తరవాత వేడుకలలో మునిగి తేలుతూ వుంటారు. మావారు, మీవారు కలిసి—అందరం ఒకటై పోయినాము గదా... నీవూ నేనూ ఒకటైనట్లు.

నంది: ఏమోనండి. తలుచుకుంటే ఒళ్లు ఝల్లుమంటుంది... ఆనాడు సభలో మా అన్నల రౌద్రాకారం ... అందులో వీరభద్రయ్య మొఖం కోపంతో కంది రక్తసిక్తంగా వున్నట్లు కనబడింది...

ఉద : అవును నేనూ చూచాను. కార్యక్రమం వారికేమాత్రం నచ్చలేదు... కానీ పిచ్చిదానా, ఇంకా ఏమి భయమే... ఇంకేమి చేస్తారు.

నంది : అలాగే అయితే నా అదృష్టమే ... కానీ, నాకు నమ్మకం లేదండి... మా అన్నలు తమకు గొప్ప పరాభవం జరిగినట్లు అనుకొన్నారు ... ఆ భావం వారిని దహించి వేస్తూవుంది. అది రక్తంతోగాని చల్లారదు. యుద్ధ సంకల్పులై యుండేవాళ్ళకి ఈ సంధి ముచ్చట్లు రుచిస్తవా? అబ్బ! ఈ సంశయ

గర్భమైన నిశ్శబ్ద వాతావరణం నాకు దుర్భరంగా వుంది... అదుగో! విన్నారా... ఏమది...

కేకలు, ఏడ్పులు, హాహారవములు, అల్లకల్లోలం.

తలుపు తీసుకొని ఉదయాదిత్యుని అనుచరుడు గోమతి ప్రవేశిస్తాడు. గాయాలనుంచి రక్తం ప్రవహిస్తూ వుంది. చూడగానే నందిని కళ్ళు మూసుకుంటుంది.

ఉద : (లేచి) గోమతీ! ఏమి జరిగింది?

గోమతి: ద్రోహం... మోసం... అన్యాయం... ... వాళ్ళు రాక్షసులు... వేడుకలలో మైమరచినప్పుడు మైబడి హతం చేశారు. ఒక్క మగపురుగు లేకుండా... ... ఘోరం... ఘోరం... (చచ్చిపోతాడు)

ఉద : నిజంగా! నిజంగా? ఇంత మోసమా?

హఠాత్తుగా ప్రవేశం: వీరభద్రుడు, ప్రతాపరుద్రుడు, కరవాలాలు ఝుళిపిస్తూ.

వీర : (అడ్డం వచ్చిన నందినిని త్రోపు త్రోసి ఉదయుని కంఠం పట్టుకొని) ఛండాలా! మా నందినీ దేవిని మలినం చేసిన పాపానికి ఇది శిక్ష... (పొడిచి క్రింద పడవేస్తాడు) జయ్ బసవేశ్వర!... (ప్రతాపునితో) రా. ఆ ముసలినక్క ఉన్నాడింకా... (ఇద్దరు వెళ్ళిపోతారు)

నంది : (ఏడవడం లేదు. మొఖంలో నెత్తురుచుక్క లేదు. కళ్ళు చలించటం లేదు. ఉదయుని తల ఒళ్ళోపెట్టుకుని) ప్రియా! నిద్రపో! గాఢంగా నిద్రపో ... ఈ లోకంలో మనకు చోటు లేదు... ...ఆరోజు నీవు

చెప్పావు. నాకు జ్ఞాపకం వుంది...... మానవ జాతి జ్ఞానంలేని శైశవ దశలోనే ఇంకా వుందని......

ప్రియతమా! లోకాన్నింకా ప్రేమ జయించగల కాలం రాలేదు...... ప్రేమ రాజ్య స్థాపనకు ఈ ఈ మానవ ప్రపంచం ఇంకా సిద్ధం కాలేదు...... లేదు... లేదు—(మూర్ఛిల్లుతుంది)

ఆ నందిని ఆర్తనాద మెన్ని శతాబ్దాలు గడిచినా ఇంకా వినవస్తూనేవుంది లోకంలో!

— •• —

## పాత్రలు :

రఘురామయ్య ...

సుమంగళి ... రఘురామయ్య భార్య

నరసమ్మ ...

---

# వెర్రిముండ

మేడమీద గది. రఘురామయ్యభార్య సుమంగళి. ఈ గది, క్రింద వంటిల్లు, అద్దెకు తీసుకున్నారు. ఇంటి మిగతా భాగాలలో వేరే కుటుంబాలు కాపురము. సాయంత్రం 4-30. గదిలో మంచంమీద సుమంగళి ముఖం చేతుల్తో కప్పివేసుకుని ఏడుస్తూ కూర్చున్నది. ప్రవేశం: నరసమ్మ. ఆ యింట్లోనే కాపురమున్న గృహిణి. సుమంగళికన్న చాలా పెద్దది వయస్సులో.

నరసమ్మ: సుమంగళీ! ఏమమ్మా అలా కూర్చున్నావు!

సుమంగళి: (చేతులు తీసి చూస్తుంది.)

నర : (కన్నీరు చూచి) ఏడుస్తున్నావా? ఏమమ్మా ఒంట్లో కులాసాగా లేదా ?

సుమం: (అది కాదన్నట్లు తల తిప్పాను.)

నర : మీ అమ్మా నాన్న వాళ్ళందరూ బాగున్నారు కదూ.

సుమం: (ఉన్నారని తెలుపుచు తల ఊపుచు)

నర : మరెందుకమ్మా ...... (నవ్వుచు) ఆయ నేమైనా అన్నారా.

సుమం: (కన్నీళ్ళు తుడుచుకుని) అంటే బాగానే ఉందును. ఏమిచెప్పను నరసమ్మ పిన్నీ. వారు బొత్తిగా మారి పోయారు, కొన్ని రోజుల్నుంచి,

నర : మారిపోవడమేమిటమ్మా. కసురుకొంటున్నారా ?
నీమీద కేకలు వేస్తున్నారా ?

సుమం: వేస్తేనేం? పడడానికి సిద్ధంగావున్నాను సంతోషంతో. అదేమిటో ఎప్పుడూ ఎక్కడాలేని గౌరవం, మర్యాద, నేనేపని తన కోసరం చెయ్యబోయినా, నా దగ్గర నుంచి లాగుకొని తనే చేసుకోనడం మొదలు పెట్టి నారు. ఇంటికిరాగానే కోటు ఒకమూల, పట్లాం ఒక మూల పారవేస్తే నేను కోటు స్టేండుకు తగిలించి పట్లాం నీటుగా మడిచి ఉంచేదాన్ని. ఇప్పుడు అన్నీ ఆయనే ఓపికగా భద్రం చేస్తున్నారు. సరే సరి మొన్న బూట్సుకుకూడా పాలిష్ వారే చేసు కొన్నారు.

నర : ఇవన్నీ నీకు కష్టమెందుకని. నీమీద ప్రేమచేతనే ఐ ఉండవచ్చునమ్మా

సుమం: అదెలాగు పిన్నీ. భర్తకు పనులు చెయ్యాలనంటే భార్యకు కష్టంగా వుంటుందా ?... అందులో ఆయన మొదటినుంచీ ఆవిధంగా వుంటే ఏమో ఆయన తరహా అలాటిదని అనుకోవచ్చును... ప్రతి చిన్న పనీ నేనే చేసేదాన్ని కదా... ఇవన్నీకూడా కాదు పిన్నీ—నన్ను పగలు అస్తమానం 'వెర్రిముండా' అని ఎంతో ఆశతో పిలిచేవారు. ఇప్పటికా ముక్క విని ఎన్నోరోజులైనవి...... ఇప్పుడు నా పేరుపెట్టి పిలవడానికి ఆరంభించారు. ఒక్క తిట్టులేదు......
రామ ! రామ ! ఎలా భరించను...?

నర : ఇంతకే జేలపోతే ఎలాగమ్మా... చూడు, ఐదు కా వచ్చింది... కాఫీ తయారు చెయ్యాలి. నేనూ వెళ్తాను. (నిష్క్రమణ)

సుమం: (లేచి అద్దంచూచుకొని తల సవరించుకొని, కన్నీటి మరకలు తుడుచుకొని) బల్లమీద ఎంత తారు మారుగా ఉన్నవో పుస్తకాలు! (అని సర్దుతూ వుంటుంది. ఆ పుస్తకాల్లో ఒక మాసపత్రిక మడిచి ఉంచబడినది కనబడుతుంది! "నవయుగ" అనే తెలుగు పత్రిక.) ఏమి వ్యాసమో కదా! అంతగా బ్లూ పెన్సిల్‌తో మార్కులు పెట్టినారు (అని తీసి శీర్షిక చదువుతుంది) "భార్యనా, బానిసనా?" రచయిత "నవజవాన్" ... ఓహోహో! ఏమి వెలిగించారో చూద్దాం విజ్ఞానం... "ప్రస్తుతకాలమందు సహితము, విద్యావంతులమనివి ర్రవీగుయువకులు తమభార్యలను కేవల బానిససమానులుగ గణించి అతి దారుణముగా ప్రవర్తించుట సర్వసాధారణమైపోయినది. వంట మొదలైన గృహ కృత్యములేగాక తమ స్వంత పనులు కూడా భార్యలచేత చాకిరీ చేయించుకునే వారు ఎంత కఠినాత్ములో ఊహించుకొనుడు. మా స్నేహితుడొకడు తన బూట్సుకు పాలీషు తనభార్య వేయుట అలవాటని గర్వముతో చెప్పినాడు. ఇంత కన్న బానిసత్వము కావలెనా – ఈ 20 వ శతాబ్దమున!"—— ఇదా రహస్యం! మావారి మార్పుకు

ఈ పిచ్చి పెద్దమ్మ కారణం తప్పకుండా... (ఇంకా చదువుకొని) ఇక్కడేదో బ్లూ మార్కు పెట్టారే!— ఏమిటో "ఆశ, ప్రేమ, ముద్దు, చనువు అనే బూటకపు నెపాలు పెట్టి, విద్యాధికులైన భర్తలు తమ సతీమణులను, హీనముగా, అగౌరవంగా, "ఒసే! కుంకా! లంజా!" అని సంబోధించుట మామూలై పోయింది. ఒక మహాశయుడు తన కాంతామణిని "వెర్రిముండా" యని పిలుచుట మేము విన్నాము. ఎంత హేయము! ఎంత అశ్లీలము." (గంతులు వేయుచు) ఇంక సందేహం లేదు. మా వారిది తప్పేమీ లేదు. అంతా ఈ వెధవదే. ఈ వ్యాసంపైనే వ్రాస్తా; 'ఈ వ్యాసం వ్రాసిన పెద్దమ్మ శుద్ధ వెర్రి వెధవ' అని ... (అక్కే కలంతో వ్రాసి బల్లమీద ప్రత్యేకంగా పెట్టును. ఇంతలో సైకిల్ ఘంట వింటుంది.) అదే వస్తున్నారు. (అని వెళ్ళి పోవును క్రిందకి. అనతికాలంలో ప్రవేశం రఘురామయ్య. మంచంమీద కూర్చుని బూట్సు తీసి మూలలో ఉంచి, బట్టలు మార్చి గుమ్మం దగ్గరనుంచి క్రిందికి వినేటట్లు 'సుమంగళి!' అని పిలిచి బల్లదగ్గరకు వచ్చును. దృష్టి ప్రప్రథమంలోనే నవయుగ పత్రిక మీద పడును. తీసి కలంతో భార్య వ్రాసిన వాక్యం చదువుకొని) ఎంతచక్కగా వ్రాసింది తన అభిప్రాయం! (నవ్వును) వాడితో

చెప్పాను... ఈ వ్యాసం వ్రాసిన పెద్దమ్మ శుద్ధ వెఱ్ఱి వెధవ ... నేను కూడా ఏకీభవిస్తున్నానని చెప్పు తాను... అదా రహస్యం! విచారంగా ఉంటూంటే ఎందుకో అనుకున్నా...

ఇంతలో ప్రవేశం : సుమంగళి. ఫలహారము, టీతో తన చిన్న బల్లమీద పెట్టి నిలబడును.

రఘు : (నవ్వుచు దగ్గరకు వచ్చి) ఓసి వెఱ్రిముండ !

సుమం: (పట్టరాని ఆనందంలో) ఏది! ఏది! వెఱ్రిముండ! మళ్ళీ మళ్ళీ, ఎన్నాళ్ళకు విన్నానండీ ఆ మాట!

రఘు : (త్వరగా) వెఱ్రిముండ! వెఱ్రిముండ! వెఱ్రిముండ! (అని కౌగిలించుకొనును.)

—•••—

# పాత్రలు:

| | | |
|---|---|---|
| సుబ్బమ్మ | ... | |
| కృష్ణశర్మ | ... | సుబ్బమ్మ కుమారుడు |
| రామయ్య నాయుడు | ... | వకీలు |
| సరళ | ... | నాయుడు కూతురు |
| పాపన్న | ... | సుబ్బమ్మ నౌకరు |

---

# బంధాలు

సుబ్బమ్మ ఇంట్లో వీధిప్రక్కగది. ఒక సోఫా, నాలుగు కుర్చీలు, ఒకమూల చిన్న బల్లమీద రెండు ఫోటోలు. ఒకటి అయిదేళ్ల అబ్బాయిది, ఇంకొకటి పోలికబట్టి అబ్బాయి తండ్రిది — ఒక గోడమీద మహాత్మాగాంధి పటం. నౌకరు పాపన్న తువాలుతో దుమ్ముతుడుస్తూ కూనిరాగంతో పాడుతుంటాడు.

'వస్తాడమ్మా మా బాబు
నేడే ఇప్పుడే వస్తాడు
చాకొలెట్ తెచ్చి ఇస్తాడు
చుట్టముక్కలు తెస్తాడు.'

ప్రవేశం: సుబ్బమ్మ – తలచెడినా జుట్టు నెరయలేదు, కాని బొట్టుమాత్రం లేదు. పచ్చరంగు ప్రసాద చీర కట్టుకుంది. చేతికి బంగారుగాజులు. వయసు దాదాపు 40 అయినా ముఖంలో తేజస్సు, లావణ్యం తొణికిసలాడుతుంటవి.

సుబ్బమ్మ: ఏం పాపన్నా, పాడుతున్నావు–సినిమా పాటా?

పాపన్న: (కొంత సిగ్గుతో) మట్టు సినిమాదేగాని పదాలు మన బాబుగారి గురించేనండి ... నేడు వస్తారుగదా అనే సంతోషంతో పాడుతుంటి అండి... ...మీరు లోపలున్నారుకదా అని......

సుబ్బ: దానికేం?......(నిట్టూర్పు)

పాప : (అర్థం ఊహించుకోని) నేడు వచ్చి రెండు రోజు లుండి వెళ్ళి పోతారంట గదండి.

సుబ్బ: అవునురా... బొంబాయి వెళ్ళి అక్కడినుంచి స్టీమర్లో లండన్ వెళ్తాడు.

పాప : ఎందుకమ్మా అంతదూరం ? ఏం చదువులో...... ఇక్కడ సదివింది సాలదూ. పాపం... మీకు శానా కష్టంగా ఉండదాండి.

సుబ్బ: ఉంటే ఏంచేస్తాం పాపన్నా ... మన బాబు సంగతికేం ఏ రెండేండ్లలోనే వచ్చేస్తాడు... ఆడపిల్లని పెంచి పెద్దచేసి పెండ్లిచేస్తే అత్తగారింటికి వెళ్ళిపోదూ... చూడు, నాయుడుగారు అంత అల్లారుముద్దుగా పెంచాడు కూతుర్ని ... రేపు ఒక అయ్య చేతిలో పెట్టాక తనతోనే ఉంటుందా ? ఎంత దూరదేశానికైనా వెళ్ళిపోవద్దూ ?

పాప : అదేమిటండి అలా అంటున్నారు. సరళమ్మ మన బాబుగారిని పెళ్ళిచేసుకుని మనతోనే ఉండిపోదండీ ?

సుబ్బ: (ఉలికిపడి) ఛీ, ఊరుకో.

పాప : నేను ఏం తప్పన్నానండి ... ఊరంతా అదేమాట గదండీ.

సుబ్బ: ఊరివాళ్ళకి ఉబుసుపోకపోతే ఉన్నవీ లేనివీ కూడా వాగుతారు ... చాలు, పాపన్నా ఈ కొరగాని మాటలు.

పాప : చిత్తం.

సుబ్బ: బాబు వచ్చేవేళ అయింది. నీళ్ళు కాచి ఉంచు.

పాప : అలాగేనండి. (వెళ్తూ ఉంటే మోటారు గుమ్మం దగ్గిర నిశ్చ్వాస శబ్దం వినబడుతుంది )

సుబ్బ: చూడు, ఎవరో.

పాప : (కిటికీలోంచి చూచి) నాయుడుగారు (తలుపుతీస్తాడు.)

సుబ్బ: (పైట సర్దుకొని ఎదురుచూస్తూ ఉంటుంది.)

ప్రవేశం : రామస్వామినాయుడు. పంచ, కోటు, ఉత్తరీయం ధరించాడు. 50 ఏళ్లు దాటినవాడే కాని మంచి పటుత్వంగల వాడు. గుబ్బుమీసాలు. పాపన్న ఇంట్లోకి వెళ్తాడు.

సుబ్బ: చాలా పెందలకడ బయలుదేరారు.

రామ: బనగానపల్లి దివాను ఏదో పనిగా తక్షణం రమ్మని కబురుచేస్తే వెళ్తూ ఇలా వచ్చాను... బాబు వస్తాడు కదా ఈ రోజు... అంతలో వచ్చేస్తాను...

సుబ్బ: బాబువచ్చినా స్నానం భోజనం అంతా అయ్యే టప్పటికి ఒంటిగంటన్నా కాదూ.

రామ: (మెల్లగా) బాబు లండన్‌కు వెళ్ళితే కష్టంగా వుంటుంది కదూ.

సుబ్బ: (నిట్టూర్చి) వాడు పైకి వస్తే సంతోషం. అదే నా కోరిక ... నా కష్టానికి నేను ఎప్పుడైనా ఆలోచించానా ? చదువుకునేటప్పుడుమాత్రం — ఏదో సెలవుల్లో వచ్చి ఉండేవాడు.

రామ: ఎంత ధైర్యం లీలా నీకు ?

సుబ్బ: (ఉలికిపడి) ఆ పేరుతో ఎందుకు పిలుస్తారు. ఆ పేరు మరిచిపోలేదూ, ఇంకా ? ... లీల ఇప్పుడు జీవించి ఉండలేదు ... ఉన్నది సుబ్బమ్మ.

రామ: క్షమించు ... నీవు నిజంగా గొప్పదానవు.

సుబ్బ: ఆలస్యమవుతుంది ... వెళ్ళండి.

రామ: అవును. (వెళ్ళుతూ ఏదో జ్ఞాపకంవచ్చి) చూడు, అబ్బాయికి గవర్నమెంటువాళ్ళు ఇచ్చే డబ్బు చాలదు, బట్టలవీ కొనుక్కోడానికి ... ఇదుగో ఈ రెండువందలియ్యి. (పర్సుతీసి రెండునోట్లు ఇస్తాడు.)

సుబ్బ: (తీసుకొని) ఎన్నాళ్ళు ఈ దోపిడి ?

రామ: చాల్లే నీమాటలు ... నీకొడుకు వేలువేలు సంపాదించి నప్పుడు నక్కుకూడా ఇప్పింపుదువుగాని ...

సుబ్బ: అన్నాళ్ళవరకు ఉండవలెనా నేను ?

రామ: ఏమిటీ వైరాగ్యం ?

సుబ్బ: వైరాగ్యం కాదండీ, తృప్తి. నాకు ఇంకేమి కావలెనండీ.

రామ: కావలసినన్ని ... నీ కొడుకు పెద్ద పరీక్షలు ప్యాసై గొప్ప ఉద్యోగాలు చేస్తూవుంటే చూడవద్దూ...... మంచి కోడల్ని సంపాదించవద్దూ ... లండన్ వెళ్ళి దొరసాన్నే పెండ్లాడి వస్తాడేమో.

సుబ్బ: (నవ్వుతూ) ఎన్ని కోటలు కడ్తారండి. మా అబ్బాయి దొరసాన్ని పెండ్లాడివస్తే మీఅమ్మాయి ఒక దొరని పెళ్ళాడివస్తుందేమో.

రామ: (నవ్వుతూ) అప్పాయిపాల్ ... (గడియారం చూచు కొని) ఇక వెళ్తాను. (వెళ్తాడు)

సుబ్బ: పాపన్నా!

పాపన్న ప్రవేశం:

సుబ్బ: స్నానానికి నీళ్ళు తయారుగా ఉన్నాయా?

పాప : ఓ.

సుబ్బ: చూడు, ఇంతకుముందు ఏదో పిచ్చి ప్రసంగంచేశావు పెండ్లి గింప్లి అని... అలా ఎప్పుడూ అనకు.

పాప : చిత్తం... నాకుమాత్రం తెలవదా అండి. తమరు బ్రాహ్మలు... వాళ్ళు నాయుళ్ళు...అయినా ఏదో చట్టం ఉండటగదండీ... వివాహం చేసుకోవచ్చని. నాయ్డుగారి గుమాస్తాకూడా చెప్పాడండి.

సుబ్బ: స్వంత గొడవలకన్నా పరాయివాళ్ళ గొడవలంటే ఎక్కువ సరదా ఈ వకీళ్ళ గుమాస్తాలకు ... చూడు, పాపన్నా, బండి ఏదో మనగుమ్మందగ్గిర ఆగింది... అబ్బాయే నేమో.

పాప: ఆఁ ఆఁ బాబుగారే! (త్వరగా తలుపుతీస్తాడు)

ప్రవేశం: కృష్ణశర్మ. పాతికేండ్లు దాటలేదు. పొడగరి, పలచనా, అయినా దృఢంగా ఉంటాడు. ఖాకీ పంట్లాం, తెల్ల బుష్‌కోటు...చెప్పులు గుమ్మం దగ్గిర వదిలి చేరుగా తల్లి దగ్గరకువచ్చి పాదాలంటి నమస్కరిస్తాడు. సుబ్బమ్మ తల నిమిరి ఆశీర్వదిస్తుండిగాని మాటలు వినబడవు—

కృష్ణశర్మ: పాపన్నా, సామాను దింపి లోపలికి తీసుకుపో – ఇదుగో... బాడుగ. (డబ్బుఇస్తాడు) అమ్మా, ఎలా

ఉన్నావు? నాన్నగారు అందరూ బాగున్నారా?
సరళకూడా వస్తుందట నాతో — తెలుసా ... నర్సు
వృత్తి విషయమంతా నేర్చుకుని వస్తుందట... నేనొక
నర్సింగ్ హోమ్ పెట్టినప్పుడు తాను సూపరింటెం
డెంటుగా ఉంటుందట.

సుబ్బ: (చిరునవ్వుతో) ఇంకేం ... నాయనా, స్నానం
చెయ్యి... చాలా ఆలస్యమైంది.

కృష్ణ: స్నానం చేస్తానుగాని భోజనం చెయ్యను. ప్రొద్దున్న
తిన్న ఇడ్లీలు, వడలు ఇంకా అట్లానే ఉన్నాయి.
(పాపన్న సామానంతా లోపల చేరుస్తుంటాడు) ఏం
పాపన్నా ... బాగున్నావా? చుట్టలు తెచ్చా
నీకోసరం. స్పెన్సర్ దుకాణంనుంచే.

పాప : (నోరు కొట్టుకుంటాడు, సుబ్బమ్మ కోప్పడుతుందని)
నీళ్ళు తయారుగా ఉన్నాయి బాబూ.

కృష్ణ : పద. (పాపన్నతో లోపలికి వెళ్తాడు)

సుబ్బ: (బల్లమీద ఉన్న ఫొటోలు చూస్తూ నిలబడుతుంది.
... మోటారు శబ్దం; విని ద్వారం వంక చూస్తుంది.
... తలుపు తెరుచుకుని ప్రవేశిస్తారు రామయ్య
నాయుడు, సరళ)

సరళ : (సుబ్బమ్మకునమస్కరించింది.)కృష్ణా ఇంకా రాలేదూ.

సుబ్బ:వచ్చాడమ్మా... స్నానం చేస్తున్నాడు. కూర్చో...
మీరూ కూర్చోండి...ఇంకా భోజనం కాలేదా ?

రామ: ఓ, చేసే వచ్చాను... నాకు మళ్ళీ పని ఉంది ... సరళను దిగబెట్టి వెళ్దామని వచ్చాను... ఉంటాడుగా అబ్బాయి ... సావకాశంగా తర్వాత మాట్లాడుకో వచ్చును.

ప్రవేశం: లోపలినుంచి కృష్ణశర్మ స్నానంచేసి... తెల్ల ధోవతి, తెల్ల జుబ్బా ధరించాడు.

కృష్ణ: నమస్తే మామా. హలో సరళా ... ఏం నిలబడే ఉన్నారు.

రామ: లేదు బాబూ, నేను ఇప్పుడే వెళ్ళిపోవాలి. జరూరు పని... సాయంత్రం వస్తాను. మీ అమ్మ దయదలిస్తే భోజనం కూడా ఇక్కడే.

కృష్ణ: అంతకన్నానా... ఏం సరళా, నీకుకూడా జరూరు ఉందా ?

సరళ: ఆఁ ... డాక్టర్ కృష్ణశర్మగారితో కొన్ని అవసర విషయాలు చర్చించడానికి ఆయన్ని కలుసుకోవాలి.

కృష్ణ: షారబాటై ఉండాలి. కృష్ణశర్మగారు ఇప్పుడు కుమారి సరళాదేవితో అత్యంత ముఖ్య విషయం మాట్లాడడానికి ఎదురుచూస్తున్నారు... నీవు వెళ్ళితే లాభంలేదు...

సుబ్బమ్మ, రామయ్య నవ్వుకుంటారు.

రామ: సరే, నేను దిగి కారు పంపుతాను. (వెళ్తాడు)

సుబ్బ: బాబూ, అయితే భోజనం చెయ్యనన్నావు... రెండు పూరీలైనా తిను... చుక్కాకు పప్పు చేశాను.

కృష్ణ: భలే. (చప్పరిస్తూ) సరూ, సూచావా చిత్రం! చుక్కాకు వంటింట్లో ఉంది. పేరు చెప్పింది అమ్మ— నానోరు ఎందుకిలా ఊరాలి.

సరళ: ఏమో డాక్టర్ని మీరే చెప్పాలి.

కృష్ణ: వేళాకోళం చేస్తున్నావుగాని, దానికి సమాధానం చెప్పగలను. ఒక పదార్థాన్ని తినవలెనని కోరిక రాగానే నోరు ఎందుకు ఊరుతుందంటే ఆ పదార్థాన్ని జీర్ణించడానికి ఆ ఊట సహాయం చేస్తుంది గనుక.

సరళ: ఏదో కోసేస్తున్నావు... తెలియనివాళ్ళదగ్గర ... ...

సుబ్బ: సరళా నీకూ తేనా ?

సరళ: వద్దు అత్తా ... కడుపు నిండుగా ఉంది.

సుబ్బమ్మ లోపలికి వెళ్తుంది. కృష్ణ
శర్మ సరళ చెయ్యి పట్టుకుంటాడు.

సరళ: (చెయ్యి వదిలించుకొని) ఉండు, కృష్ణా, అత్త వచ్చేస్తుంది.

కృష్ణ: ఎంత మంచి కోడలు.

సరళ: (సిగ్గుతో) పోనీ తే.

సుబ్బ: (పళ్లెంలో) పూరీలు, చుక్కాకు కూర, గ్లాసులో మంచినీళ్ళు తెచ్చి బల్లమీద పెట్టి) పూరీలు చల్లారి పోయినాయి ఎలాఉన్నాయో !

కృష్ణ: చుక్కాకుతో చేరితే కర్రముక్కలకుకూడా రుచి వస్తుందిలే.

సుబ్బ: నేను వెళ్ళి భోజనంచేసి వస్తాను. (వెళ్తుంది)

కృష్ణ: (పూరీలు తింటూ మాట్లాడుతుంటాడు) ఏమి సరూ, ప్రయాణానికంతా సిద్ధంగా ఉన్నావా?

సరళ: ఓ, పెట్టెలన్నీ సర్దేశాను.

కృష్ణ: సరూ, ఇప్పుడొక పెద్దవిషయం నీతో మాట్లాడి తీర్మానించాలి.

సరళ: ఏమిటబ్బా అంత పెద్ద విషయం.

కృష్ణ: మన భవిష్యత్ జీవితానికి ఆధారమైనది.

సరళ: అంత గూఢంగా మాట్లాడితే నేను అర్థం చేసుకోగలనా?

కృష్ణ: నటన... అంతా నీకు తెలుసు.

సరళ: అబ్బె, ఒట్టు.

కృష్ణ: సరూ, మనం వెళ్ళకముందే వివాహం చేసుకోవాలి.

సరళ: అమ్మయ్యో.

కృష్ణ: అంటే...

సరళ: ఏమో భయంవేస్తూఉంది కృష్ణా!

కృష్ణ: అవును ఆడపిల్లలకు పెళ్ళి అంటే పైకి భయం, లోపల సరదా.

సరళ: ఛా, నిజంగా భయం ... అర్థంలేని భయం, పిచ్చి భయం.

కృష్ణ: నాదే తప్పు — హఠాత్తుగా చెప్పడం ... సరూ, నామీద నీకు ప్రేమలేదా,

సరళ: (ఉందని తల ఊపుతుంది.)

కృష్ణ: ఇంకెవరినైనా వివాహం చేసుకోవాలని...

సరళ: (కాదని తల తిప్పుతుంది.)

కృష్ణ: కులభేద మనా?

సరళ: (కాదని తలతో సూచిస్తుంది.)

కృష్ణ: నాకర్థం కావడం లేదు.

సరళ: ఎందుకింత తొందర?

కృష్ణ: (నవ్వుతూ) లోకులు పరిహాసం చేస్తారని అనుమా నమా?

సరళ: అదికాదు కృష్ణా... తిరిగి వచ్చాక చేసుకోరాదూ.

కృష్ణ: ఎంతో ఆలోచించాను... పెండ్లి చేసుకోకుండా మన మిద్దరమూ వెళ్ళితే విదేశాలలో అనేక ఇబ్బందు లుంటవి... విను... మనం ఇద్దరమూ ఒకే గదిలో ఉండడం అసంభవం... భార్యా భర్తలైతే తప్ప... కలిసి మెలిసి ఎక్కువ తిరగడం సహా సబబుగా ఉండదు... ఇలాగే ఎన్నో విషయాల్లో...

సరళ: (ఊరుకుంటుంది.)

కృష్ణ: మౌనం అంగీకార సూచకమే ... ఔను ... మరి ఆలస్యం చెయ్యడానికి వీలులేదు ... ఇప్పుడే మా అమ్మతో చెప్పేస్తాను ... నీవూ మీ నాన్నతో ప్రస్తావించాలి ... తప్పదు... నేను అడిగినట్లు చెప్పు ... ఏమీ అనుకోరు. ఏ, సరేనా? (చెయ్యి పట్టు కుంటాడు. ఇంతలో ప్రవేశం: సుబ్బమ్మ)

సరళ : (చెయ్యి విడిపించుకొని) కృష్ణా — మా కాఫు వచ్చిందేమో చూడు... వెళ్ళాలి... నాన్నకు మళ్ళీ కాఫు కావాలేమో... వస్తా సాయంత్రం నాన్నతో.

కృష్ణ : (వాకిలితీసిచూచి) ఓ, కాఫు తయారుగా ఉంది... వెళ్ళిరా... సాయంత్రం టీ ... రాత్రి భోజనం ... అంతా ఇక్కడే... ఈ ఊళ్ళో సినిమాలున్నాయా, మంచి ఫిల్ము చూద్దాం.

సరళ : (నవ్వుతూ) ఆఁ, ఉంది—మామూబజార్.

కృష్ణ : లోకమే మామూ బజార్ ... వద్దులే ...

సరళ : (కొంత సిగ్గుతో) వెళ్ళివస్తా నత్తా. (వెళ్తుంది)

సుబ్బ: (సరళప్రవర్తన కొత్తగా కనబడుతుంది) ఏంమాట్లాడు కొంటున్నారురా— సరళ ఏదో మోస్తరుగా ఉంది.

కృష్ణ : వివాహ విషయం అమ్మా ... అందుకే సరళకు అంత సిగ్గు...

సుబ్బ: సరళకు వివాహం నిశ్చయించారా—నాకు తెలియ కుండానే.

కృష్ణ : ఇంకెవ్వరూ నిశ్చయించలేదమ్మా... మేమే నిశ్చ యించుకున్నాం.

సుబ్బ: అంటే ... సరళకు నీవు మనుము తెచ్చావా ... సరళే తెచ్చుకుందా.

కృష్ణ : కాదమ్మా... ఇప్పుడే చెప్పాలి అని అనుకున్నా— సరళ–నేను వివాహం చేసుకుంటాం.

సుబ్బ: (అదిరిపడి) ఆఁ ఆఁ.

కృష్ణ : ఎందుకమ్మా ఆ ఖంగారు? ఈ కులభేదాల్ని ఇంకా ఎంతకాలం పట్టుకుని ఏడుస్తారమ్మా – అసలు న్యాయసమ్మతం కూడాను వర్ణసంకర వివాహం ఇప్పుడు.

సుబ్బ: (దుఃఖంతో) అది కాదు నాయనా.

కృష్ణ : మరి ఇంకేమిటమ్మా... సరళవంటి కోడలు నీకెక్కడ దొరుకుతుందమ్మా. అదీ కాక, మేము ఒకరినొకరు ప్రేమించుకున్నామమ్మా.

సుబ్బ: హరిహరీ.

కృష్ణ : ఏం ... పాపమా ... నీకిష్టం లేదన్నమాట.

సుబ్బ: (బాధతో, అయితే కఠినంగా) అది జరగడానికి వీలు లేదు.

కృష్ణ : కారణం?

సుబ్బ: (గద్గద స్వరంతో) పాపం, ఘోరం పాపం గనక.

కృష్ణ : నాకేమీ బోధపడడం లేదు, గందరగోళంగా ఉంది.

సుబ్బ: (జాలితో) అలాగే ఉంటుంది బాబూ. నా కథ అంతా వింటేనేగాని నీకు అర్థం కాదు.

కృష్ణ : నీకూ మా వివాహానికి సంబంధం ఏముందమ్మా.

సుబ్బ: కూర్చో. అది పెద్దకథ. సావధానంగా చివరవరకు వినాలి.

కృష్ణ : (కూర్చుంటాడు ఒక కుర్చీమీద)

సుబ్బ: (ఇంకొక కుర్చీమీద కూర్చుని) నాయనా, ఈ కథ నీ చెవిని ఎన్నడూ పడకూడదని సంకల్పించుకుంటిని

కాని దైవసంకల్పం ఈ విధంగా పరిణమించింది. ఇక చెప్పక తప్పదు.

కృష్ణ : అబ్బ, త్వరగా చెప్పేసేయి. ఉక్కిరిబిక్కిరై పోతున్నాను.

సుబ్బ: ఈమాత్రానికే ? ... సరే...క్లుప్తంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను...మీ నాన్న అకస్మాత్తుగా చనిపోయి నప్పుడు నాకు మిగిలింది — నీవు — యీ యిల్లు. అయితే ఇంటిమీాద తనఖా. అసలు, వడ్డీకలిపి 4000 బాకీ. ఇన్సురన్స్ మొత్తం 3000 వచ్చింది. తలదాచుకోడానికి ఇల్లయినా ఉంటే మంచిదని నా ఆశ...కానీ, ఎలాగు బాకీ పూర్తిగా చెల్లించడం ?...అప్పుడు మీా నాయుడుమామ నా పాలి దేవతలాగ సహాయం చేశారు. షావుకారుతో మాట్లాడి బాకీ మొత్తం 3500 కు ఫయిసల్ చేశారు. ఇన్సురన్స్ మొత్తం 3000 మిగతా 500 ఆయనే ఇచ్చారు.

కృష్ణ : ఎంత గొప్పదాత.

సుబ్బ: చివరవరకు విను. ఆ విధంగా ఇల్లు దక్కింది. నీకప్పుడు 5, 6 ఏండ్లు. ఈ పూళ్ళోనే బడికి వెళ్ళేవాడవు. నిన్ను పెంచి పెద్దవాణ్ని చెయ్యాలి. నీకు చదువు చెప్పించాలి- అందుకోసం నేను జీవించవలసి వచ్చినది, లేకపోతే ఏ నుయ్యో, గొయ్యో...

కృష్ణ : అమ్మా...

సుబ్బ: విను, విను...మీ నాన్న మీ తాతకు మొదటి భార్య కొడుకు. ఆవిడ చనిపోయాక రెండో భార్యను పెండ్లాడాడు. ముగ్గురో నలుగురో ఆమెకు సంతానం ... మీ నాన్న నన్ను వివాహం చేసుకోవడం ఆమెకు ఇష్టం లేదు. ముఖ్యంగా ఎందుకంటే—మాది బీద కుటుంబం—కట్నాలు కానుకలు ఏమీ లేకనే నన్ను చేసుకున్నారు. అందంగా ఉంటానని.

కృష్ణ: ఇప్పుడు మాత్రం?

సుబ్బ: (విరసంగా) ఇప్పుడు సంగతి ఎందుకు — ముసలి దాన్ని ... ఏ కారణం చేతనైతేనేం మీ నాన్న మారుటి తల్లికి నన్నంటే బొత్తిగా పడేది కాదు. మీనాన్నపోగానే వాళ్ళదగ్గర ఉండి పొమ్మన్నారు గాని నా మనస్సు ఒప్పుకోలే... ఆ నరకానికన్నా బిచ్చమెత్తుకొని బ్రతకవచ్చునని తోచింది. రానని కబురుపంపాను. అమిత కోపం వచ్చిందట, ఆరోజు నుంచి ఈ రోజువరకూ ఆవగింజంత సహాయం చెయ్యలేదు, మీ తాతగాని, మీ మారుటవ్వగాని ...ఎక్కడో వంటపనైనా చేసి నాలుగు డబ్బులు గడిస్తే వాటితో నిన్ను పెంచవచ్చునుగదా అను కొన్నా.

కృష్ణ: అబ్బా, నాకోసరం ఎంత కష్టపడ్డావు!

సుబ్బ: తొందరపడకు...అటువంటి పరిస్థితుల్లో నేను బాధ పడుతూ వుంటే అయాచితంగా నాయుడుగారు ఆద

రించాడు. మనల్నిద్దరిని పోషించారు. నీ చదువుకు అంతరాయం లేకుండా చేశారు. ఆ తరుణంలో ఆయన చూపించిన దయ ఎన్నటికీ మరవలేను ... నాయుడుగారు, మీ నాన్న ప్రాణస్నేహితుడు. అయితేమాత్రం ఎందరు స్నేహితులు ఆ విధంగా ఉంటారు? రోజూ సాయంత్రం తనపని ముగిశాక మన యింటికివచ్చి నన్ను ఓదార్చేవారు. లోకాభి రామాయణం ముచ్చటించేవారు. నీతో ఆడుకునే వారు. మెలమెల్లగా నా దుఃఖం పోగొట్టారు. జీవితంమీద ఆశ పుట్టించారు. నీ కోసరమే జీవిం చాలెనని అనుకున్న నాలో నాకోసరం కూడా జీవిం చాలె ననే భావం ఉదయింప జేశారు. పద్యాలు చదివి వినిపించేవారు. చదవమని పుస్తకాలు ఇచ్చే వారు. కొంత ఇంగ్లీషుకూడా నేర్పారు.

కృష్ణ : బహుశా నిన్ను—(అర్థోక్తిలో ఆగుతాడు.)

సుబ్బ: అవును ... నన్ను ప్రేమించారు. ఆయన భార్య క్షయానికి ఆహుతై పోయినవెనక మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. నామీది ప్రేమచేతనే చేసుకోలే దన్నారు. నా కప్పుడు నిండు యవ్వనం. ఆయన నాకన్న ఏ అయిదారేండ్లో పెద్ద. అంతే ... పరిచయం స్నేహంగా మారింది. అలా సంవత్సరం గడిచింది. ఆ తర్వాతనుంచి ఆయ న్నన్ను ఉంచు కున్నారు.

కృష్ణ : ఆఁ ఆఁ.

సుబ్బ: అవును. మూఢనమ్మకాల్లో పడకపోతే లోకం అదేగదూ అంటుంది. ఎంత ప్రేమించినా, ఎంత పరిశుద్ధంగా వర్తించినా, ఎంత భక్తి విశ్వాసాలు చూపినా, సంఘం నియమించిన నిబంధనల ప్రకారం జరక్కపోతే అవినీతిపరురాలనే కదా ఎన్నుకొంటారు.

కృష్ణ : వివాహం చేసుకోకపోయారా?

సుబ్బ: అంత సులభం కాదు. అదీ కాక నేను సంసారం ముఖ్యంగా చేసుకోలేదు.

కృష్ణ : తరువాత ... కానీ ఎందుకని ఈ కథంతా నాకు చెబుతున్నావో నాకు అగమ్యగోచరంగా ఉంది.

సుబ్బ: తొందరపడకు ... అంతా స్పష్టం అవుతుంది. విను, కొన్ని రోజులకు నేను గర్భవతి నయ్యాను. భగవంతుడు నన్ను ఎన్నివిధాల పరీక్షించాడో చెప్పలేను. నాకేమీ తోచలేదు. ఒకవైపు మందులు మాకులు తీసుకోవడానికి నా ఆత్మ ఒప్పుకోలేదు. శిశుహత్యాపాపానికి ఒడిగట్టుకోలేకపోయాను. ఇంకొకవైపు ఈ సంగతి నీకు ఎప్పుడూ తెలియకూడదనే దృఢ నిశ్చయం... ఈ విషమ సమస్యనుంచి నన్ను కాపాడింది మళ్ళీ ఆ మహానుభావుడే—నాయుడుగారు—ఆరోనెల తిరక్కముందే తీర్థయాత్రకు వెళ్తున్నానని చాటించి నన్ను మద్రాసుకు పంపారు. అక్కడే నన్ను ఉంచి అన్ని ఏర్పాట్లు చేయించి కాన్పు జరిపారు.

కోర్టుపనులకోసరం అనే మిషకల్పించుకుని ప్రతివారం మద్రాసువచ్చి నన్ను కలుసుకునేవాడు. నాయనా, నీకు జ్ఞాపకం ఉందో లేదో — ఆ సమయంలోనే నిన్ను మదనపల్లి ఋషీవ్యాలి స్కూల్లో చేర్పించాడు.

కృష్ణ : ఉంది ... నిన్ను వదలలేక నేను పడ్చింది కూడా జ్ఞాపకం ఉంది.

సుబ్బ: అంతేనా... నీకోసరం నేను కార్చిన కన్నీళ్ళకాలవలు నా ఎడారి హృదయంలోనే ఇంకిపోయాయి ... మిగతాకథ విను. హాస్పిటల్లో ఆడపిల్లని కన్నాను. ఆ పిల్లని అనాథ శరణాలయంలో — పేరు జ్ఞాపకం లేదు—ఉంచుకునే ఏర్పాట్లు చేశాడు. నేనుమెల్లగా ఈ వూరు చేరుకున్నాను ... ఆరు నెలలు గడిచాక నాయుడుగారు మద్రాసులో అనాథ శరణాలయం నుంచి ఒక ఆడపిల్లని తెచ్చుకొని పెంచుకుంటున్నారని ఊళ్ళో తెలిసింది.

కృష్ణ : (తల రెండుచేతులతోపట్టుకొని) ఆ—ఆ—ఆ పిల్ల ...

సుబ్బ: (ఏడుస్తూ) ఆఁ, అవును. ఆ పిల్లనే సరళ — సరళ నీ చెల్లెలు.

కృష్ణ : (లేచి వెర్రిగా పచారు చేస్తూ ఉంటాడు.)

సుబ్బ: నా కన్నకూతుర్ని పరాయిదానిలాగ చూడవలసిన సందర్భం సంభవించింది. ఆ బాధ నీకు తెలియదు తండ్రీ — ఆ కడుపుతీపి — ఇన్ని బాధలు నీ... నీకోసరమే. నన్ను చూస్తే అసహ్యంగా ఉందికదూ.

పాపిని—కాని ఏ పాపంచేసినా నీకోసరమే — నీవు సుఖంగా ఉండాలె — నీవు బాగా చదువుకోవాలె - నీవు పైకి రావాలె అనే ... నా జీవితంలో ఉద్దేశం అదొక్కటే. బాబూ, నిన్ను ఇన్నేండ్లు ఎలా చదివించా ననుకున్నావు? హాస్టల్ ఖర్చులు ఎలా భరించాను? నీవు వేసుకునే మంచి బట్టలన్నీ ఎలా దొరికాయి? ప్రతి దమ్మిడీ ఆయనదే ... ఒక ఘంటకు ముందుకూడా ఇచ్చారు రెండువందలు నీ ఖర్చుకని... నా శీలం పోగొట్టుకొన్నా నంటావా? అనుకో... ఇక నా ముఖం చూడకు—నీకు రెక్కలు వచ్చాయి. ఇక నా సహాయం అక్కర్లేదు ... ఈ దౌర్భాగ్యవ్యక్తి అమ్మ కాదనుకో. (అశ్రుధార)

కృష్ణ : (దుఃఖం పొంగివస్తూంది. గద్గదస్వరంతో) అమ్మా, అమ్మా ... (సమీపించి కాళ్ళు తన చేతులతో కౌగిలించుకొని) ఎంత త్యాగం చేశావమ్మా — నా ... నాకోసరం.

సుబ్బ: (వెక్కి-వెక్కి ఏడుస్తూ) నిజంగా... నిజంగా ... నా బాబు నన్ను ద్వేషించ లేదు... దూషించ లేదు... నా బాబు! నా బంగారుతండ్రి... లే, నాయనా, లే. (తలుపు తట్టిన శబ్దం) చూడు ఎవరో వచ్చారు. (కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంటుంది.)

కృష్ణ : (రుమాలుతో ముఖం తుడుచుకుని తలుపు తీస్తాడు.)

సరళ తొందరగా ప్రవేశించి నేరుగా సుబ్బమ్మ దగ్గరకు వెళ్ళి ... బిగ్గరగా 'అమ్మా' ... అని కౌగిలించుకొంటుంది.

సుబ్బ: (తల నిమురుతూ) నా చిట్టితల్లీ, నా ఈ జన్మలో నీవు నన్ను అమ్మా అని పిలిస్తే వినడానికి నోచుకోలేదనుకున్నాను ... అసలు ఈ రహస్యం మీ కిద్దరికీ ఎన్నటికీ తెలియకుండా ఉండాలని అనుకున్నాను. ఈ విధంగా పరిణమించింది. సత్యాన్ని కప్పిపెట్టడం తప్పని భగవంతుడు బాగా పాఠం చెప్పాడు.

సరళ: అమ్మా, అమ్మా, నావల్ల ఎంత కష్టపడ్డావో ?

సుబ్బ: నీవేమి తప్పుచేశావు తల్లీ. తప్పుచేసింది నేను. అనుభవించాను శిక్ష. కాని నిర్దోషివి నిన్ను, తల్లిలేనిదాన్ని చేశాను.

సరళ: అలా అనకమ్మా... నీవు నామీద చూపించిన ప్రేమ వల్ల నా తల్లి ఎవరు, ఏమైందనే అన్న చింతకూడా ఉండేదికాదు. అత్తా అని పిలిచేదాన్ని గాని తల్లిగానే భావించేదాన్ని.

సుబ్బ: అందుచేత నేగదా నేను పొరబడ్డాను మీ యిద్దరి గురించి. అయితే యిలా జరగడమే మంచిదేమో ! అబ్బ, ఈ రహస్యం నా హృదయంలో దాగుకున్నన్నాళ్ళు ఏదో విపరీతమైన బరువు ఉండేది. ఇప్పుడా బరువు లేదు, తేలిగ్గావుంది. బాబూ అలా పిచ్చివాడి లాగ ఉంటే ఎలాగు ? సరళను ఓదార్చు, దానికి నీవే ధైర్యం ఇవ్వాలి. నీవే బేలపోతే, మరి...

కృష్ణ : ఏమో, నా కేమీ తోచడం లేదు... ఏమీ అర్థం కావడం లేదు. అంశాలన్నీ సమన్వయించుకో లేక పోతున్నానమ్మా.

సుబ్బ: అలా ఉండడం ఆశ్చర్యం కాదు. హఠాత్తుగా ఇంత పెద్ద రహస్యం తెలుసుకునేటప్పటికి ఎవరి మనస్సయినా అల్లకల్లోలంగాక తప్పదు. అన్నీ సరిపోతవి, రోజులు గడిస్తే... నీవొక అమ్మాయిని పెళ్ళాడి, సరళను ఒక అబ్బాయి కిచ్చి పెళ్ళిచేస్తే సరిపోతుంది. బాబూ, నేను పెళ్ళి కానేపు పడుకొంటా. దస్సినట్లయింది, కానీ మనసు నిర్మలమౌతుంది. (సరళను ముద్దు పెట్టుకొని నిష్క్రమిస్తుంది)

సరళ : (చేతులతో ముఖం కప్పివేసుకొని కుమిలి కుమిలి ఏడుస్తూ ఉంది)

కృష్ణ : సరూ, ఏడవకు.— మనమేమీ పాపం చెయ్యలేదు. ఇందులో ప్రకృతికి విరోధమైంది ఏదీ లేదు. ఉంటే, అసలు మనం ప్రేమించుకోవడం ఎలా సంభవిస్తుంది.

సరళ : (తటాలున చేతులు తీసివేసి) కృష్ణా – నీ మాటలు నాకు అర్థం కావడం లేదు. జంతువులకూ మనకూ ఏమీ భేదం లేదన్నమాట ?

కృష్ణ : (విరసంగా) అబ్బే, ఎందుకు లేదూ... జంతువులు మానసికమైన బాధలు పడవు. కృత్రిమ నిషేధాలకూ నిబంధనలకూ లోబడి సహజంగా వచ్చే భావాల్ని

సంహరించుకోవు... జంతువులకు శాస్త్రాలు లేవు, చట్టాలు లేవు.

సరళ : (కోపంగా) మనుష్యులకు నీతి నియమాలు అనేవి లేవనా నీ అభిప్రాయం ?

కృష్ణ : లేవన్నానా ? కావలిసినన్ని ఉన్నాయి. అయితే ఒకప్పటి అవినీతి ఇంకొకప్పుడు నీతిగా మారుతుంది. నేటి నియమం, సదాచారం రేపు నేరం, దురాచారం అవుతుంది. నీతి నియమాలు మానవసంఘం కల్పించు కున్నవి. అందుచేతనే ప్రపంచమంతటా ఒకే నీతి, ఒకే నియమం లేదు... చూడు, మనలో అక్క కూతుర్ని పెళ్ళిచేసుకుంటారు. ఇతర మతస్థులు దాన్ని పాపంగా గడిస్తారు. హిందువుల్లోనే ఇతర ప్రదేశాలల్లో సమ్మతించరు. ఒకేకార్యం కలకత్తాలో పాపం, కర్నూల్లో కాదు... సరూ, ప్రేమ సహజ మైంది. భగవత్ సృష్టికి చెందింది... నీతి మానవులు తమ మేలుకోసరం నిర్మించుకున్నది...

సరళ : కృష్ణా, మనం సంఘంలోనే జీవిస్తున్నాం. సంఘ దూరులం కాలేదే.

కృష్ణ : ఈ దేశం వదిలి ఏదో పరదేశం వెళ్ళిపోతే మనం పాపం చేశామని అనేవాళ్ళెవ్వరు ?

సరళ : అబ్బా! మన అంతరాత్మ చెప్పదా ?

కృష్ణ : (నవ్వి) సరూ, అంతరాత్మ చాలా చిత్రమైంది. కొందరు అలాంటిది లేదు, అంతా భ్రమ అంటారు.

పోనీ ఉందనే అనుకుందాం. ఉన్నా ఆ అంతరాత్మ సంఘ నియమాలకు లోబడే ఉంటుంది...బుద్ధి ఉపయోగిస్తే అంతరాత్మ అదృశ్యమైపోతుంది.

సరళ : ఏమో కృష్ణా, నా మనస్సు నీ మాటలు ఒప్పుకోవడం లేదు.

లోపలినుంచి సుబ్బమ్మ మెల్లగా వస్తుంది,
కానీ సరళా కృష్ణశర్మలు చూడరు.

కృష్ణ : పిచ్చిసరళా, జరిగిపోతే అంతా సరిపోతుంది.

సుబ్బ : (ఖండితంగా) జరగదు, మూమ్మాటికి జరగటానికి వీలు లేదు.

కృష్ణ : (ఉలికిపడి) అమ్మా, ఎప్పుడు వచ్చావు?

సుబ్బ : పడుకుంటే నిద్రపట్టలేదు. కూర్చున్నా-ఇంతలో నీవు ఏదో తీక్షణంగా మాట్లాడుతున్నట్లు వినబడింది. తలుపు చాటునుంచి కొంచెం విన్నా... ఊరుకోవడం మంచిదికాదని అడ్డువచ్చాను. బాబూ, ఎన్నటికీ జరగరాని కార్యం ఇది...

కృష్ణ : ఇందులో తప్పు ఏముందమ్మా? శాస్త్రాలు ఇటువంటి విపరీత పరిస్థితులకు ఎలా అన్వయిస్తవమ్మా?

సుబ్బ : నీతో తర్కించడానికి జ్ఞానం లేదు. అసలు వాదించాలనే ఉద్దేశమూ లేదు.. ఒకేమాట. ఈ పాపానికి మీరు ఒడిగట్టారంటే నా జీవితమంతా నరకబాధ అనుభవిస్తాను. లేదా నా ప్రాణం నేనే తీసేసుకుంటాను.

సరళ : అమ్మా, అమ్మ ... అలా అనకమ్మా. కృష్ణా, మనకోసరం ఎంత త్యాగం చేసింది అమ్మ. అమ్మ కోసరం మనం ఈమాత్రం త్యాగం చెయ్యలేమా.

కృష్ణ : (తోచక ఇటూ అటూ పచారుచేసి, నిలిచి, ఒక క్షణం కండ్లు మూసుకొని, తెరిచి) సరళ నాకు బాగా బుద్ధిచెప్పింది. అమ్మా, నీయాజ్ఞకు వ్యతిరేకంగా నడుచుకోము. ఇదుగో నీ పాదాలంటి ప్రమాణం చేస్తున్నాం.

కృష్ణశర్మ, సరళ సుబ్బమ్మ పాదాలను స్పృశిస్తారు. సుబ్బమ్మ ప్రేమతో తన చేతులను వాళ్ళ భుజాలపై ఉంచి దీవిస్తుంది ... కన్నీరు ధారగా ప్రవహిస్తూ ఉంటుంది.

——— . . . ———

## పాత్రలు:

| | | |
|---|---|---|
| సాంబయ్య | ... | |
| పార్వతమ్మ | ... | సాంబయ్య భార్య<br>విశ్వనాథం చెల్లెలు |
| విశ్వనాథం | ... | |
| సరస్వతమ్మ | ... | విశ్వనాథం భార్య<br>సాంబయ్య చెల్లెలు |
| డాక్టర్ మాలతీ దేవి | ... | |
| నాగయ్య | ... | నౌఖరు |

# భార్యా - భర్తలు

మద్రాసు గాంధీనగరులో ఒక 'ఏ' క్లాస్ ఇంట్లో వీధి ప్రక్కగది- ఒకసోఫా- రెండుకుర్చీలు- మధ్యనబల్ల- ఒకమూల చిన్న పుస్తకాల బీరువా. తెర తీసినప్పుడు ఎవ్వరూ ఉండరు. వెలుపలనుంచి తలుపు తట్టిన చప్పుడు. లోపలిద్వారంనుంచి ఒక నౌకరు వచ్చి తలుపు తీస్తాడు. ప్రవేశం సాంబయ్య, లావుగా పొట్టిగా వుంటాడు. వయసు సుమారు 45, సన్నథోవతి, ఖద్దరు జుబ్బా.

సాంబయ్య: (ప్రవేశిస్తూ చెప్పులు వదలబోతుంటే)

నౌఖరు: ఫరవాలేదండి...

సాంబ: అవును. తెలుసు. (లోపలికి వచ్చాక ఇటూ అటూ చూచి దగ్గుతాడు.)

నౌఖ: తమ పేరు?

సాంబ: సాంబయ్య-అదే, సాంబశివరావు.

నౌఖ: గిరిజమ్మకోసరం కదండి. 9 గంటలకు తమరు వస్తారని చెప్పారండి. ఇంకా 20 నిముషాలు ఉండటం చేత ఇక్కడకు రాలేకపోయానండి - ఇలా దయ చెయ్యండి.

సాంబ: ఆఁ - అవును. ఆలస్యంగా రావడంకన్నా కొంచెం ముందేవస్తే మంచిదికదా అని వచ్చాను. (కుర్చీ మీద కూర్చుంటాడు) అబ్బాయ్!

నౌఖ: నాపేరు నాగయ్యండి.

సాంబ: నాగయ్యా! ఈ యిల్లు గిరిజమ్మగారిదేనా?

నాగ : కాదండి. డాక్టర్ మాలతీదేవిగారిదండి.

సాంబ: మహారాష్ట్రిలా ?

నాగ : ఏమోనండి, తెలుగు చక్కగా మాట్లాడుతారండి.

సాంబ: మరి గిరిజమ్మ డాక్టర్‌గారికి...

నాగ : ఏమీ అవరండి...కాని చాలా స్నేహితం.

సాంబ: వివాహం అయిందా ?

నాగ : ఎవరికండి ?

సాంబ: (పెదవి కరుచుకొని) ఆఁ ? అదే. ఇద్దరికీ.

నాగ : కాలేదండి, అంటే నాకు తెలిసినవరకూ ... క్షమిస్తారా...లోపల కొంచెం పని ఉంది.

సాంబ: ఓ... వెళ్ళు వెళ్ళు. (నాగయ్య వెళ్తాడు)

లేచి బీరువాలో పుస్తకాలు చూస్తూ ఉంటాడు.
ప్రవేశం విశ్వనాథం; చక్కపలచగా కొంత పొడుగ్గా
ఉంటాడు. వయసు సుమారు సాంబయ్య వయస్సే...
డ్రీల్ పట్లం, బుష్ షర్టు ... కాబూలు స్లిప్పర్లు.

సాంబ: (ఎవరో వచ్చిన శబ్దం విని తిరిగి చూస్తాడు) అరే విశ్వం ! ఏమి ఇలా వచ్చావు ? (ఎగా దిగా చూచి) ఏమిటీ వేషం ?

విశ్వ : ప్రశ్నకు ప్రశ్న సమాధానం అయితే — నీవెందుకు వచ్చావు ఇక్కడికి ... నా వేషానికేమి ? ఎప్పుడూ ధోవతే ధరించాలా ?

సాంబ: అబ్బే, బుష్ షర్టు వేసుకుంటే ఏదో కొత్తగా ఉంది అంతే...అది పోనీగాని...మనం ఇద్దరమూ ఇక్కడ కలుసుకోవడం ఆశ్చర్యంగా లేదూ ?

విశ్వ : అవును... ఎవరికోసం వచ్చావు? డాక్టర్ కోసమా.

సాంబ: కాదు... నీవు?

విశ్వ : కాదు.

సాంబ: (పక్కుమని నవ్వి) బాగుంది. సమస్య సమస్యగానే ఉండిపోయింది.

లోపలనుంచి నాగయ్య వస్తాడు మాటలు విని

నాగ : (విశ్వంతో) తమరు విశ్వనాథంగా రనుకుంటాను. (విశ్వ. తల ఊపుతాడు) శారదమ్మగారు తమరు 9 గంటలకు వస్తారని చెప్పారు. ఇంకా పావుగంట ఉంది... కూర్చోండి. (వెళ్తాడు)

విశ్వ : నీవుకూడా ఆ...

సాంబ: (అర్థంచేసుకొని) కాదు, కాదు.

విశ్వ : మరి ఎవరి కోసం?

సాంబ: శారదమ్మ ఎవరు చెప్పమా (ఆలోచిస్తూ)

విశ్వ : చూడు సాంబం, ఏమిటీ దాగుడుమూతలు—మనలో మనకు... నీవు వచ్చింది నాకు తెలిసిపోయింది... నేను వచ్చింది నీకు తెలిసిపోయింది... ఇదా; ఒక లేడీ డాక్టర్ ఇల్లు... పార్వతమ్మకు ఒంట్లో కులాసాగానే ఉందనుకుంటాను ... మరి నీ వెందుకు ఇక్కడకు వచ్చావు? ... లేడీడాక్టరుతో నీకు ఏవిధమైన అవసరం ఊహించుకో లేకుండా ఉన్నాను.

సాంబ: నేనూ ఊహించుకోలేకుండా ఉన్నాను, ఆ శారదమ్మ ఎవరో – ఆవిడతో నీకు ఏమిపనో... దాగుడు మూతలు ఇద్దరమూ ఆడుతున్నాం.

విశ్వ: అదే నేనూ అనడం... ఒకరి కొకరు చెప్పుకొంటే మన రహస్యం మనతోనే ఉండిపోతుంది.

సాంబ: సరే... నీవు చెప్పు ముందు.

విశ్వ: ఇక్కడికి మొదట వచ్చింది నీవు... నీవే చెప్పాలి ముందు... న్యాయంగా.

సాంబ: అలా కాదు, నేను ఎవరికోసరం వచ్చానో నీకు తెలియనే తెలియదు. నీవుమాత్రం ఎవరో శారదమ్మ కోసరం వచ్చావని కొంత తెలిసిపోయింది. నాకు... ఆ మిగతాకూడా చెప్పేస్తే పోతుంది.

విశ్వ: ఈవిధంగా ఏదీ కుదరదు. అన్నివిషయాలూ ఒక్కమారే చెప్పకుండా ఒక్కొక్కరం కొద్దికొద్దిగా చెప్పకుందాం. నన్నుగురించి నీకు ఒక్కముక్క తెలిసింది—నేను ఎవరికోసం వచ్చానో... కనుక నీవు చెప్పాలి, నీవు ఎవరికోసరం వచ్చావో.

సాంబ: (నవ్వి) సరేలే... నేను గిరిజమ్మకోసరం వచ్చాను – మరి ఎవరో ఆ శారదమ్మ.

విశ్వ: ఒక అమ్మాయి... గిరిజమ్మ ?

సాంబ: (పకపక నవ్వి) ఆవిడా ఒక అమ్మాయే!

విశ్వ: సరే బాగుంది. తరువాత మెట్టు నీది. ఆ అమ్మాయి ఎవరు ?

సాంబ: ఎవరో తెలియదు, క్వీన్ మేరీస్ కాలేజీలో చదువు కుంటూ ఉంది అని తప్ప... మరి నీ అమ్మాయి ?

విశ్వ : శారద నా అమ్మాయికాదు ... ఆవిడకూడా క్వీన్ మేరీస్ కాలేజీలోనే చదువుకుంటున్నది... ...మరి గిరిజతో నీకెలా పరిచయమైంది ?

సాంబ: నేను ఇంతవరకు ముఖాముఖి గిరిజను చూడలేదు.

విశ్వ : అరే, ఆశ్చర్యం. - నేనుకూడా ఇంతవరకు శారదను చూడలేదు... ఫొటోలో చాలా చక్కగా ఉన్నట్లు కనబడ్డది. అంతకన్నా ఎక్కువ చెప్పలేను.

సాంబ: అరే - గిరిజకూడా ఫొటోలో చాలా అందంగా ఉంది.

విశ్వ : ఇంతదూరం వచ్చాంకదా, ఫొటోలు చూచు కుందామా ?

సాంబ: (పస్తాయించి) ఆ !

ఇద్దరూ తమ జేబుల్లోంచి ఫోటోలు బైటికితీసి ఒకరికొకరు అందిస్తారు.

విశ్వ : అరే గిరిజ అంతా మీనాకుమారిలాగే ఉందిసుమా.

సాంబ: శారదకూ నూతన్‌కూ చాలా పోలికలున్నాయి కదూ.

విశ్వ : ఈనాటి పిల్లలందరూ సినీమాతారల్లాగే ఉండాలని ప్రయత్నిస్తారులే.

ఫోటోలు ఒకరికొకరు వాపసు చేస్తారు.

సాంబ: అవునుగాని...ఇంకా బోధపడటంలేదు శారదకూ నీకూ సంబంధం ?

విశ్వ : చిత్రంగానే ఉంటుంది. ఇంగ్లీషు కథలు, నాటకాల్లో మల్లే - శారద నాకు ఉత్తరం వ్రాసింది ఇక్కడ కలవమని, అందులోనే తన ఫోటో ఉంచింది.

సాంబ: భలే - మనదీ ఒక నాటకం అయిపోతూవుంది ... అదేవిధంగా గిరిజకూడా తన ఫోటో పంపుతూ ఒక ఉత్తరం వ్రాసింది - ఈరోజు ఇక్కడికి రమ్మని.

విశ్వ : నిజంగా ?... అయితే సాంబం, ఫోటోలు చూచుకున్నట్లే ఉత్తరాలుకూడా చదువుకుందామా? అంతా ఏదో అసాధారణ సంఘటనగా పరిణమిస్తూవుంది.

సాంబ: (మొదట కొంత అనుమానిస్తాడు. కాని, ఆఖరికి సరే అని తల పంకించి అంగీకరిస్తాడు)

విశ్వ : నీ ఉత్తరం చదువుతావా !

సాంబ: నీవే చదువు నీ ఉత్తరం. తరవాత నేను చదువుతా- ఒట్టు...

విశ్వ : ఆల్ రైట్...(పంట్లం జేబులోనుంచి గులాబీరంగు కాగితం పైకి తీస్తాడు.)

సాంబ: అదే రంగు !

విశ్వ : ఏమిటి ?

సాంబ: అబ్బే...నా ఉత్తరం కాగితం కూడా అదే రంగు.

విశ్వ : అందులో వైపరీత్యం ఏమీ లేదు. ఇద్దరూ ఒక్క- కాలేజీవాళ్ళు — స్నేహితులై ఉంటారు ... ఒకే లెటర్ పేపర్ వాడి ఉండవచ్చును.

సాంబ: అవును... చదువు! చదువు!

విశ్వ: (చదువుతాడు) "నేను మిమ్మల్ని ఎలా పిలవాలో తోచడం లేదు. శ్రీ మునగల విశ్వనాథంగారికి నమస్కారంచేసి వ్రాయునది అంటే పురాతనపక్కీగా ఉంటుంది... ప్రియమైన విశ్వనాథంగారూ అంటే ఇంగ్లీషుకు తర్జుమా అవుతుంది ... పోనీలెండి ... ఉత్తరం ఎలాగో ప్రారంభమైంది ... ఇక నెందుకా ప్రశ్న.

సాంబ: ఓహో! ఎంత చమత్కారం!

విశ్వ: (చదువుతూ) నేను ఎవరో మీకు తెలియదు. క్వీన్ మేరీస్ కాలేజీలో చదువుకునే పిల్లల్లో ఒక పిల్లను. నేనూ ఇతర పిల్లలూ సాయంత్రం కాలేజీ ముందో లేక బీచిరోడ్ గట్టుదగ్గరనో పచారుచేస్తూవుంటాము. ...మీరు చూచి ఉంటారు బహుశా...ప్రతిరోజూ మీరు, ఇంకొకాయన లావుగా పొట్టిగా ఉంటాడు రుబ్బురోలులాగ" (నవ్వుతూ) చక్కగా వర్ణించిందోయి నిన్ను.

సాంబ: ఆఁ ఆఁ. ఎంత దుడుకు! అలా ఉన్నానా నేను?

విశ్వ: ఆవిడకంటికి అలా కనబడ్డావు. సరేలే... ఏదో హాస్యానికి వ్రాసింది—(చదువుతూ) "ఇద్దరూ నడిచేవారు ఎందుచేతనో చెప్పలేను. మీతో పరిచయం చేసుకోవాలనే కోరిక మిమ్మల్ని చూచినప్పటినుంచి నానాటికి అధికమైంది. ఇంకొకమ్మాయి చెప్పింది, మీ

పేరూ విలాసం... మొదట కొంత సంకోచించాను గాని తర్వాత ధైర్యం తెచ్చుకొని ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. మిమ్మల్ని కలుసుకోవాలి... మరి ఎప్పుడు? ఎక్కడ?... పై ఆదివారం. నాకు ఆప్త స్నేహితురాలు డాక్టర్ మాలతీదేవి ఇంట్లో... గాంధీ నగర్ 5 వ క్రాస్ రోడ్ - 12 వ నంబరు... ఉదయం 9 గంటలకు మీకిష్టం అయితే.

—శారద"

"పోల్చుకోడానికి ఉపయోగంగా ఉంటుందని ఫొటో పంపుతున్నాను."

సాంబ: (జేబునుంచి ఉత్తరం తీస్తూ) గిరిజకూడా అదేవిధంగానే వ్రాసింది... (చదువుతూ) "మీరెవ్వరో నాకు తెలుసును. నేనెవ్వరో మీకు తెలియదు. రోజూ బీచి షికారులో చూచి ఉండవచ్చును, క్వీన్ మేరీస్ కాలేజి పిల్లలవంక ఎప్పుడైనా చూచివుంటే మీరూ, మీ బంధువులు కాబోలు ఎండిపోయిన తాటిచెట్టు లాగ ఉంటారు" - ఆహా! ఏమి ఉపమానమోయి!

విశ్వ: అయితే నేను ఎండిపోయిన తాటిచెట్టులాగ ఉన్నానా?

సాంబ: ఏమో, ఆవిడకంటికి అలా కనపడ్డావేమో? (చదువుతూ) "ఇద్దరూ నడచి పోతుంటే నా మనస్సంతా మీ మీదే ఉండేది. ఎలాగైనా మిమ్మల్ని కలుసుకోవాలె అని నిశ్చయించుకొని ఈ ఉత్తరం వ్రాస్తున్నాను...... మరి ఎక్కడ ఎప్పుడు కలుసు

పోవడం ! హాస్టల్‌కు మీరు వస్తే గల్లంతు అయి పోతుంది. మీయింటికి నేను రావడం అసంభవం... ఈ సందర్భంలో నా ఫ్రెండు డాక్టర్ మాలతీదేవి నా సహాయానికి వచ్చింది. తన యింట్లో కలవ వచ్చునని చెప్పింది. పై ఆదివారం ఉదయం 9 గంటలకు గాంధీనగర్ 5 వ క్రాస్‌రోడ్ 12 వ నెంబరుకు మీరువస్తే నేను ఉంటాను. తప్పక వస్తారుగదూ... మిమ్మల్ని నేను చూచినా నన్ను మీరు చూడలేదని ఫొటో పంపుతున్నాను.

—గిరిజ"

విశ్వ: ఆలోచిస్తే వీళ్ళిద్దరూ జాయింట్‌గా పనిచేస్తు న్నట్లుంది. ఎంత ఘోరవ ! అందుకనే మన పూర్వులు స్త్రీలకు కట్టుబాట్లు ఏర్పరచారు.

సాంబ: ఏమోలే... ఆ పూర్వపద్ధతుల్లో పెరిగిన మీ పార్వ తమ్మ మా సరస్వతమ్మ లేరూ మనకు మాస్టర్ల లాగ...

విశ్వ: (నవ్వుతూ) వాళ్ళకీ విషయం తెలిస్తే ఇక మనపని-

సాంబ: చచ్చామన్నమాటే...

ప్రవేశం: లోపలినుంచి సాంబయ్య భార్య పార్వతమ్మ, విశ్వనాథం భార్య సరస్వతమ్మ. ఇద్దరూ సమవయస్కులు 35 ప్రాంతంలో. వస్త్రధారణ, అలంకారం చాలావరకూ పూర్వ సాంప్రదాయకంగా ఉంటుంది. ఇద్దరి చేతుల్లో సంచులు;

విశ్వ :
సాంబ: } (ఏకగ్రీవంగా) నీవా?

పార్వ:
సర : } (ఏకగ్రీవంగా) అవును. నేనే.

విశ్వ : అయితే.

సర : ఒహో... చెప్పానే.

పార్వ: (సరస్వతమ్మవంక చూపిస్తూ) ఆవిడే శారద — సరస్వతి అన్నా శారద అన్నా ఒకటేకదూ!

సర : (సాంబ. తో) అమగో ఆవిడే గిరిజ, పార్వతి అంటే పర్వతరాజు కూతురు, గిరిజ అన్నా అదే!

సాంబ: ఒరే, ఎంత మోసం?

పార్వ: మీది న్యాయం, మాది మోసం, ఏం?

విశ్వ : ఫొటో లెవరివి?

సర : (నవ్వుతూ) ఏ కుఱ్ఱవాడైనా చెప్తాడే — ఒకటి మీనాకుమారిది, ఇంకొకటి నూతన్ ది.

విశ్వ : (సాంబతో) మనం అనుకో లేదోయి పోలికలు అలానే ఉన్నాయని.

సర : అబ్బో! సినీమాతారల్లాంటి అందమైన సుందర్లు మిమ్మల్ని వలచి రమ్మన్నారని అనుకొన్నారుకదూ?

పార్వ: అయితే మాత్రం... భార్యల్ని బిడ్డల్ని ద్రోహంచేసి పెండ్లిగాని చిన్న పిల్లల్ని కలుసుకోవడమా? ఏం

చేస్తా మనుకున్నావు? ఇదంతా నాటకం అయిపో బట్టి సరిపోయింది... నిజమే అయివుంటే మాగతి?

సాంబ: అవునుగాని ఎందుకే నాటకమంతా.

పార్వ: బుద్ధి చెప్పడానికి... ఎంతసేపూ మమ్మల్ని హేళనం చెయ్యడం, కొత్తషోకులు చేసుకునే కాలేజీపిల్లల్ని మెచ్చుకోవడంచేత ప్రాణాలువిసిగి మీకు తగినశాస్తి చేస్తామని ఊహించి ఈ కథ అల్లాము ... బుట్టలో పడ్డారు పురుష సింహులు...

సర : ఎందుకే వ్యర్థంగా మాటలు, జ్ఞాపకం ఉండటానికి ఇదుగో అలంకారార్థం గోమయం సమర్పయామి. (అని సంచినుంచి సీసాతీసి పేడనీళ్ళు విశ్వనాథం బుష్ షర్టుమీద పోస్తుంది.)

పార్వ: నిజమే. (అని తన సంచినుంచి సీసా తీసి ఎర్రసిరా సాంబయ్య ధోవతిమీద చల్లుతుంది.)

సాంబ: }
విశ్వ : } ఆఁ ఆఁ. ఏమిటే ఆగడం?

సాంబ: ఎర్రసిరా చల్లడం?

విశ్వ : పేడనీళ్ళు కొట్టడం?

పార్వ: }
సర : } (ఏకగ్రీవంగా) ఆఁ ఆఁ.

పార్వ: ఏమిటే మా అన్నయ్యమీద పేడనీళ్ళా పొయ్యడం?

సర : ఏమిటే మా అన్నయ్యమీద ఎర్రసిరానా చల్లడం?

పార్వ: మట్టూ మర్యాదా ఉండక్కర్లేదే?

సర : నీతి భీతి అవసరంలేదే?

పార్వ: నీకా నాకా?

సర ; నాకా నీకా?

పార్వ: చాల్చాలు.

సర : ఓహో, నన్ను చాలించమనడానికి అధికారం ఎవరిచ్చారో నీకు.

పార్వ: నోరు ముయ్.

సర : శ్రుతి మీరిపోతోంది... జాగ్రత్త.

ఇద్దరూ ముష్టియుద్ధానికి సంసిద్ధులవుతారు.
ప్రవేశం : లోపలినుంచి మాలతి దేవి.

మాల: ఏమిటీ రచ్చ?

పార్వ: చూడు మాలతీ! సరసు చేసిన దుర్మార్గం. అన్నయ్య మీద పేడనీళ్లు పోసింది.

మాల: (నవ్వుతూ, సాంబంవంక జూచి) మరి సరసుఅన్నయ్య మీద నీవేమి చల్లావు?

సర : అదే అడుగు... ఎర్రసిరానా అలా చల్లడం – ఆ ధోవతి చూస్తే ఎవరన్నా ఏమనుకుంటారు?

మాల: (నవ్వి) చాలా బాగుంది, ఆ పేడనీళ్ళ పరిమళానికి ఈ ఎర్రసిరా రంగుకీ సరిపోయింది... వీటిలో ఏది ఉత్తమం ఏది అధమం అని నిర్ణయించడం వృథా యాసరి... నేను డాక్టర్ని, జడ్జీని కాను. అయినా

ప్రతి మానవ వ్యక్తిలో జడ్జీగుణం ఉంటుంది. అంటే న్యాయాన్యాయాల్ని తీర్మానించడం, ఒక కార్యం సబబా చేసబబా అని ప్రతిరోజూ ప్రతి ఒక్కరం తీర్పు చెప్పుతూ ఉంటాం... ఇతర్లను గురించి – మన లను గురించి... అందుచేత నాకు తోచింది చెప్తాను. అందరు నెమ్మదిగా వినండి. నవీన యువతీ వ్యామో హంలో తగుల్కొన్నారని భర్తలకు బుద్ధిచెప్పడానికి ఈ వ్యూహం పన్నారు. సరేగాని ఒక అంశం మీరు ఆలోచించలేదు. ప్రతి మానవుడికీ కొత్తదనంమీద అభిలాష ఉంటుంది. అది ప్రకృతిసహజం... అందు కనే ప్రాజ్ఞులు చెప్పారు – భార్య భర్తకు అనుదినం కొత్తగా కనబడాలని. మీరిద్దరూ పెండ్లైన లగా యతూ మారకుండా అలాగే నిల్చిపోయారు, అది మీ తప్పు. ఆ తప్పువల్లనే మీ భర్తలకు ఈ వ్యామోహం కలిగింది. (సాంబం, విశ్వంవంక చూస్తూ) ముక్కూ, ముఖం ఎరగని ఆడపిల్లలు ఉత్తరాలు వ్రాయగానే ముందూ వెనకా ఆలో చించకుండా ఇలా రావడం మీతప్పు—భర్త తప్పు చేస్తే భార్యకు శిక్షించడానికి హక్కుఉంది. చట్టాల్లో లేదు. కాని అనాదినుంచి వచ్చే సాంప్రదాయం.

'నాథుల్ నేరముల్సేయ పేరలుకం...'

సత్యభామ శ్రీకృష్ణుని కాలితో తన్నిన ఘట్టంలో ముక్కుతిమ్మన్న మాట లివి. ఏవిధంగా శిక్షించ వచ్చునని నియమం ఎక్కడా లేదు. (సరస్వతితో)

నీకు పేడనీళ్ళు వచ్చింది ... (పార్వతితో) నీకు ఎఱ్ఱ
సిరా వచ్చింది. అంతే... భార్య భర్తను శిక్షిస్తే
ఆక్షేపించడానికి ఆడబిడ్డకు అధికారం లేదు. మీకు
మాత్రం తెలియదూ ... అన్నయ్యను శిక్షిస్తే ఆత్మ
గౌరవానికి భంగం కలిగినట్లు తోచింది. మీ ఇద్దరికీ
రోషం వచ్చింది. ఆమాత్రానికే యుద్ధమా ...
చాలు—ఇక నీ నాటకానికి భరతవాక్యం చెప్తాను
... భర్తలు భార్యలు అనుదినం కొత్త కొత్తగా
ఒకరికొకరు కనబడేటట్లు నడుచుకోవాలి — అప్పుడే
దాంపత్యం నిత్యసౌభాగ్యంతో రాణిల్లుతుంది ...
కూర్చోండి. నాగయ్యని పంపించి కొత్త బట్టలు
తెప్పిస్తాం ... అంతవరకు ఆయాసం తీరడానికి
కొంచెం కాఫీ సేవిద్దాం ... నాగయ్యా!

ప్రవేశం: నాగయ్య

అయిదు కప్పులు వేడి కాఫీ. (నాగయ్య నిష్క్రమణ)

అందరూ కూర్చుంటారు.

